*Issued on 31—7—1956*







# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## THURSDAY, 28TH JULY, 1955.

### VOLUME VI — No. I.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1956

Price 6 *annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

Thursday, 28th July, 1955.

The House met in the Assembly Hall, kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### Starred Questions.

*Gosadans.*

119—

*126 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of Gosadans in the State now;

(b) the number of them in good condition;

(c) whether there are proposals with the Government to construct new Gosadans in the State in the current year; and

(d) if so, the number of such Gosadans ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) There are no Gosadans in the State.

(b) Does not arise.

(c) and (d) The question of establishing Gosadans in this State is under consideration.

Sri S. VEMAYYA :—ఈ సంవత్సరములోనే ఆగోసదనములు పెట్టడానికి ప్రయత్నిస్తారా ?

THE HON Sri B. GOPALA REDDI :—Government of India వారి Cattle Preservation and Development శాఖవారు నాలుగింటి

ఎకరాల అడవి వుండాలని. అక్కడనే గోసదనములు పెట్టాలని చెప్పారు. అంత area సంపాదించడము కష్టమని చెప్పిన తరువాత కనీసము వేయిఎకరాలైన అడవి వుండాలన్నారు. వేయి ఎకరాలుకూడ తీసుకురావడము కష్టమౌతోంది. అందువల్ల ఇంక చిన్నవాటిలో పెట్టడానికి వీలుంటుందేమో దర్యాప్తు చేస్తున్నాము.

SRI S. K. V. KRISHNAVATHARAM:— రాష్ట్రములో వున్న గోసదనములకు ఏమైన grants యివ్వడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :— స్థానికంగా private వాండ్లు పెట్టుకొన్నవా, లేక Government తరఫున పెట్టిన వాని విషయము వారు అడుగుతున్నారా ? Private వాటికి బహుశా అక్కడక్కడవున్న మునిసిపాలటీలు యిస్తూ ఉండవచ్చు.

SRI Ch. S. R. V. P. MURTHI RAJU :— పశ్చిమ గోదావరి జిల్లాలో వుపయోగములేని అడవివుంది. అందులో గోసేవాసదనము పెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా?

THE HON SRI B. GOPALA REDDI :— అదికూడ విచారిస్తాము.

SRI M. NAGI REDDI :— అధ్యక్షా ! ఈ గోసదనములకు రాష్ట్ర ప్రభుత్వము ఎంతడబ్బు కేటాయించారు ? ఎన్నిచోట్ల పెట్టాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నది ?

THE HON. SRI B. GOPALA REDDI :— దానికి Government of India వాండ్లు కొంత సహాయము చేస్తారు. 50% of the recurring expenditure in the case of Government. Gosadans and 75% of the recurring expenditure in the case of Gosadans owned by private organisations. ఈ మాదిరిగా రెంటికికూడ వాండ్లు సహాయము చేస్తారు.

SRI G. YELLAMANDA REDDI:— అధ్యక్షా ! ఈ గోసదనములు పశువులు ముసలివైన తర్వాత రక్షణ యివ్వడానికా, లేకుంటే మంచిపశువులను తయారు చేయడానికా ?

THE HON. SRI B. GOPALA REDDI :— రెంటికికూడా స్థలాలు ఉండవలెను. లేకుంటే పింజరిపోల్సు వుండవచ్చును.

28th July 1955]

SRI S. BRAHMAYYA :—పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరులో యీ గోసదనములు private management క్రింద నడుస్తున్నవి. వాటికి ఆర్థిక సహాయము చేయమనిచెప్పి ప్రభుత్వానికి విన్నవించుకోవడము జరిగిందా ? అది మీదృష్టికి వచ్చిందా ? వచ్చినట్లయితే ఏదైనా సహాయము చేస్తారా ?

THE HON SRI B. GOPALA REDDI :—తెలియలేదు. వాండ్లకు సహాయము చేయమని మునిసిపాలిటీకి సిఫారసు చేస్తాము.

Sri V. VISWESWARA RAO:—వ్యక్తులు గోసదనములు నడిపితేకూడా Government grant యిస్తామని చెప్పారు. వ్యక్తులెవరైనా నడిపినపుడు అడవులను కేటాయించడానికి అనుమతిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఐతే వ్యక్తులెవరైన గోసదనములను పెట్టితే మేమే డబ్బుయిచ్చేది, అడవియిచ్చేది, ఒక గోవులనుకూడా యిచ్చేగాది., యీమాదిరిగా, అడిగితే ఏలాగండి ?

Sri K. SUBBA RAO :—కేంద్ర ప్రభుత్వమువారు యీమధ్య ప్రచురించిన మేరకు గోసదనులకు గోసంవర్ధన సంఘాలకు ప్రత్యేకంగా రాష్ట్రప్రభుత్వమువాండ్లు అభివృద్ధి చేయుడానికి ఏమైన చర్య తీసుకుంటారా ? గోసదనులు వేరు. గోసంవర్ధన సంఘాలు వేరని రెండురకాలుగా చెప్పినారు కేంద్రప్రభుత్వమువారు. గోసదనములు పింజరపోల్సువేరే. ఆవులను పెంచి పెద్దచేసి పాడిపంట అభివృద్ధి చేయడానికి ఏమైన చర్య తీసుకోడానికి సిద్ధముగావున్నారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—చాలచర్యలు తీసుకుంటున్నారు ఇప్పటికే. అనేకచోట్ల అనేక farms కూడా పెట్టినారు. ఈ farms లామ., చింతలదేవి ప్రదేశాలలో వున్నవి. ఇంకా ఎక్కువ పెట్టాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నది.

SRI T. JIYYAR DAS :—గోసదనములను పెట్టదలచుకున్న ప్రభుత్వము గోవధశాలలకు లైసన్సు యివ్వడము మానుకుంటుందా ?

THE HON. Sri B. GOPALA REDDI:—ఇప్పటికి కొన్ని regulations వున్నాయి. మునిసిపాలిటీవారు ఎటువంటి పరిస్థితులలో licence లు యివ్వడానికి వీలు వౌతుందోకూడా ఎక్కువ దీర్ఘముగా ఆలోచించవలసి వుంది.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, గోసదనులు private వ్యక్తులద్వారా కాకుండా co-operative సంస్థలద్వారా జరిపేటప్పుడు ప్రభుత్వము సరియైన సహాకారము యిస్తుందా ?

THE HON. Sri B. GOPALA REDDI :—వ్యక్తులకే యిస్తున్నప్పుడు co-operative societies పెట్టితే ఇంక ఎక్కువగా యిస్తాము.

SRI P. KODANDARAMAYYA :—పశ్చిమ గోదావరిజిల్లాలో వున్న పశుగణము అంతయుకూడా పోలవరంతాలూకాలో విశేషముగావున్న పచ్చిక బయిళ్లలోకి వచ్చి మేస్తున్నాయి. ఇదివరకు regular గా Government పెట్టక పోయినా గోసదనులక్రింద కొన్ని వుంటున్నాయి. వాటికి తగినచర్య వెంటనే తీసుకొని ప్రభుత్వము ఏర్పాటుచేస్తే బాగుంటుంది గనుక ఆలోచనచేసి ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—తప్పకుండా.

*District Superintendents of Police, Deputy Superintendents of Police and Circle Inspectors in Police Department.*

120—

*62 *Q*.—SRI S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) (1) the number of District Superintendents of Police;

(2) the Deputy Superintendents of Police; and

(3) the Circle Inspectors in the State now; and

(b) the number of Harijans out of them ?

THE HON SRI N. SANJEEVA REDDI :—

The number of District Superintendents of Police, Deputy Superintendents of Police, Circle Inspectors of Police in the Andhra State and the number of Harijans in each cadre is as follows :—

| Designation | No. of posts. | No. of Harijans. |
|---|---|---|
| District Superintendents of Police | 16 | ... |
| Deputy Superintendents of Police | 45 | 1 |
| Circle Inspectors. | 139 | 2 |

SRI S. VEMAYYA :—Dy. S. P. నుంచి జిల్లాపోలీసు సూపరింటెండెంట్లుగా హరిజనులను promote చేయడానికి ఏమైన ప్రభుత్వం పూనుకుంటుందా?

THE HON. SRI N. SANJEEVA REEDI :—హరిజనులు కొబట్టి promotions యివ్వరు. మిగిలినవన్ని సరిపోయినప్పుడు హరిజనులకైనకూడా promote చేస్తాము.

SRI S. NARAYANAPPA :—ఉద్యోగస్థులు ఆయాప్రాంతాలలో సంచారముచేసినప్పుడు అక్కడి స్థానిక M. L. As కు వారి tour programmes పంపడములేదు. ఆవిధంగా పంపించడానికి మంత్రిగారు ఉత్తరువులు చేస్తారా ?

28th July 1955]

MR. SPEAKER :— Tour programmes have nothing to do with promotions.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Dy. S. P. ఉద్యోగాలను direct recruitment కదా. 45 మంది Dy. S. P. లు వుంటే అందులో కేవలము ఒకేఒక హరిజనుడు వున్నాడు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—It is not direct recruitment. Part of it is.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Dy. S. Pలు కొంతమందిని directగా recruit చేస్తున్నారు కదా. అందులో హరిజనుడు కేవలము ఒకే ఒకడు వున్నాడు. ఆసంఖ్యను పెంచడానికి ప్రభుత్వమేమైన ఆలోచిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Direct recruitmentలో వాండ్లకు proportion వుంది. Direct recruitment లో హరిజనులకుకూడా reservation వుంది. కాని మన partition అప్పుడు హరిజనులందరు residuary State లో వుండిపోయినారో ఏమో. నాకు తెలియదు కాని, ఆంధ్రరాష్ట్రము వచ్చినతర్వాత యిద్దరినిమాత్రమే recruit చేశాము. అందులో ఒకడు షెడ్యూల్ కాస్టువా డున్నాడు.

SRI C. SUBBARAYUDU :—ఆంధ్రేతరులు ఎంతమందివున్నారండి ?

THE HON. Sri N. SANJEEVA REDDI:—Partition Committee రోజులలో కొంతమంది ఆంధ్రేతరులను తీసుకోవడము జరిగింది. తర్వాత particular information వుంటే సుబ్బరాయుడుగారే అందజేయాలి.

SRI P. RANGA REDDI :—ఈ 45మందిలో ఉండే ఒక్క హరిజనుడూ తెలుగువారా, లేక అరవవారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—మొదట questionలో recruitment ను గురించి, ఇప్పుడు హరిజనులనుగురించి అడిగారు. భాషలను గురించి ఇంకో facial expressions ను గురించీ, ఇంకో శృంగారంగురించీ వేరే ప్రశ్న అడిగితే చెబుతాను.

SRI A. KALESWARA RAO :—ప్రభుత్వము వారు హరిజనులను నియమించినా, వెనుకబడినజాతులను నియమించినా ఇంకో కులాలవారీగా నియమించినా,

[28th July 1955

ఇవి క్రొత్త నియామకములకే సంబంధించి ఉంటయా? లేక, ఇదివరకు senior గా ఉన్న వాళ్ళను దాటించి వీళ్ళకి promotion ఇస్తారా ?

THE HON SRI N. SANJEEVA REDDI :—Promotion seniority ఒకటే కాకుండా merit service, honesty అన్నింటినిబట్టి promotions వస్తాయిగాని, promotions ఎప్పుడూ cammunal గా లేవు.

Sri V KURMAYYA :—హరిజన సబ్ ఇన్‌స్పెక్టర్లుగాని, Circle Inspector లు గాని, డెప్యూటీ సూపరింటెండెంట్లుగాని ఉన్నారు. ఐతే వారి confidential sheets బాగా ఉండవు. ఎందుచేత ఉండవంటే సాధారణంగా higher officers లో అన్ని కులాలవారూ ఉండడంచేత.

MR. SPEAKER:—The Hon. Member is making a speech.

Sri V. KURMAYYA:—అన్ని qualifications ఉండి, promotions కు అర్హత కలిగియుండికూడా. confidential sheets బాగుండలేదనే నెపంతో వాళ్ళకు promotion దొరకడం లేదు. గవర్నమెంటు ఈ విషయంలో తగిన శ్రద్ధ తీసుకుంటారా ? Officers కు ఏమైనా instructions ఇస్తారా అని అడుగుతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—Confidential files బాగా లేవట. ఇంక మిగిలినవే వున్నాయో—నాకు అర్థం కాలేదు. Promotion is based only on confidential reports of the higher officers. అది ఒక్కటే బాగాలేదు. మిగిలినవన్నీ బాగున్నాయంటే, మిగిలిన వింక శృంగారం, గింగారం. మేము photoలు తెప్పించుకోము. Records ను బట్టి promotions చేస్తూఉంటాము.

Sri P. VENKATASUBBAYYA :— ఉన్న ఆఫీసర్లంతా residuary State లోనే నిలిచిపోయారంటున్నారు. ఆ కొరత పూరించేదానికి ఎక్కువ concessions ఇచ్చి హరిజనులను ఎక్కువమందిని తీసుకోడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—Residuary State లోకి పోయిఉంటారేమో అన్నాను. I am not very sure about it. Direct recruitment లో హరిజనులకు scheduled castes కి reservation ఉంది. ఇక్కడ లేక పోవడానికి కారణం అదే అనుకుంటాను. అప్పు డక్కడే

28th July 1955]

joint గా select చేసేవాళ్ళం. Madrasలో scheduled castes వాళ్ళు ఆంధ్రులే ఉండాలని లేదు. అరవవాళ్ళు ఎక్కువగా వచ్చియుండవచ్చు. ఇక్కడ లేకపోవడానికి కారణం అదే. మరి ఇప్పుడు weightage ఇవ్వడం అంటే నాలుగురోజులు fast చేస్తే, నాలుగురోజుల భత్యం ఒక్కరోజు తిన్నట్లవుతుంది. అది సాధ్యం కాదేమో ననుకుంటాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :—Circle Inspectors లో 139 మందికి ఇద్దరే ఉండడానికి కారణం ఏమిటండీ ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—అది Sub-Inspectors నుండి. Direct recruitment లేదు. కాబట్టి reservation అనేది లేదు. It is only, promotion purely on merit and record.

Sri PILLALAMARRI VENKATESWARLU :—Merit and record మీద, హరిజనులకేమన్నా అన్యాయం జరుగుటకు అవకాశం ఉందేమో! ఉండవచ్చు కూడాను. కేవలం ఆ confidential reports మీదనే కాకుండా అవసరమైతే ఇంకా లోతుగా కూడా ఆలోచించి ప్రభుత్వం హరిజనులకు ఎక్కువ మందికి promotions ఇవ్వడానికి ఆలోచిస్తుందా ?

MR. SPEAKER :—We are getting that Demand.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఆ లోతు ఏమిటో చెప్పమని అడుగుతున్నా ఇంకా లోతుగా ఆలోచించమన్నారు. ఆ లోతు ఏమిటో చెబితే ఆలోచిస్తాం.

SRI G. NAGESWAR RAO :—అధ్యక్షా! ఈ మధ్య women police officers ని కూడా appoint చెయ్యాలని proposal ఉన్నదని విన్నాం. ఉంటే ఏమన్నా woman police officers ఉన్నారా ? లేకపోతే woman police officers ను వెయ్యడానికి ఏమన్నా ప్రయత్నం చేస్తారా ?

THE HON Sri N. SANJEEVA REDDI :—Women police officers ను appoint చెయ్యడం అనేది గౌరవ సభ్యులకు ఎట్లా తెలిసిందో కాని మా department లో ఇంతవరకూ ఆలోచించ లేదు. వారిని appoint చేస్తే ఒక్క ప్రమాదం ఉంది. వారిని protect చేయడానికి మళ్ళీ men police వెనకాల ఉండాలి. కాబట్టి ఎందుకు ఈ బాధ?

*Increase of Bed Strength in Government Headquarters Hospital, Cuddapah.*

122—

*338 Q.—SRI P. VENKATASUBBAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether there is any proposal with the Government under Second Five-Year Plan to increase the bed strength of the Government Headquarters Hospital, Cuddapah ?

THE HON. SRI K. VENKATA RAO :—

Proposals for increasing the bed strength of the Government Headquarters Hospital, Cuddapah are under consideration of the Government and the question of including it in the Second Five-Year Plan will be decided soon.

SRI P. VENKATASUBBAYYA :—కడప హాస్పటల్‌లో Bed strength చాలని కారణంచేత patients అందరు వరండాలో క్రిక్కిరిసి పడుకుంటూ యున్నారు. అక్కడ Bed strength increase చేయడాన్ని గురించి ప్రభుత్వం త్వరగా ఆలోచిస్తుందా ?

THE HON. Sri K. VENKATA RAO :—అల్లాగే కర్నూలు హాస్పటల్‌లో కూడా పడుకుంటున్నారు. అనంతపురం హాస్పటల్‌లో పడుకుంటున్నారు. నెల్లూరు ఆసుపత్రిలో పడుకుంటున్నారు. అన్నిటితోపాటు కడప వ్యవహారం కూడా వస్తుంది.

Sri M. NAGI REDDI :—అధ్యక్షా, ఇప్పుడు హాస్పటల్‌లో ఎంత bed strength ఉన్నది? ఇంకా ఎంత పెంచాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది?

THE HON. Sri K. VENKATA RAO :—Average మీద 235 ఉన్నది. ఇంకా దాన్ని District Headquarters-Hospital చేయాలంటే bed strength ను 400, 500 దాకా పెంచవలసియుంటుంది.

Sri G. SURYANARAYANA :—అధ్యక్షా ! అది ఒక్క కడప Hospital లేనా ? లేక తతిమ్మా జిల్లా Hospitals అన్నికూడనా ?

THE HON. Sri K. VENKATA RAO :—ఇప్పుడు వారు వేసిన ప్రశ్న కడపను గురించి.

Sri G. SURYANARAYANA :—ఇప్పుడు నా ప్రశ్నకు సమాధానం చెబుతారా శ్రీకాకుళం గురించి?

THE HON. Sri K. VENKATA RAO :—కాగితం కలం పుచ్చుకొని వ్రాస్తే సమాధానం చెబుతాను.

*Loans to Municipalities for Drainage Schemes.*

123—

*426 Q.—SRI P. RANGA REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) how many Municipalities in the State have asked for the grant of loan of aid for implementing drainage schemes and which are those Municipalities;

(b) the action that the Government have taken on the requests of these Municipalities; and

(c) whether the Government have asked any aid in this respect from the Planning Commission or Union Government and if so, with what result ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Five Municipalities, namely, Vijayawada, Visakhapatnam, Eluru, Masulipatnam and Rajahmundry have asked for the grant of loan for implementing drainage schemes of these Municipalities.

(b) A loan of Rs. 76,213 was sanctioned to the Visakhapatnam Municipality for a partial drainage scheme during 1954-55. The question of sanctioning loan to the Vijayawada Municipality during 1955-56 for its Drainage scheme is under consideration. The question of financing the Eluru, Rajahmundry and Masulipatnam drainage schemes has not yet been settled. The question of granting a loan will be considered only after examining the financial ability of the Municipalities to meet the cost of the schemes. The Vijayawada, Eluru and Visakhapatnam Drainage schemes have been included in the First Five Year Plan.

(c) The Government of India in the Ministry of Health were requested to sanction a loan of Rs. 341.67 lakhs to this state under the National Water Supply and Sanitation Scheme their Water Supply and Drainage Schemes. A loan of

for distribution to the local bodies in this state for Rs. 1·0 Crore has been sanctioned by the Government of India. No separate application for Drainage schemes alone has been made to the Government of India.

MR. SPEAKER :—This matter was thoroughly discussed on the Health Demand only two days back.

Sri PILLALAMARRI VENATESWARLU :—విజయవాడ మ్యునిసిపాలిటీ ఎంత లోను అడిగింది ?

THE HON. Sri K. VENKATA RAO :—ఈ విషయం ఇక్కడ లేదండి.

Sri P. RANGA REDDI:—ఎప్పుడైనా Government of India ను loan అడిగినప్పుడు ఫలానా, ఫలానా స్కీములకు మాకు ఈ loan కావాలని అడగడం జరుగుతోందా ? ఐతే ఈ ఇన్స్టాలు నలబై యొక్క లక్షలకూ పంపించిన scheme లు ఏవి ? వచ్చిన కోటిరూపాయిలను ఏ scheme లకు ఇచ్చారు ? రాజధాని ఏర్పడిన తరువాత కర్నూలు మ్యునిసిపాలిటీ drainage scheme కోసం అడగడం జరగలేదా ?

THE HON Sri K. VENKATA RAO :—కర్నూలుకు వాటర్ లేదు. ఇంకా drainage దాకా ఎందుకు ? నెమ్మదిగా చూడవచ్చు. విజయవాడ లోనూ నేను చెప్పిన ఇతరపట్టణాలలోను ఈ ఏడాది పని మొదలుపెడుతున్నాం. మనకువచ్చిన డబ్బును అందరకూ పంచి పెడుతున్నాం.

MR. SPEAKER :—The question is whether schemes were prepared and sent to the Government of India to claim those grants.

THE HON. SRI K. VENKATA RAO :—If we do not send the schemes, the Government of India would not give the grant. But we have not yet sent.

Sri A. KALESWARA RAO :—నిన్న నేను ఒక ప్రశ్న వేస్తే మంత్రి గారు వచ్చే Municipal Chairman కు చెప్పమని అన్నారు. ఇప్పుడు విజయవాడ drainage scheme కు ఎంత మొత్తము ప్రభుత్వమువారు sanction చేశారు? ఈ సంవత్సరం ఎంతమటుకు ఖర్చుపెడతామని అనుకొంటున్నారు ? ఏయే తాలూకాలలో పని ప్రారంభిస్తారు ? అంతేకాకుండా ఇంకా ఏమైనా షరతులు ప్రజలమీద విధించారా ?

MR. SPEAKER :—That information is in the Budget.

SRI A. KALESWARA RAO :—There is nothing about Vijayawada Municipality.

THE HON. SRI K. VENKATA RAO :—వారు ఒక short notice question ఇచ్చారండి. తమరు allow చేస్తే జవాబుచెప్పతాను.

MR. SPEAKER :—దీనికి జవాబుచెప్పితే, అది disallow అయి పోతుంది.

MR. SPEAKER :—Questions Nos. 124 and 307 may be clubbed together and answers may be given. Supplement arise will follow for both.

*Confidential Files of Government Servants.*

124—

*205 *Q.*—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state whether the Government are maintaining confidential files of Government Servants in the State ?

THE HON. SRI B. GOPALA REDDI :—

Personal files of Government Servants in the State and Subordinate Services are maintained by the competent authority who may be either the Government or a subordinate authority as the case may be.

*System of "Confidential Files."*

307—

*927 *Q.*—SRI M. RAJESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state whether there is a proposal with the Government to abolish the system of "Confidential Files" in the Services ?

THE HON. SRI B. GOPALA REDDI :—

The answer is in the negative.

SRI S. VEMAYYA :—Confidential files ను maintain చేస్తున్నప్పుడు, వాళ్లకు adverse remarks communicate చేయాలని ఉన్నప్పటికీ కూడ, ఎక్కడకూడ ఇవి communicate చేయబడడంలేదు.

MR. SPEAKER :—This was answered by the Chief Minister in his Budget speech.

THE HON. SRI B. GOPALA REDDI :—ఇంతకుముందు ఉండినటువంటి instruction తీసివేసి, మొన్ననే ఫిబ్రవరి 4, 5 తేదీన క్రొత్తగా instructions ఇవ్వబడినాయి. అందులో "Adverse remarks relating to remediable defects made in the personal file should be communicated to the officers concerned without quoting the authority so as to enable him to rectify such defects," అని definite గా చెప్పబడింది. కనుక అటువంటి adverse remarks ఉంటే తప్పకుండా తెలుపుతూ ఉంటారు.

SRI PILLALAMARRI VENKATESWARLU:—Remediable defects అని పెట్టినప్పుడు. ఏ ఆఫీసరు అయితే ఆ remarks వ్రాస్తాడో అతని చేతిలోనే ఆ discretion ఉంటుంది. What is remediable defect has to be decided by the particular officer. Nobody can decide then and there. అందువల్ల "remediable defects" అని చెప్పకుండా, adverse remarks ఏవి ఉండినాకూడ, వాటిని communicate చేయాలనే విధంగా ఆ order మారుస్తారా?

THE HON. SRI B. GOPALA REDDI:—అటువంటప్పుడు adverse remarks మాత్రమే ఎందుకు, favourable remarks కూడ communicate చేయవచ్చు. ఒక్కొక్కప్పుడు ఇతడు బాగా పనిచేస్తాడు, చాలా popular గా ఉన్నాడు అని వ్రాస్తే అదికూడ తెలిపితే బాగుంటుందేమో! అప్పుడు, అన్ని remarks, అంటే ఆ confidential sheet అంతా అతనిచేతిలో పెట్టాలన్న మాట.

MR. SPEAKER :—Then it ceases to be confidential.

SRI PILLALAMARRI VENKATESWARLU:—Remediable defects అని అన్నప్పుడు, అవి rectify చేసుకోగలరా లేదా అనేది ఆ remarks వ్రాసేటటువంటి officer మీద ఆధారపడి ఉంటుందని నేను చెప్పుతున్నాను. కనుక adverse remarks ఏవి వ్రాసినప్పటికిని ఇదిగో ఫలానా adverse remarks వచ్చాయి, ఇవి మార్చుకొంటే బాగుపడతావు, అని తెలిపినట్లయితే, ముందుకు బాగుపడడానికి అవకాశం ఉంటుంది. కాబట్టి ప్రభుత్వము దీనిని తిరిగి ఆలోచించి, remediable defects అనేవిమాత్రమేకాకుండా adverse remarks ఏవి వచ్చినప్పటికిని, అవి ఆ ఉద్యోగికి communicate చేసేటట్లు చూస్తారా?

THE HON. SRI B. GOPALA REDDI:—దాంట్లో రెండురకాలైన remarks ఉంటున్నాయి. ఇచ్చేటటువంటి జీతానికి అతని దగ్గర maximum work తీసుకోవాలని ఏ ప్రభుత్వమైన ఉద్దేశిస్తూ ఉంటుంది. అటువంటప్పుడు ఆ adverse remarks లో ఏది అతనికి చెప్పితే బాగుచేసుకోడానికి వీలుంటుందో అది తప్పకుండా చెప్పతారు. ఒకరి విషయంలో "you are not able to extract work from your subordinate officers" అని ఉన్నదనుకోండి, అది తెలుపుతారు. సాధ్యమైనంతవరకు అటువంటివి తెలుపుతూఉంటారు, తెలుపకుండా అతన్ని ఏదో slaughter చేసి ఇంటికి పంపించవలెనన్నే ఉద్దేశం ఎవరికీ ఉండదు.

SRI A. BALINEEDU —పై ఆఫీసర్లకు supplies బాగా జరుగక పోతే, confidential files చాలా చెడిపోతాయనేది ప్రభుత్వదృష్టికి వచ్చిందా?

THE HON. SRI B. GOPALA REDDI :—

This is too sweeping a remark against all officers.

Sri G. YELLAMANDA REDDI :—ఈ విధంగా adverse remarks communicate చేయవలసిందని order వేశారు గాని అది ఆచరణలో పెట్టబడడంలేదని ప్రభుత్వము గమనించవలసి యున్నది. ఇదివరకు B. S. O. లో కూడ ఈవిధంగా ఉండేది కాని సక్రమంగా అమలు జరగలేదు. కనుక దీనిని సక్రమంగా అమలుజరపడానికి ప్రభుత్వము ఏమిచర్య తీసుకొంటున్నారు? Remediable defects ఉన్నప్పుడు వాటిని communicateచేయాలని ఒక clause పెట్టారని చెప్పారు. కాని అది ఆచరణలో లేకుండా పోతోంది. కాబట్టి అటువంటి ramarks వెంటనే ఆయా ఉద్యోగులకు అందచేసేటట్లు చూస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ విషయం దీర్ఘంగానే ఆలోచించి మొన్న ఫిబ్రవరిలోనే కొత్త instructions ఇచ్చారు. అవి విపులంగా ఉన్నాయి. దానిప్రకారం complaints ఉండవేమో అనుకొంటాను.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా! పై officerకు subordinate కు మధ్య అభిప్రాయబేధము వచ్చినపుడు ఈ confidential sheets లో " he is not up to the mark, inactive, not industrious" అని ఈ విధంగా specificగా లేకుండా వ్రాస్తారు. ఇలాకాకుండా, అతని confidential sheet లో వ్రాయవలసి వచ్చినప్పుడు, specific remarks వ్రాస్తే ఆ defects సర్దుబాటు చేసుకోడానికి వీలుంటుంది. ఆవిధంగా ఆఫీసర్లందరికీ ఉత్తరువు చేయడానికి ప్రభుత్వము ఒప్పుకొంటుందా?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆ విషయమే ఎక్కువగా ఈ క్రొత్త G. O. issue చేసేటప్పుడు చర్చించారు. Remarks definite గా వుండవలెనని, vague గా ఉండకూడదని definite గా చెప్పారు.

SRI C. P. THIMMA REDDI :—అధ్యక్షా! ఈ confidential report లో remarks ఆయా department లో అతని పనివిషయం గురించి మాత్రమే ఉంటుందా? లేక అతనియొక్క character గురించికూడ ఉంటుందా? అనగా శాస్త్రవిరుద్ధంగా అతను ప్రవర్తిస్తున్నట్లయితే ఆ విషయంకూడ ఉంటుందా?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ confidential sheets లో, conduct and character, intergrity of the officer, tact and temper మొదలగు headings అన్నీ ఉన్నాయి కాబట్టి ఆయన ప్రవర్తన గురించి remarks వ్రాయబడతాయి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Remediable defects అనేవి తెలియజేస్తామని అన్నారు. తెలియజేయనటువంటి defects ఏవో చెప్పగలరా?

THE HON. Sri B. GOPALA REDDI :—Notice

Sri P. NARASIMHAPPA RAO :—మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు పై ఆఫీసర్లకు supplies చేయలేదనే కారణంచేత అటువంటివారిని క్రిందికి త్రోసివేశారు. ముఖ్యంగా చాలా మంది తెలుగువాళ్ళకు ఆ విధంగా promotions లేకుండా చేశారు. కనుక అటువంటి కేసులన్నీ దర్యాప్తుచేసి, వారి ప్రస్తుత రికార్డ్లు చూచి వారికి promotions ఇచ్చేటట్లు చూస్తారా?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆ విధంగా ఈ confidential reports యొక్క విలువలేకుండా చేయడం మంచిదికాదు. ఇది చాలా ఉపయోగమైనటువంటి విషయము. supplies లేనందువల్లనే remarks బాగా వ్రాయలేదు అన్నమాటకు అవకాశంలేదు.

SRI D. VENKATA SUBBA RAO :— అధ్యక్షా! remediable defects అవునా కాదా అనేది ఆ remarks వ్రాసిన officer యొక్క discretion బట్టి ఉంటుంది కనుక వారు యిష్టంవచ్చినట్లు వ్రాస్తారు.

MR. SPEAKER :—That question was already answered.

SRI P. RAJAGOPAL NAIDU :—అధ్యక్షా, కొందరు ఉద్యోగులు తమవారికి ఉద్యోగాలు ఇచ్చుకోవాలని, ఈ confidential reports సరిగా

వ్రాయడంలేదు గనుక ఈ confidential reports ఉండకూడదనే ఆందోళన హెచ్చుచున్నదనే విషయం ప్రభుత్వమునకు తెలుసునా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అందుకోసమనే ఈ విధంగా చెప్పారు. "All reporting should be absolutely free from projudice leaving of castism, regionalism and provincialism" ఈ విధంగా definite గా చెప్పినారు. Remarks specific గా కూడ ఉండాలని చెప్పబడింది. ఈ confidential reports ఉండినందువల్ల ఎవరు బాగపనిచేస్తున్నారు, ఎవరులేదు, అని తెలుసుకోనేదానికి వీలుంటుంది. కనుక ఇవి వుండవలసిన అవసరమున్నది.

Sri S. K. V. KRISHNAVATARAM :—మంత్రులపైన కూడ confidential reports maintain చేయడానికి శాసనసభనుంచి ఒక కమిటీని నిర్ణయించడానికి ప్రభుత్వము అంగీకరిస్తుందా ?

THE HON SRI. B. GOPALA REDDI :—ఏమి ఆక్షేపణలేదు, శాసనసభ్యులమీదకూడ confidential maintain చేసే పక్షములో.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఈ confidential registers తాలూకా ఆఫీసులోనివి తాలూకా ఆఫీసులోనే ఉండిపోవడం. R. D. O's office లోనివి, R. D. O's office లోనే ఉండిపోవడంవల్ల, ఒక officer పోయినతరువాత ఇంకొక officer వచ్చి ముందు reports ను అనుసరించే వ్రాయడం జరుగుతున్నది. కొబట్టి తాలూకా ఆఫీసులో ఒక officer confidential reports వ్రాసిన తరువాత ఆ originals అన్నీ R. D. O's office కు పంపించడం, R. D. O's office లో వ్రాసినవి Collectorate కు పంపించడం ఇలాంటి మార్పులు ప్రభుత్వం చేయడానికి ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ confidential registers ఆ officer లు ఎక్కడ పనిచేస్తూంటే అక్కడ ఉంటాయి. ఆ officer లు ఎక్కడికి బదలీఅయితే అక్కడికి పోతూఉంటాయి. వీటికి scrutinising officers వేరేఉంటారు. ఎప్పటికి immediate superiors ఈ reports వ్రాస్తారు. తరువాత వీరికి పై అధికార్లు, అనగా Heads of Depart ments లేక Collectors ఈ reports ను scrutinise చేస్తారు. కోటయ్యగారు Taluk Office లో వ్రాసిన reports R. D. O's office లో ఉంచేటట్లుగాను, R. D. O's office లో వ్రాసినవి Collector's office లో

ఉంచేటట్లుగాను చేయవలెనని చెప్పుతున్నారు. కాని నా ఉద్దేశం ఆ ఆఫీసురుతో కూడ ఇవిఉంటే మంచిది. Immediate superiors కు అది సహాయకరంగా ఉంటుంది. కనుక అతను ఏ ఆఫీసరుతో పనిచేస్తూఉన్నాడో, ఆ ఆఫీసరుదగ్గర ఉంచేనే మంచిది.

Sri PRAGADA KOTAIAH :—తాలూకా ఆఫీసులో తహశిల్ దారు అక్కడ వున్నవారిమీద confidential sheets లో వ్రాసిపోతారు. వ్రాసిన తరువాత యింకొక తహశిల్ దారు వచ్చినప్పుడు అది చూస్తూన్నారు. ఆ confidential sheet అక్కడనే వుంచడమువల్ల, వచ్చిన తహశిల్ దారు తిరిగి అదే అభిప్రాయము form చేసుకోటానికి అవకాశము ఏర్పడుతుంది. కనుక ఒక తహశిల్ దారు transfer అయి వెళ్లిపోయేటప్పుడు ఆయనవ్రాసిన confidential sheets R.D.O. కు పంపుతూ, తరువాతవచ్చిన తహశ్శీలుదారు అక్కడ పనులనుబట్టి confidential sheet వ్రాసేమార్గము అనుసరిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—సభ్యుడు చెప్పిన మాదిరిగా కాదు. ముందువున్న తహశిల్ దారు ఏమివ్రాశాడో అది తరువాతవచ్చిన తహశిల్ దారు తెలుసుకోవడం మంచిదేమోనని నేను అనుకొంటాను, Succeeding Tassildar ముందువున్న తహశిల్ దారు వ్రాసినదానినిబట్టి యిప్పుడు అదేమాదిరిగా వున్నాడా, లేకపోతే improve అయినాడా అనేది తెలుసుకొని, ఈ ఆరుమాసాలలో ఆయన improve అయ్యాడు అని చెప్పటానికి వీలుగావుంటుంది. అవిధంగా అది సవరించి వ్రాయటానికి వచ్చిన తహశిల్ దారుకి వీలుగా వుండేటట్లు వుంచేనే మంచిది అని నా అభిప్రాయము.

Sri C. SUBBARAYUDU :—ఏ లంచగొండి వుద్యోగి అయినను క్రింది వుద్యోగి తనమాట వినకపోతే, చాలావరకు అతనిని damn చేయడం జరుగుతున్నది. ఇది ప్రతిఒక్కరూ చూస్తూన్నాము, వింటూవున్నాము. అటువంటప్పుడు subordinates కు protection ఉండదు కనుక వారి విషయాలు ఏదైనా injustice జరిగినప్పుడు కూడా దానికి remedy చేయటానికి అవకాశము కలిగిస్తారా ?

THE HON SRI B. GOPALA REDDI :—Subordinates అందరూ సత్యహరిశ్చంద్రులని, superior officers అందరు దుర్మార్గులు, హిరణ్యకశ్యపులు అని అనుకోవడం అంత న్యాయము కాదు అని అనుకొంటాను. వారిలోనూ, వరిలోనూ అటువంటివారు వున్నారు, ఇటువంటివారుగూడా వున్నారు,

Sri B. SANKARAIAH :—ఎంత న్యాయముగా చేసినప్పటికీ, పై అధికారి క్రింద అధికారిమీద వ్రాసేదానికన్నా, దాన్ని యింకొక విధముగా యితర పద్ధతులలో వ్రాసేదానికి ఏమైనా ప్రయత్నిస్తారా ? ఇప్పుడు "Judicial" "Non-Judicial" అని వేరే చేసినట్లుగానే, యీ confidential sheets కూడా యితర విధాలుగా వ్రాస్తే, కొంతవరకైనా న్యాయము జరగటానికి వీలుంటుంది. ఆ ప్రకారము చేస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—సభ్యుని అభిప్రాయము చూస్తే, క్రింది అధికారి పైఅధికారిమీద వ్రాసేవిధానము కోరుతున్నట్లు కనబడుతున్నది. అంటే పోలీసుజవాను వ్రాయాలన్నమాటనా ?

*Issue of Passports.*

125—

*169 *Q.*—SRI S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state the number of passports issued country-wise for the year 1954 by the Government in the State ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—As the work relating to the issue of International passports excepting Indo-Pakistan passports has been taken over from the State Government by the Government of India with effect from 24—1—55 and as all connected records have been transferred to the Regional Passports Office at Madras, information regarding the number of passports issued to the countries other than Pakistan is not available.

The number of Indo-Pakistan passports issued during 1954 by this Government for travel to Pakistan is 66 (47 fresh passports and 19 renewals).

Sri S. VEMAYYA :—ఈ ప్యాసుపోర్టును యిచ్చే సందర్భములో రాష్ట్ర అధికారాన్ని కేంద్ర ప్రభుత్వానికి ఏ సందర్భములో అప్పజెప్పారో తెలియజేస్తారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—ఈ విషయంలో దేశము మొత్తముమీద అధికారము కేంద్ర ప్రభుత్వమువారిదే. కేంద్ర ప్రభుత్వమువారు వుంచుకుంటేనే మంచిదనే కారణముతో, Regional Offices నాలుగో, అయిదో పెట్టారు. వారే passports issue చేస్తున్నారు. వారిపని వారే చూస్తున్నారు అన్నమాట.

*Power-Boring Sets.*

126—

*682 Q.—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of power-boring sets and hand-boring sets with the Government for hire; and

(b) how many of such sets are employed in Nellore district ?

THE HON. SRI K. VENKATA RAO :—

| | | |
|---|---|---|
| (a) | Power Drills | 12 |
| | H. B. Sets | 92 |
| (b) | Power Drills | 1 |
| | H. B. Sets | 11 |

Sri B. RAMA REDDI :—ఈ power drills అద్దెకు యిచ్చేటప్పుడు, వ్యక్తులకు యిచ్చేరేటున్నూ, co-operative societies ద్వారా యిచ్చేరేటున్నూ ఏమైనా వేరువేరుగా వున్నవా ? ఇప్పుడు యీ జాతీయవిస్తరణ ప్రణాళిక జరిగే ప్రదేశములలో irrigation heads క్రింద తీసుకునే లోన్సుకు యీ power drills concession rate లో ఇవ్వటము జరుగుతున్నదా ? ఉంటే, ఎంత ?

THE HON. Sri K. VENKATA RAO :—ఇప్పటికి ఏమీ లేదు.

SRI A. C. SUBBA REDDI :—ఈ power drills ఎక్కడెక్కడ పనిచేస్తున్నవి ? ఎన్ని పని చేస్తున్నవి ? ఎన్ని repairs లో ఉన్నవి ?

THE HON. SRI K. VENKATA RAO :—అధమపక్షం ఒక power drill అయినా నెల్లూరులో పనిచేస్తున్నది. అది A. C. Subba reddi's knowledge లోనే వున్నదని అనుకుంటాను. Repairs లోకి వెళ్లినవి అన్నీ కూడా గవర్నమెంటు నోటీసుకు వస్తాయా ? కాబట్టి రిపేరులులేనివే పని చేసేది.

SRI V. VISWESWARA RAO:—ఈ power drills యిచ్చేటప్పుడు National Extention Service schemes లో, అవి సామాన్యంగా మెట్ట ప్రాంతాలకని మంత్రిగారికి తెలుసు. వాటిని ఏమైనా concession rates లో యిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:—దాన్నిగురించి ముందు ఆలోచిస్తాము.

Sri SHEIK MOWLA SAHEB—అధ్యక్షా! Power drills ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో మనము వున్నప్పుడు ఎన్ని తెప్పించారు ? మన ఆంధ్ర రాష్ట్రానికి రావలసిన కోటా వచ్చిందా ? వస్తే, అవి ఏ జిల్లాలో పనిచేస్తున్నవి ?

THE HON. Sri K. VENKATA RAO:—రాష్ట్రము అంతటా కూడా పనిచేస్తున్నది. ఎక్కడానూ ఖాళీగా లేవు.

Sri T. LAKSHMINARAYANA REDDI:—Power drills, hand sets అనేవి మన స్టేటులో చాలా తక్కువగా వున్నవి. దానికి demand చాలా వున్నది. Pending list చాలా వున్నది. అందుచేత అవి ఎక్కువ చేయటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

THE HON. Sri K. VENKATA RAO:—ఈ సంవత్సరము కొన్ని extra గా కొంటున్నాము.

Sri A. BAPINEEDU:—Power drill sets planning కు గాను, National Extension Service scheme లో వారే తీసుకొంటున్నారు. ఈ స్కీములు లేనిచోట అంటే మెట్టప్రాంతాలకు యివ్వకపోవడంచేత చాలా అసౌకర్యముగా వున్నది కాబట్టి, వీటిని మెట్టప్రాంతాలలోగూడా వినియోగించటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO:—ఇవి అన్నీగూడా N. E. S. Blocks అన్నింటిలో లేవు. కొన్ని మెట్టప్రాంతాలలోకూడా చాలా power తోటి పనిచేస్తున్నవి.

Sri P. RAJAGOPALA NAIDU:—ఈ power drills తీసుకొని వెళ్లినవారు వాటిని పనిచేయించడములో చాలా నష్టపడుతున్నారు కొబట్టి, ఎక్కడెక్కడ నీరు వుంటుందో సలహా యివ్వటానికి ప్రభుత్వము ఏర్పాటు చేస్తారా ?

THE HON SRI K. VENKATA RAO:—ఇంతవరకు చాలాప్రాంతాలలో Government of India వారుకూడా అటువంటి ప్రయత్నం చేశారు.

అన్నిగూడా fail అయినవి. ఇంకా ఎవరికైనా దివ్యదృష్టివుంశేవారిని చూపిస్తే ప్రభుత్వమువారు ప్రయత్నము చేస్తారు.

Sri S. NARAYANAPPA :—Power drills, hand boring sets అదనంగా కొంటున్నామని ప్రభుత్వమువారు సెలవిచ్చారుగదా. ఎన్ని కొంటున్నారు? ఒక్కొక్క జిల్లాకు ఎన్ని అదనంగా యిస్తారు ?

THE HON. Sri K. VENKATA RAO :—ఈ power drills రాష్ట్రము మొత్తముమీద అవసరాన్నిబట్టి కొనబడుతాయి. అవి జిల్లాలో పంచిపెట్టబడుతాయి. అయితే యిప్పుడు దానికి ఒక్క fixed schedule అంటూ ఏవీ లేదు.

*Government Khadi Centres.*

127—

*750 *Q.*—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of Khadi Centres run by the Government in the State and their location;

(b) the average quantity of Khadi produced by these centres annually; and

(c) whether there is a proposal to open Khadi Sales Depots in different centres ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The Government had previously four intensive Kkadi Centres at the following places :—

| | | |
|---|---|---|
| (1) | Tuni | East Godavari District. |
| (2) | Santhanuthalapadu. | Guntur District. |
| (3) | Yerragondapalem. | Kurnool District. |
| (4) | Koilkuntla. | Kurnool District. |

These centres have recently been transferred to the All India Khadi and Village Industries Board together with the stocks and the staff. There are therefore no Khadi production centres run by the State Government at present.

(b) On an average 2·87 lakhs of yards of Khadi cloth was produced annually in the Government Khadi centres before their transfer to All India Khadi and Village Industries Board.

(c) No; sir.

SRI P. RANGA REDDI :—ఈ 4 కేంద్రాలలో వున్నటువంటి ఖాదీ ఈ విలేజి ఖాదీబోర్డుకు ట్రాన్స్ఫరు చేసినపుడు ప్రభుత్వానికి ఎంత సొత్తము వచ్చింది? అంతకుముందు ఈ సెంటర్సులో పనిచేస్తున్నటువంటి ఎంప్లాయర్సు అందరిని కూడా ఇప్పుడు ఖాదీబోర్డు ఉద్యోగములందు పెట్టిందా?

MR. SPEAKER :—ఒక్క సప్లిమెంటరి ప్రశ్నమాత్రమే వేయండి.

Sri P. RANGA REDDI :—ఒకటి వేస్తే జవాబు చెప్పడము లేదు. అందువల్ల 1, 2 వేస్తే ఒకదానికైనా సమాధానము వస్తుందేమో అనే వుద్దేశ్యముతో వేశాను.

THE HON. Sri K. VENKATA RAO :—ఆయన సరిగా వేస్తే సమాధానము వస్తుంది. ఆయన ఎప్పుడూ కూడా 2, 3 ప్రశ్నలు కలిపిగాని వేయడు. మాతో ఆయన శక్తి రెండింటిమీద వినియోగిస్తాడు.

SRI P. RANGA REDDI:—ఇదివరకు ఈ నాలుగు కేంద్రాళలో వున్నటువంటివారిని ఖాదీబోర్డువారు అపాయింటుచేయడము జరిగిందా?

THE HON. SRI K. VENKATA RAO :—అసలు దానికి ఒక కండీషను చేశాము. ఇదివరకు ఆ వుద్యోగములో వున్న వారందరినికూడా ఆ ఖాదీ బోర్డువారు తీసుకొన్నారు.

SRI P. RANGA REDDI:—ఈ ప్రశ్నకు నాకు సరియైన సమాధానము రాలేదని నా ఆక్షేపణ. నేను అడిగింది యేమిటండీ వారందరినీ అపాయింటు చేసినారా అని. వారు ఆ కండిషన్ పెట్టినామన్నారు. పెట్టినందువల్ల వాళ్లు దానిని అమలు జరుపుతున్నారా అని నా ప్రశ్న. దీనికి మంత్రిగారు జవాబు చెప్పాలి.

THE HON. SRI K. VENKATA RAO :—ఇంత వివరంగా ఆయన మొట్టమొదట అడగలేదు. అందరిని తీసుకొన్నారు. ఒక్కరినీ వదలిపెట్టలేదు.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఈ ప్రభుత్వము నిర్వహించినటువంటి ఖాదీ సెంటర్లను మన ఆలిండియా ఖాదీ విలేజి ఇండస్ట్రీయలుబోర్డువారికి ఇచ్చినప్పుడు ఖాదీనూలు, ఖాదీబట్టలకు ధరలుకట్టడములో కొంత పెరుగుదల వచ్చింది. ఈ పెరుగుదల బట్టలు నేసిన కార్మికులకు, నూలువడికిన కార్మికులకు పంచిపెట్టాలని ఇంతకు పూర్వము అక్కడ స్టేటు ఖాదీబోర్డు చెప్పింది. ఆ విధముగా ప్రభుత్వము చేస్తున్నదా?

THE HON. Sri K. VENKATA RAO :—ఈ ప్రశ్నకు దానికి సంబందము లేదు.

SRI P. KODANDARAMAYYA :—ఈ ఆలిండియా ఖాదీ బోర్డుకును మన ప్రభుత్వానికి వున్న రిలేషను విపులంగా చెబుతారా?

THE HON. SRI K. VENKATA RAO :—ఇండియా ప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వానికి వున్నటువంటి రిలేషనుషిప్పే అక్కడకూడా ఉన్నది. ఎందుచేత అంటే ఆలిండియాగవర్నమెంటువారిదే ఆ సంస్థ.

Sri C. SUBBARAYADU :—ఈ ఖాదీ డిపార్టుమెంటుకు సంబంధించి రాఘవరావుగారు అనే ఉద్యోగి వున్నారు. అటువంటి వుద్యోగము ఇకమీదట అవసరము వుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—అక్కడ అవసరము లేక పోవడమువల్ల ఆయనకు ఇంకొక ఉద్యోగము ఇస్తున్నాము.

Sri B. RAMA REDDI:—బద్వేలు తాలూకాలో నర్సాపురం, వంకమర్రి అనేటటువంటివి ఎక్కువ ఖాదీ వుత్పత్తికి ముఖ్యమైన కేంద్రాలుగా వున్నాయి. వాటిని మూసివేశారు. అక్కడ చాలమంది ఖాదీ వుత్పత్తికి నూలు వడికే వాళ్లుకూడా వున్నారు. అందువల్ల మళ్లావాటిని తెరవడానికి ప్రయత్నము చేస్తారా ?

THE HON. Sri K. VENKATA RAO:—ఈ గవర్నమెంటుకు ఖాదీ కొనుక్కోవడము తప్ప దానితో అట్టి సంబంధం లేదు. అటువంటిది. ఏమైనా వున్నట్లయితే గౌరవసభ్యుడు ఆలిండియా ఖాదీ ఇండస్ట్రీ బోర్డుకు వ్రాసుకోవచ్చును.

SRI G. YELLAMANDA REDDI:—అధ్యక్షా, ఈ ఖాదీని ప్రయివేటు వ్యాపారస్తులు ఉత్పత్తి చేయడానికి వీలుందా ?

THE HON. Sri K. VENKATA RAO :—లక్షణంగా వున్నది. ఎల్లమందా రెడ్డిగారు తక్షణం ఎక్కడైనా ఒక కంపెనీ పెట్టవచ్చు.

28th July 1955]

SRI P. GUNNAYYA:—అధ్యక్షా, ఈ ఖాదీ సంఘాలు దాదాపు నాలుగు వున్నాయని మంత్రిగారు సెలవిచ్చారు. పొందూరు ఖాదీ సంఘంలో మన ఆంధ్ర దేశంలోనే కాకుండా భారతదేశంలోను ప్రాముఖ్యత చెందినటువంటి ఖాదీవున్నది. సన్నఖద్దరు వున్నది. అలాంటిదానిని ఎందుకు మంత్రిగారు చేర్చారు కాదు ?

THE HON. SRI K. VENKATA RAO :—అదిపుట్టినప్పట్నుంచీ వారిక్రింద నేవున్నది. దానిని గురించి గున్నయ్యగారు ఇప్పుడు తెలుసుకోవడము జరిగింది.

*Extension of the period of High School course.*

128—

*250 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state whether there are proposals with the Government to extend the period of High School course now in the State ?

THE HON. SRI GOPALA REDDI :—The answer is in the affirmative.

SRI S. VEMAYYA :—ఈ 7 వ ఫారము ఎప్పట్నుంచి అమల్లోకి వస్తుంది. అది అమల్లోకి వచ్చినప్పట్నుంచి ఇంటరుమీడియటు కోర్సు ఏమి అయి పోతుంది.

THE HON. SRI B. GOPALA REDDI :—ఇది ఈ సంవత్సరము నుంచి అక్కడక్కడ అమల్లోకి వచ్చింది. 15 స్కూళ్లలో ఇప్పుడు ఈమల్టీపరుపస్ స్కూళ్లు పెట్టుతున్నాము. 3, 4 యేండ్లు వచ్చేటప్పటికి 7th form కూడా వస్తుంది. అప్పుడు యూనివర్శిటీకోర్సు 4 సంవత్సరములు వున్నదల్లా 3 సంవత్సములు అవుతుంది.

SRI N. C. SESHADRI :—ఇతరస్కూళ్లను ఈ మల్టీపరుపస్ స్కూళ్లుగా చేర్చుకోవాలంటే ఏప్రాతిపదిక పైన చేర్చుకుంటున్నారో సెలవిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—సంవత్సరమునకు 15 స్కూళ్లు తీసుకొంటున్నారు. బాగా పని చేస్తున్నటువంటి స్కూళ్లో లేకపోతే తాలూకా Headquarters లో ఉన్నవో జిల్లాకు 1, 2 వంతున సంవత్సరానికి తీసుకొంటాము.

SRI PILLALAMARRI VENKATESWARU :—జిల్లాకు 1, 2 చొప్పున ఎందుకు తీసుకోవలసివచ్చింది ? అన్నీ ఒక్కపర్యాయమే తీసుకుంటే వచ్చే ఇబ్బంది ఏమిటి ?

THE HON. SRI B. GOPALA REDDI :—రెండు crafts కూడా పెట్టాలి. దానికి ఎక్కువస్థలం చూచుకోవలసి వున్నది. Capital expenditure, recurring expenditure అంతా ఎక్కువ అవుతుంది. అందువల్ల ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 100 స్కూళ్లు తీసుకోడానికి ప్రయత్నము జరుగుతున్నది. చాలా ఎక్కువ ఖర్చవుతుంది.

Sri A. KALESWARA RAO :—ఇప్పుడు వున్నటువంటి ఒకటి మొదలుకొని ఆరుఫారములవరకు విద్యావిధానమునకు text books డబ్బు అంతా కూడా గవర్నమెంటు కంట్రోలుక్రింద వున్నది. ఇప్పుడు పాత ఇంటరుమీడియటుకు ప్రత్యామ్నాయంగా వుండేటటువంటి 7 వ ఫారము యూనివర్సిటీ కంట్రోలుక్రింద కుపోతుందా లేక రాష్ట్రప్రభుత్వముయొక్క కంట్రోలుక్రింద వుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI:—హైస్కూలులో ఇంకో సంవత్సరము ఎక్కువచేసినప్పుడు అది హైస్కూలుకు సంబంధించిందిగానే వుంటుంది. తరువాత అన్ని స్కూల్సుకూడా ఆమాదిరిగానే 7th Form పెట్టుకొనేలోపల కొన్ని కొన్ని కాలేజీలలో ప్రీ-యూనివర్సిటీకోర్సు అని ఒక సంవత్సరము పెడతారు. అది ఇంటరుమీడియటు జూనియరుకు ప్రత్యామ్నాయంగా యూనివర్సిటీకోర్సు అని కొన్ని సంవత్సరములవరకు పెడుతారు. ఇది అంతాగూడా అమల్లోకి రావడానికి దాదాపు 10, 15 సంవత్సరములు అవుతుందని అనుకొంటున్నాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ ఏడవఫారం అన్నిస్కూళ్లలోనూ పెట్టడానికి ఎంతకాలం పడుతుంది ? ఒకవేళ పెడితే మళ్లా డోనార్సును అదనంగా భవనాలు కట్టమని చెబుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—మేము ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఇంకా 100 స్కూల్సు పెట్టడానికి నిర్ణయించాము. కోస్తాజిల్లాలలో వున్నవి. 600 స్కూల్సు మాత్రమే. దాంట్లో 100 స్కూల్సులో పెట్టడం ద్వితీయ పంచవర్షప్రణాళిక కాలము పూర్తి అయ్యేటప్పటికి అవుతుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఈ మల్టీపర్పస్ స్కూల్సుపెట్టడానికి expenditure ఎక్కువ అవుతుంది అని చెప్పారు. ఒకొ్కక్క స్కూలుకు ఎంత ఎక్కువ అవుతుంది ?

THE HON. SRI. B. GOPALA REDDI :—ఈ నూరుస్కూళ్ళకు రు. 66·45 లక్షలు non-recurring, రు. 9·03 లక్షలు recurring, ఖర్చు అవుతుంది.

28th July 1955]

SRI T. LAKSHMINARAYANA REDDI :—15 స్కూళ్లలో VII Form పెట్టామన్నారు. అవి ఏవో సెలవిస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI:—ఈసంవత్సరము VIIForm పెట్టలేదు. IV Form నుంచి సిలబస్ వేరు చేస్తున్నాము. 4 సంవత్సరములు అయ్యేప్పటికి ఇది VII Form అవుతుంది. ఆ పేర్లు ఇక్కడ లేవు.

SRI C. SUBBARAYUDU :—ఇప్పుడు VII Form పెట్టినచో లోకల్ బోర్డ్సు పాఠశాలల్లో అధనపు ఖర్చు యేర్పడినచో ప్రభుత్వము లోకల్ బోర్డ్సుకు సహాయము చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI:—కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కొంత సహాయం చేస్తాయి.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఇది చాలా ప్రధానమైన విషయం కాబట్టి ఈ విషయం చర్చించడానికి ఒక గంట ఎప్పుడు అయినా కేటాయిస్తారా?

THE HON. Sri B. GOPALA REDDI :—కొంతవరకు ఇది విద్యాశాఖా డిమాండుమీద వచ్చింది అనుకుంటాను. లక్ష్మణస్వామి మొదలియారు గారి కమిటీ చాలా దర్యాప్తుచేసి, దేశము అంతా తిరిగి చేసినసూచనలివి. గవర్నమెంటులు యూనివర్సిటీలు అన్నీ ఒప్పుకున్న స్కీము ఇది. 8 years of integrated elementary education వుండాలని, తరువాత 3, 4 సంవత్సరములు సెకండరీ విద్య ఉండాలని, యూనివర్సిటీ ఎడ్యుకేషను 3 సంవత్సరములు ఉండాలని చేసినటువంటి సిఫార్సు ఇది. ఇది యూనివర్సిటీలు, గవర్నమెంట్లు ఒప్పుకొన్నారు.

Mr. SPEAKER:—The question of half-hour debate is addressed to the House.

THE HON. SRI B. GOPALA REDDI :—The Hon. Member wants a full day's debate.

Mr. SPEAKER:—This is a *FAIT ACCOMPLI*. The recommendations have already been accepted by the Government and they are put into force. What is the use of discussing it now?

Sri L. LAKSHMANA DAS :—ఇది చాలా ముఖ్యమైన సమస్య. ఈ విషయంలో మార్పులు అందరు సభ్యులుకూడా తెలుసుకునేందుకు, మేముకూడా వెళ్లి ప్రజలకు చెప్పేకొనేందుకు అవకాశము ఉంటుంది. అందుచేత సరియైన విధముగా దానిని ఇక్కడ చర్చించుకుంటే అందరికి ఉపయోగకరంగా ఉంటుంది. ఈ మార్పువల్ల విద్యాభివృద్ధికి యే విధముగా సహాయపడుతుందో తెలుసుకోడానికి కూడా చాలా ఉపకారంగా ఉంటుంది కాబట్టి అర్థ గంటో, గంటో దాని పైన చర్చను కేటాయిస్తే బాగుంటుంది.

Mr. SPEAKER:—The subject was before the House for a very long time. The Education Demand was before the House and one hon. Member was pleased to refer to it. What is the use of our taking it up again? We shall go to the next question.

*Radio Stations under the control of Radio Branch Police.*

129—

*255 *Q*.—Sri S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of Radio Stations under the control of the Radio Branch Police in the State; and

(b) the purpose for which they are used?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) Government consider that it is against public interest to furnish this information.

(b) The Radio Stations are used for transmission of information affecting law and order situation.

Sri S. VEMAYYA :—ఈ radio stations portable గా ఉంటాయా లేక అన్ని ఉంటాయా రకాలు ఉంటాయా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—Radios సాధారణముగా రెండు రకాలుగానూ ఉండును గదా.

SRI V. VISWESWARA RAO :—Law and order ప్రమాదమైన పరిస్థితులలో వున్నప్పుడు వీటిని ఉపయోగిస్తారా ? ఈ సంవత్సరంలో ఇంతవరకు ఎన్నిసార్లు ఉపయోగించారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Law and order కు ప్రమాదపరిస్థితులు వచ్చినప్పుడు ఉపయోగించి మరల తీసివేయడము గాదు. ఇవి daily service లో ఉంటాయి.

*Selection of Members for Taluk Planning Committees.*

130—

*811 *Q.*—SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there is any discrimination against members of political parties in selecting members for Taluk Planning Committees; and

(b) whether the Government issued instructions to that effect ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) No, Sir.

(b) No, Sir.

SRI PILLALAMARRI VENKATESWARLU :—తాలూకా ప్లానింగు కమిటీలో కమ్యూనిస్టు శాసనసభ్యులు గా వున్నప్పుడు తప్ప మిగిలిన వారిని ఎక్కడా తీసుకోలేదనే విషయము మంత్రిగారిదృష్టికి తేబడినదా ? తీసుకువస్తే ఏమిచర్య తీసుకొన్నారు ?

THE HON SRI K. VENKATA RAO:—నాదృష్టికి particularగా తీసుకురాలేదు. క్రిందటిమాటు ఇక్కడ చర్చకు వచ్చినప్పుడు చెప్పాను. కొన్ని చోట్ల కమ్యూనిస్టులే ఎక్కువగావున్న ప్రదేశాలు ఉన్నవి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—కమ్యూనిస్టులను తీసుకోకుండా వున్న Taluk Planning Committee ల విషయము మీ దృష్టికి తీసుకువచ్చినారా ? తీసుకువస్తే ఏమిచర్య తీసుకున్నారు ?

THE HON SRI K. VENKATA RAO :—కమ్యూనిస్టులను వేసితీరాలనే నియమములేదు. వాళ్ళువద్దు అనేటటువంటి అభ్యంతరము ఎలాలేదో, వేసితీరాలనే నియమముకూడా లేదు. కమ్యూనిస్టులు లేకపోతే కమిటీలపని ఆగిపోదు.

SRI V. VISWESWARA RAO:—ఓడిపోయిన కాంగ్రెసు M.L.Aలను అందరినికూడా Taluk Planning Committees లో వేయాలనే సూచన పంపించారా ? కృష్ణాజిల్లాలో అలాగే చేశారు అని తెలుస్తున్నది.

THE HON. SRI K. VENKATA RAO :—వేయాలని పంపించలేదు. కాని కాంగ్రెసువారు ప్రజా సేవకులు కనుక వాళ్లను వేసివుండవచ్చు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—పని కుంటుపడిపోతుందని వాళ్ళను వేసినారా ?

THE HON. SRI K. VENKATA RAO :—పని ఎప్పుడూ ఎవరు లేకపోయినా కుంటుపడి పోతుందని భయములేదు. కమ్యూనిస్టులు లేకపోయినా ముఖ్యముగా యింకొకరు లేకపోయినా ఫరవాలేదు. అక్కడి అవసరమునుబట్టి అలా చేశారేమో !

SRI M. NAGI REDDI :—Planning Committee ఉద్దేశ్యములలో కూడా అన్ని రాజకీయ పార్టీల అందరి వ్యక్తుల సహకారంతో ముందుకు తీసుకు వెళ్ళాలని ఉన్నది. అలాంటి పరిస్థితులలో గత genoral elections అనుభవము దృష్ట్యా చూచినప్పుడు కమ్యూనిస్టుపార్టీ ఒక ప్రధానమైన రాజకీయపార్టీ అని తెలిసినది. అందువల్ల జిల్లాప్లానింగ్ కమిటీలలో, తాలూకా ప్లానింగ్ కమిటీలలో కమ్యూనిస్టు పార్టీకికూడా తప్పకుండా ప్రాతినిధ్యము ఉండేటట్లు ప్రభుత్వము సూచనలు చేస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—చెయ్యదు. ఎందుకంటే District Planning Committees పెట్టేటప్పుడు జిల్లాలలోఉండే శాసన సభ్యులు అందరూకూడా ex-officio గా members గా ఉండాలని ఉన్నది. కాని ప్రజలవోట్లచేత కమ్యూనిస్టులు చాలా జిల్లాలలో ఓడిపోయారు కనుక automatic గా వారు eleminate అయినారుగాని Government orders వల్ల కాదు.

*Recognition of Non-Gazetted Officers' Association.*

131—

*619 *Q.*—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state whether the

Government have recognized the Non-Gazetted Officers' Association in Andhra State ?

THE HON. SRI B. GOPALA REDDI :—The answer is in the affirmative.

*Polytechnic Schools under the Second Five-Year Plan.*

132—

*813 *Q.*—SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of Polytechnic Schools proposed to be started in the Second Five-Year Plan; and

(b) their place of location ?

THE HON. SRI KALA VENKATA RAO :—

(a) The opening of 3 new Polytechnics is under consideration.

(b) This will be settled later.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—సంఖ్య మాత్రము decide చేశారా ? లేక place కూడా decide చేశారా ?

THE HON. SRI K. VENKATA RAO :—Number మాత్రం decide చేశాము. అయినా ఇది Government of India వారు ఇచ్చే grants మీాద ఆధారపడిఉంటుంది. అవి వచ్చినతరువాత ఎన్నిఅనే విషయము, ఎక్కడపెట్టేది మొదలయినవి నిర్ణయిస్తాము.

Sri V. VISWESWARA RAO :—ఈ మధ్య ఉయ్యూరు polytechnic ను గుంటూరుకు మార్చాలని పత్రికలో వార్తలుపడ్డాయి. మార్చకుండా చర్య తీసుకుంటారా ?

THE HON Sri K. VENKATA RAO :—అది విచారణలో ఉన్న మాట నిశ్చయము. కాని యింకా final orders pass చేయలేదు.

*Madras Leave Rules.*

133—

*690 *Q.*—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state whether there is

a proposal with the Government to replace the present Madras Leave Rules by the old Leave Rules ?

THE HON. SRI B. GOPALA REDDI :—

No, Sir.

*Representation from the Andhra Ratna Irrigation Co., Ltd., Chirala.*

308—

*718 *Q.*—SRI PRAGADA KOTAIAH :—Will the Hon. the Minister for Revenue be pleased to state the action taken on the representation of the Andhra Ratna Irrigation Company Ltd., Chirala, requesting the Government to sanction a loan of Rs. 4,75,000 for execution of a lift irrigation scheme to provide facilities for irrigation of the lands lying on the eastern side of the Kunderu Drain in Bapatla taluk, Guntur District ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

The representation from the Andhra Ratna Irrigation Company Ltd., Chirala, requesting for grant of a loan of Rs. 4,75,000 has been received only recently and it is under examination.

*Machkund Hydro-Electric Project.*

309—

*647 *Q.*—Sri P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :—

(a) when the first stage of Machkund Hydro-Electric Project will be completed ;

(b) when the first unit is likely to come into operation ;

(c) the areas that will be supplied with electricity when the first unit comes into operation ; and

(d) whether the Machkund electricity will be extended to Nellore District also ?

THE HON. Sri G. LATCHANNA :—

(a) December, 1957.

(b) August, 1955.

(c) Srikakulam, Visakhapatnam, East Godavari, West Godavari, Krishna and Guntur districts.

(d) The answer is in the affirmative.

SRI P. RANGA REDDI :—మాచ్‌కండ్ పవర్ నెల్లూరు జిల్లాకువస్తుంది అన్నారు. ఏ ఏ తాలూకాలకు వస్తుంది ? పొదిలినుంచి కంభంనుంచి గిద్దలూరువరకూ ఒకస్కీము investigation జరుగుతున్నది. ఏ stage లో అది ఉంది.

THE HON Sri G. LATCHANNA:—మాచ్‌కండ్ పవరు ప్రాజెక్టు నెల్లూరుమీదగా రేణిగుంటవరకూ తీసుకువెళ్ళడానికి proposals ఉన్నాయని మనవిచేశాను. నెల్లూరుజిల్లాలోని schemes అన్నింటికికూడా సప్లైయి చేయడము గురించి ఆలోచించబడుతుంది.

SRI A. KALESWARA RAO :—మాచ్‌కండ్ ఎలక్ట్రిసిటీ స్కీము యొక్క ప్రధానమైన తీగ మాచ్‌కండ్‌నుంచి నెల్లూరువరకు పోవచ్చు. కాని అచ్చట ఎన్ని గ్రామాలకు ఈ సంవత్సరము సప్లైయి చేస్తారో చెప్పెదరా ?

THE HON. Sri G. LATCHANNA :—ఇప్పుడు thermal stations వల్ల supply అవుతున్నటువంటి ప్రదేశాలకు ప్రధానముగా మాచ్‌కండుపవర్ తీసుకురావాలని ఈ స్కీముయొక్క ఉద్దేశము. ఇప్పుడు August 19 వ తేదీన మొదటి మూడు turbines లో ఒక turbine కు operation కు ప్రారంభోత్సవము జరుగవలసియున్నది. December వచ్చేసరికి అక్కడనుంచి supply యివ్వాలని ఆలోచనలో ఉన్నది.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా ! ఈ మాచ్‌కండు నుంచి వచ్చే lines ఒంగోలునుంచి కావలికి కలుపుతున్నారు. కాబట్టి అసలు మెట్ట తాలూకాలు అయిన పొదిలి, దర్శి, కనిగిరి, ఉదయగిరిలకు ఏరకంగా supply చేయదలచుకున్నారో ప్రభుత్వము తెలియచేస్తారా ?

THE HON Sri G. LATCHANNA :—Thermal power తీసుకురావడానికి అవకాశములేని ప్రాంతములలో డీసిల్ ఇంజనులద్వారా పనిచేయాలని ప్రభుత్వము ఆలోచిస్తోంది.

SRI M. NAGI REDDI :—అధ్యక్షా, మాచ్‌కండు స్కీమునుంచివచ్చే electricity నందికొండ ప్రాజెక్టు పనులకు యిస్తారని అందువల్ల పల్నాడు cover up అవుతుందని అక్కడనుంచి గ్రామాలకు యిస్తారని అంటున్నారు. అందుననే పంచాయితీబోర్డులు lighting arrangements చేసుకోలేదు. అందువల్ల వారికి యిచ్చే అవకాశము ఉన్నదా ?

THE HON. SRI G. LATCHANNA :—Nandikonda Project ఇంకా construction ప్రారంభము కాలేదు. మాచ్‌కండుపవర్ గాని తుంగభద్ర power గాని అందుబాటులోలేని మెట్ట తాలూకాలకు డీజిల్ ఇంజనులద్వారా సప్లయి చేయాలని ప్రభుత్వము ఆలోచిస్తోంది.

*Un-employment of ex-tappers.*

12-00 noon

310—

* 827 *Q.*—Sri V. VISWESWARA RAO :—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :—

(a) the steps taken by the Government to solve the un-employment problem of the Ex-Tappers ;

(b) the total number of Field Labour Co-operative Societies formed for the ex-tappers ; and

(c) the number of Ex-Tappers Field Labour Co-operative Societies or members who have been allotted lands ?

THE HON. SRI D. SANJIVAYYA:—(a) The Government took various measures to ameliorate the condition of ex-tappers, the important of them being the formation of palm jaggery manufacturing co-operative societies, with the ex-tappers as members. On 30—6—1954, there were in the State 689 such societies with 43,372 ex-tappers as members. Other co-operative societies such as milk supply co-operative societies, tenants and field labourers co-operative societies and cattle breeding societies, which were about 247 in number absorbed 6,039 ex-tappers.

In order to assess correctly the extent of unemployment among the ex-tappers and to plan their rehabilitation, the Government ordered that a survey be undertaken by the

Statistical Branch of the Board of Revenue. The results of the survey are awaited.

(b) 113 Tenants Field Labourers Co-operative Societies were organised exclusively for the ex-tappers.

(c) 26 Field Labourers Co-operative Societies were allotted lands.

SRI V. VISWESWARA RAO :—Ex-tappers' Co-operative Societies ను, Field Labour Tenants Societies ను organise చేశారు. ఇంకా చాలామంది భూమిలేకుండా బాధపడుచున్నారు. అందువల్ల గతములో లాగానే palm societies కు, లైసెన్సులు ఇప్పిస్తారా ?

THE HON SRI D. SANJIVAYYA :—ఇప్పుడు N. వెంకటయ్యగారు యిచ్చినస్కీము ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది. అవన్నీ అయినతరువాత ఆలోచిస్తాము.

Sri B. SANKARAIAH:—ఎక్కువ societies నీరా, బెల్లము తయారు చేయటానికి ఉన్నాయని చెప్పారు. వీటన్నిటి మీద అనేక రకములైన Complaints వచ్చాయి. అటువంటివి జరగకుండా చేసేందుకు ఏమైన చర్యలు తీసుకుంటారా ?

THE HON. Sri D. SANJIVAYYA :—ఏదో అక్కడక్కడ జరుగుతూ ఉండవచ్చు. కాని విశేషముగా జరుగడములేదని ఇక్కడ ఉన్నటువంటి record ద్వారా తెలుస్తున్నది. 8.5 lakhs rupees worth of palm jaggery was produced by these societies and it was sold for 9.37 lakhs rupees.

SRI V. VISWESWARA RAO :—వెంకటయ్యగారి స్కీము గురించి ఆలోచించే ముందు సొసైటీలకు వెంటనే licences ఇప్పించడానికి చర్య తీసుకుంటారా ?

THE HON SRI D. SANJIVAYYA :—చెప్పింది అదే కదా !

SRI G. YELLAMANDA REDDI :—మాజీ గీత పనివారికి ఇచ్చే భూములు ఉచితంగా ఇస్తారా ? లేక market value కు ఇస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Lease క్రింద ఇస్తాము.

*Extension of electricity to Jammalamadugu.*

311—

* 731 Q. Sri K. RAMAIAH :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether there is any proposal with the Government to extend electricity to Jammalamadugu ; and

(b) if so, at what stage the matter stands ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) The answer is in the affimative.

(b) The matter is under the active consideration of the Government.

[*Note :—An asterisk * at the commencement of a speech indicates revision by the Member.*]

## BUDGET FOR THE YEAR 1955-56,

## VOTING OF DEMANDS FOR GRANTS—(contd.)

## DEMAND XIV—POLICE.

THE Hon. Sri N. SANJEEVA REDDI :—Mr. Speaker, Sir, on the recommendation of the Governor I move ;

That Government be granted a sum not exceeding Rs, 2,65,19,700 under Demand XIV—Police.

ఈ డిమాండు గురించి ఎక్కువ విషయాలు చెప్పవలసినవి లేవని నా భావం. Irrigation, electricity, education ఇటువంటి వాటి విషయములో చెప్పుకోడానికి వీలువుంటుంది. కార్యక్రమం కనిపిస్తుంది ; చేసింది చెప్ప వచ్చును. వీటన్నింటికన్న పోలీసులకు బాధ్యత ఎక్కువగా వుండినా, డబ్బుమాత్రం చాలా కొద్దిగా ఖర్చుచేస్తున్నాము. Education, Irrigation లకు చేసే ఖర్చుతో పోల్చి చూస్తే, పోలీసుకు చాలా తక్కువడబ్బు ఖర్చుచేస్తున్నాము. రెండు కోట్లు చిల్లరమాత్రం ఖర్చుచేస్తున్నాము. ఇంకా ఎక్కువ ఖర్చుపెట్టవలసిన అగత్యంవుంది. పోలీసువారికి కావలసిన వసతులు ఏర్పాటుచేయడం, ఇండ్లు కట్టడం వగైరా కార్య క్రమాలకు పూనుకుంటే ఇంకా ఎక్కువ ఖర్చు చేయవలసివుంటుంది. ఈ కార్య

క్రమాలకు ఇంకా రాష్ట్రం పూనుకోక పోవడంవల్ల ఈ డిమాండుమీద ఇంత తక్కువ ఖర్చు అవుతోంది. ఈ సంవత్సరం ఇండ్లు కట్టించడానికీ, ఇతర వసతులు కల్పించడానికి ప్రత్యేకంగా కొన్ని లక్షలు ఖర్చుచేస్తున్నాము. ఇది చాలదేమో నను కుంటాను. రానున్న సంవత్సరంలో ఇంకా ఎక్కువ ఖర్చు చేయడానికి వీలువుంటుంది. ఎన్నో ఇబ్బందులు వున్నా క్రొత్తగా రాష్ట్రం ఏర్పడినప్పటినుంచి పోలీసులు చాలా సమర్థనీయంగా పనిచేస్తారని మీరందరు అంగీకరించవలసిన విషయం. రాష్ట్రం ఏర్పడినప్పుడు మనకు ఎన్నో లోట్లు వున్నాయి. సరియైన ఉద్యోగులు గాని training schools గాని లేకపోవడంవల్ల ఎన్నో సృష్టించుకోవలసి వచ్చింది. కనీసం పోలీసుబ్యాండుకూడా లేక మనం ఇతర రాష్ట్రాలనుంచి అటు వంటి వసతులు ఏర్పాటుచేసుకున్నాము. ఇప్పుడిప్పుడే ఇటువంటివి నిర్మించుకుంటు న్నాము. క్రొత్తగా పోలీసుకళాశాల ఏర్పాటుచేసుకున్నాము, training ఇప్పి స్తున్నాము, Shorthand Bureau వగైరా మన రాష్ట్రంలో ఏర్పరుచుకోడానికి కృషిచేస్తున్నాము. రాష్ట్రం ఏర్పడినప్పటినుంచి పోలీసువారు ఎంతో సమర్థనీయంగా పనిచేశారనడానికి ఖూనీలువగైరాల విషయంలో మన stations prove చేస్తు న్నాయి. గత సంవత్సరం ఇతర రాజకీయ అలజడివల్ల పోలీసులకు ఒత్తిడివచ్చినా ఖూనీలు ఎక్కువగాకుండా చాలా జాగ్రత్తవహించి చాలా వరకు తగ్గించినారు. ఇందుకు శాసనసభ్యులు అందరూ వారిని అభినందిస్తారని అనుకుంటాను. ఖూనీల విషయంలో, పల్లెలలోవుండే తగవులవిషయంలో, ఇవి 20% తగ్గినవని చెప్పడానికి సంతోషిస్తున్నాను. Dacoities మొదలైనవి 51% తగ్గాయి. Robberies మొదలై నవి 52% తగ్గాయి, house breakings 27% తగ్గినాయి, ఇతర thefts వగైరా 33% తగ్గినాయి, ఇది అంతా 1954 వ సంవత్సరంలో జరిగిన మంచికార్యక్రమం. ఎన్ని ఇబ్బందులు ఎన్ని సత్యాగ్రహాలు వున్నా భూమికిసంబంధించిన కలతలు ఎన్ని వున్నా సాధారణమైన crime కు సంబంధించి పోలీసులు చాలా జాగ్రత్తవహిం చారు. ఇతరరాష్ట్రాలతో పోల్చిచూస్తే, మన ఆంధ్రరాష్ట్రం నెంబరు 1 కాని 2 కాని అవుతోంది. House breakings వగైరాలలో ఇతరరాష్ట్రాలతో పోల్చి చూస్తే ఆంధ్రరాష్ట్రం రెండవదిగా ఉన్నది. Robberies వగైరాలలో పోల్చి చూస్తే, ఇతరరాష్ట్రాలకంటె చాలా తక్కువ. ఖూనీలు కొన్నివేలసంఖ్యలో జరుగు తు నేవున్నాయి; అన్నింటివిషయంలోనూ పత్తాతీస్తున్నాము అని చెప్పలేనుకాని, జనసంఖ్యనుబట్టి చూస్తే, ఇతర రాష్ట్రాలకంటె మనం చాలా తక్కువగా ఉన్నాము, first or second అవుతున్నాము, అంతకు తక్కువలేము. Figures cannot be disputed. జీతాలనుగురించి ప్రతిపక్షసభ్యులు సాధా రణంగా చెబుతుంటారు; జీతాలు చాలా తక్కువ వున్నాయని, పెంచాలని ఉపన్యా

Sri N. Sanjeeva Reddi] [28th July 1955

సాల్లో చెబుతున్నాను. జీతం సరిగ్గా ఇస్తున్నాం అని చెప్పలేము కాని constables జీతం అంత తక్కువగా వున్నదని అనుకోడానికి వీల్లేదు. మిగతావాట్ల B. A. M. A. చదువుకొన్నవాళ్లకు ఇస్తున్నజీతాలతో పోల్చిచూస్తే police constables జీతం ఒకరకంగా తృప్తికరంగా వున్నదని అనుకుంటాను. రు. 30,40ల వరకు జీతం, quarters, uniforms, allowance అంతాకలిపి రు. 50 లకుపైన వున్నదేకాని తక్కువలేదు. వారుచేసేపని కష్టమేకావచ్చును. ఇందులోకి వచ్చే వాళ్లు ఎక్కువభాగం III form చదివినవాళ్ళే వస్తున్నారు. B. As, M. As చేసే ఉద్యోగాలతో పోల్చిచూస్తే అంత అసంతృప్తికరంగా లేదని చెప్పగలుగుతున్నాను. బాగావున్నదనీ, పెంచనక్కరలేదని చెప్పను. కాని ఇతర ఉద్యోగాలతో పోల్చి చూస్తే ఇది ఒకరకంగా బాగా వున్నదనిమాత్రం అనుకుంటాను. Fire Stations వున్నాయి. వీటినికూడా Police Department చూస్తుంది. మన రాష్ట్రానికి కావలసినంత గా Fire Stations లేవు. చాలా మునిసిపల్ పట్టణాల్లో లేవు. కోస్తా జిల్లాలలో అగ్నిప్రమాదాలు ఎక్కువగా జరుగుతుంటాయి. వీటినుంచి రక్షించడానికి townsకు ఒక programme ప్రకారం Fire Stations పెట్టాలని ప్రభుత్వం నిర్ణయించుకొన్నది. ఒక పర్యాయమే అన్నిమారుమూలలా కావాలంటే సాధ్యంకాకపోయినా, మునిసిపల్ townsలోనైనా పెట్టడానికి ప్రయత్నంచేస్తాము.

నేను పోలీసు Demand క్రింద మొదట ఎక్కువచెప్పడానికన్న సభ్యులు చెప్పే సమాచారము విని ఎక్కడ ఏలోపముందో తెలుసుకోడానికి కృషిచేస్తాను. లోపమువుంటే దానిని సవరించడానికి వీలువుంటే ఇంకొక పద్ధతిద్వారా రాష్ట్రములో శాంతిభద్రతలు కాపాడడానికి అవకాశమువుంటే ఆపద్ధతిని అనుసరించ డానికిమాత్రము ఆక్షేపణలేదు. ప్రభుత్వము వెంటనే అంగీకరిస్తుంది. కాని యీ పోలీసువాండ్లు చేస్తున్నపని చాలా చిక్కయినపని. గ్రామాలలో కక్షలు ఏర్పడి నపుడు పోలీసుఉద్యోగస్థులు ఎవరిపైనైనా విచారణ జరిపితే వెంటనే ఇంకొకపార్టీవారు తమకు అన్యాయముచేస్తున్నారేమోనని మరొక రకముగా వారిని నిందిస్తుంటారు. నిందలకు గురిఅయ్యే ఉద్యోగస్థులలో పోలీసువాండ్లకు మొదటిస్థానమువస్తుందని అనుకుం టాను. ఏచిన్న కార్యక్రమము చేసినాసరే వారిని ఆక్షేపించి వారిపైన నిందలువేసే వాండ్లుప్రతిగ్రామములో కూడవుంటారు కాబట్టి అతిజాగ్రత్తగావీరు మెలగవలసివస్తుంది. ఇంత జాగ్రత్తగా మెలగుతున్నాకూడ వారిపై నిందలురావడము విచారణ జరగడము జరుగుతున్నది. Corrupt officers వున్నారని, corruption తగ్గించాలని చాలా మంది మిత్రులు cut motions యిచ్చారు. Corruption లేదనిగాని అందరు మంచివారనిగాని నేను చెప్పను. General గా corruption వుంది. Corruption ను control చేయాలి. Generalise చేసి నిందించడమువల్ల లాభములేదు.

28th July 1955] [Sri N. Sanjeeva Reddi

Corrupt officers పై అతి కఠినమైనచర్య పుచ్చుకుంటున్నాము. ఈ మధ్యనే చిన్నచిన్న ఉద్యోగస్థులనేకాదు, constables నే కాదు, పెద్దపెద్ద ఉద్యోగస్థులను S.I.లను, circle inspectorలను Dy.S.P.లను గురించి enquiries జరుపుతున్నాము. Corrupt officers ఉండాలని మాకోర్కె కాదు. కఠినముగా వాండ్లను శిక్షించాలని మా ఉద్దేశము. కాని కేసు నిరూపింపబడాలి. ఎవరోవచ్చి ఇతడు లంచం పుచ్చుకున్నాడు అనినంతనే మనము వారిని శిక్షించడానికి పూనుకుంటే ఏ డిపార్టుమెంటులోనుకూడా ఉద్యోగస్థులు ఉండరేమో అని అనుకుంటున్నాను. గడచిన Assemblyలో ఒక మిత్రుడు "నేను యిద్దరి ఆఫీసర్లపైన report చేసినాను; ఇంక వారు ఉద్యోగములోనే వున్నారు" అని చెప్పాడు. మీ report పైన dismiss చేస్తే ఆంధ్రరాష్ట్రములో ఒక్క constable కూడా మిగలడమేమోననీ అందరినీ dismiss చేయవలసి వస్తుందని నేను ఆయనకు సమాధానం చెప్పాను. అరకంగా కాకుండా concrete proof వుండాలి. అతడు యేరకంగాలంచముపుచ్చుకున్నాడో చెప్పాలి. అప్పుడు మేము enquiry చేయించి Tribunalకు పంపాలి. Tribunal కూడా ఇది తృప్తికరంగా వుంది, నిజంగా ఇతడు లంచము పుచ్చుకున్నాడని మాకు విశ్వాసము కలదని చెప్పితే, అలాంటి ఉద్యోగస్థునికి ప్రభుత్వము రక్షణయివ్వదు. ఇంకా ఎక్కువగనే శిక్షించాలని మా ఆశయము. అరకముగనే యింతవరకు నడుస్తున్నది. ఎప్పుడుకూడా అలాంటివారిని యేపరిస్థితులలోకూడా రక్షించడానికీ పూనుకోలేదు. Dismiss అయినవాండ్ల సంఖ్య హెచ్చుగా వుందని చెప్పడానికి వీలులేదు. ఎంతోమంది corrupt officers గా వుండవచ్చును. కాని ఇంత procedure follow అయి evidence సేకరించి Tribunal ముందు నిరూపించి dismiss చేయడము జరుగుతుంది. అందుకోసము కొద్దిగా ఆలస్యము పోతుంది. Corrupt officers ను శిక్షించాలని మంచి officers కు రక్షణ కల్గించాలనే విషయములో ప్రతిపక్షమువారికిగాని ప్రభుత్వపక్షము వారికిగాని అభిప్రాయభేధాలు లేవు. అయితే నిరూపణ సరిగా వుండాలనేది అందరు అంగీకరించవలసిన విషయమే. ఇక elections లో మనపోలీసులు చూపిన న్యాయమైన ప్రవర్తన న్యాయమైన మార్గము, వారు అనుసరించిన పద్ధతులు అందరిచే హర్షింపబడ్డాయి. ఇక్కడనే కాదు. అక్కడ Delhi లో కేంద్ర ప్రభుత్వము, యిక్కడ మన గవర్నర్ గారు, అందరుకూడా పోలీసువారు ఎంతో నిష్పాక్షికముగా ప్రవర్తించారని, ఎక్కడైనసరే ఏ ప్రాంతములోనైనాసరే అల్లరులు లేకుండా ఎంతోబాగుగా జరిపినారని అందరుకూడా హర్షించినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. అక్కడక్కడ అల్లరులు కొద్దిగా జరిగినాయి. కాని యింత బ్రహ్మాండముగా electons జరుగుతూవుంటే యింత ఉద్రిక్తమైన పరిస్థితులు గ్రామగ్రామాలలోకూడా ఉంటే యింత

Sri N. Sanjeeva Reddi] [28th July 1955

విశాలమైన ఆంధ్రదేశములో, కోట్లకొలది జనసంఖ్య వుండడముచేత, ఎంతో ఉద్రేకాన్ని కలిగించే పరిస్థితులలోకూడ యింత ప్రశాంతమైన పరిస్థితులను కల్పించి ఎన్నికలు ఒక్కచోటనైన నిలచిపోకుండా నడుపగలిగినారంటే నేను వారిని అభినందిస్తున్నాను. ఎవరైన మిత్రులు ఏ కారణాలవల్లనైన ఎక్కడనో ఒక ఉద్యోగస్థుని ఆక్షేపిస్తే ఆక్షేపించవచ్చును. లేదా వారు కమ్యూనిస్టు మీటింగును పెట్టుకోనివ్వలేదనో లేక కాంగ్రెస్ వారు మీటింగు పెట్టుకోనివ్వ లేదనో చెప్పవచ్చును. నిష్పాక్షికంగా జరిపితే యే పార్టీకికూడా ఆక్షేపణ వుండదు. చాలా పార్టీలు ఆక్షేపించలేదు. కమ్యూనిస్టు పార్టీవారుకూడా ఎక్కువ ఆక్షేపణ తెలుపలేదు అని నేను ఇప్పుడిపుడు తెలుసుకుంటున్నాను. Records ను బట్టిచూస్తే వారు తెలిపిన ఆక్షేపణలుకూడా చాలకొద్ది. అవికూడా చిన్నచిన్న విషయాలే. బ్రహ్మాండముగా election ఫలితాలు తారుమారు జేసినట్లుగాని ప్రమాదమైన పరిస్థితులు కల్పించి కాంగ్రెస్ వాండ్లను గెలపించడానికి పనిచేశారనిగాని నిందారోపణలు ఎక్కడా రాలేదు. దీనికిమాత్రము నేను చాల సంతోషిస్తున్నాను. అన్నిపక్షాల వారికి తృప్తికరముగా వుండేటట్టు న్యాయముగా ప్రవర్తించినారని అనిపించుకొని యింత బ్రహ్మాండమైన ఎన్నికలను జరిపినందుకు పోలీసువారిని అభినందిస్తున్నాను. నిజముగా వారు ఇతర రాష్ట్రాలవారికి ఆదర్శంగా వుండేటట్లు ప్రవర్తించారు అని నేను అనుకుంటున్నాను. ఇక సుందరయ్యగారు నిన్న Labour Demand కు Cut motion పెట్టుతూ ఇంక ఎక్కువ డబ్బు కావాలి కాబట్టి డిమాండులో 100 రూపాయలు తగ్గించాలి అన్నారు. ఈ పోలీసు Demand విషయములో కూడ అటులే చేస్తారని ఆశిస్తున్నాను. చేస్తే నేను చాల సంతోషిస్తాను. ఎందుకంటే వచ్చే సంవత్సరము వాండ్లకు buildings కట్టించడానికి ప్రయత్నిస్తున్నాము. Constables మొదలుకొని Head Constables, Sub-Inspectors మొదలగు వారందరికి యిండ్లబాడుగలు యిస్తున్నాము. ఇండ్లు దొరకడములేదు కాబట్టి ప్రభుత్వము బాడుగ యిస్తుంది. కాని డబ్బే ముఖ్యము కాదు. వాండ్లకు ఇండ్లు కట్టాలి. ఇండ్లు కట్టడానికి అన్నిచోట్ల ప్రారంభిస్తే ఎన్నోకోట్ల రూపాయలు కావలసి వుంటుంది. ప్రతిసంవత్సరము 30-40 లక్షలరూపాయలు ఖర్చుపెట్టాలనుకుంటున్నాము. S. A. P. వారికి యిండ్లు లేవు. వాండ్ల కుటుంబాలు ఏ ఫూర్లలోనో వున్నారు. భార్యా పిల్లలు ఒకచోట, వాండ్లు ఒకచోట వుంటున్నారు. వాండ్లనుచూస్తే, వాండ్ల కుటుంబాల యిబ్బందులను చూస్తే బాధగానే ఉండవచ్చు. అయితే మేము ఒకే పర్యాయము అన్నిచోట్ల ఇండ్లు కట్టించలేని నిస్సహాయస్థితిలో వున్నాము. కాని యీ సంవత్సరమే ప్రారంభిస్తున్నాం. కొంతమందికిమాత్రమే గృహములు ఏర్పాటు

చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ పద్ధతిలో, ఆ ధోరణిలో, పోతున్నాము. వాండ్లకు గృహాలు యిన్వాలని వాండ్లకు వసతులు కలుగజేయాలి అనే ఉద్దేశము ప్రభుత్వానికి వుంది కాబట్టి కొన్ని లక్షలరూపాయలు వాండ్లకుగాను ఖర్చు పెట్టుతున్నాము. ఇక గడచిన సంవత్సరపు యిబ్బందులు ఏమిటో నేను చెప్పవలసిన పని లేదు అనుకుంటాను. Labour troubles ఏవో వుండినాయి. అప్పుడు హెచ్చు తగాయిదాలు కలుగకుండ యీ యిబ్బందులను అదుపులోనికి తేవడమే కాక తక్కువ బలగాన్ని ఉపయోగించి, least force ఉపయోగించి, వాటిని అదుపులోనికి తేగల్గినారంటే అది చాల గొప్పవిశేషము. అదుపులోనికి తేవడము సులభము కావచ్చును. ఎక్కువతుపాకులు కాల్చో లాఠీలు ఉపయోగించో అదుపులోనికి తీసుకురావడము ఒక మార్గము. వాటి నన్నిటిని చులకనగా వాడకుండ వారి రాష్ట్రములో శాంతిభద్రతలు కాపాడడముకూడా గొప్ప విశేషమే. ఎన్ని projects కట్టినా, ఎన్ని Industries start చేసినా ఎన్ని thermal stations పెట్టుకున్నా మన రాష్ట్రములో శాంతిభద్రతలు లేకపోతే మన రాష్ట్రము నిజంగా నిరుపయోగమైందని అనిపించుకుంటుంది. ఎక్కడకూడా జీవించడము ప్రజానీకానికి చాల కష్టమౌతుంది. ఎన్నెన్నో రకాలైన అల్లరులు బయలుదేరుతున్నాయి. కుప్పలకు నిప్పు పెట్టడము కొంపలకు నిప్పుపెట్టడము ఇవన్నీ సంభవిస్తున్నా అతిజాగ్రత్తగా పోలీసువారు యీ అల్లరులను అణచి శాంతి భద్రతలు నెలకొల్పి రాష్ట్రములో ఎవరైనా సరే ఎక్కడికైనా సరే పోవడానికి వీలుండే పరిస్థితులు కల్పించినందుకు మాత్రము నిజంగా మీరందరుకూడా పోలీసువారిని అభినందించాలి అని కోరుతున్నాను. ఇంక ఏవైన సవరించుకొనే పద్ధతులువుంటే మాకు సూచించవచ్చును. పోలీసులు చేస్తున్న మంచిపనికిమాత్రము మీరందరుకూడా వారిని అభినందించి యీ పోలీసు డిమాండును అందరూ ఏకగ్రీవముగా బలపరుచవలసిందిగా నేను ప్రార్థిస్తున్నాను.

Mr. SPEAKER :—The motion before the House is :

"That Government be granted a sum not exceeding Rs. 2,65,19,700 under Demand XIV—Police."

Mr. SPEAKER :—Mr. Sundarayya, we will have only Police Demand to-day, or, shall we have Electricity Demand also ?

Sri P. SUNDARAYYA :—Only Police Demand.

Mr. SPEAKER :—We shall introduce Electricity Demand at the end of to-day, because it is put for to-day's business.

Voting of Demands for Grants (Contd.)

Demand No. XIV—Police

[28th July 1955

SRI P. SUNDARAYYA :—It was put only as a matter of convenience. We shall have only Police Demand to-day.

THE Hon. Sri G. LATCHANNA : So, we shall not have Electricity Demand to-day, is it ?

MR. SPEAKER : Why? You want to go away ! (Laughter)

THE Hon. Sri G. LATCHANNA : No, I only want to know whether Electricity Demand will be taken up to-day.

311—

(444) SRI P. SUNDARAYYA : Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. 100.

(పోలీసు ఉద్యోగస్థులు ప్రజలపై పూర్వములాగే పెత్తనము చెలాయించడము, సెక్షను 107, 109, 110, 151 లను వినియోగించి అక్రమ అరెస్టు కేసులు పెట్టుతూ వుండడమువలన)

312 —

(38) SRI S. RANGANATHA MUDALIAR : Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(To discuss about hardships caused to certain officers of Special Armed Police now in the service of this State by the retrenchment in the Special Armed Police made by the Composite Madras State.)

314—

(58) SRI M. NAGI REDDI : Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(అధిక వ్యయమును గురించి లంచగొండితనమును గురించి, డిప్యూటీసూపరింటెండెంటు పదవులను రద్దుచేయుటగురించి, పల్నాడు తాలూకా దాచేపల్లి పోలీసు స్టేషనులో పనిచేసిన హెచ్. సి. చర్యలను గురించి చర్చించుటకు.)

315.—

(136) SRI V. VISVESWARA RAO: Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 10 0

(భూస్వాములు, వారి ఏజెంట్లు మంగళాపురం, వరిచింతల మొదలగు గ్రామాలలో పల్లెలపై దౌర్జన్యములు సాగించినను దుండగులను అదుపులో పెట్టుటలో విఫలమైన విషయం చర్చించుటకు.)

316—

(161) SRI G. YELLAMANDA REDDY: Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(పోలీసు డిపార్టుమెంటులో క్రింది ఉద్యోగులైన పోలీసులకు సరియైన జీతనాలిచ్చి వారికి మంచి సర్వీసు పరిస్థితులను కల్పించుటకు గాను ప్రభుత్వము ఏ చర్య తీసుకున్నదనే విషయమును చర్చించుటకు గాను.)

161-A—

(170) SRI B. SANKARAIAH: Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(ముఖ్యమంత్రి సన్నిహితులుగా నున్నవారు కొవ్వూరు తాలూకాలో పోలీసు ఆఫీసర్ల చేత ప్రజలను ఇబ్బందులపాలు చేస్తూ కమ్యూనిస్టుపార్టీ ఆఫీసులపై దాడులు చేస్తూ అనేకమంది ప్రజలపై మూకుమ్మడిగా సెక్యూరిటీ సెక్షన్ల క్రింద కేసులు బనాయిస్తూన్న ప్రభుత్వం ఆపనందుకు.)

317—

(234) SRI G. NAGESWARA RAO: Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(పోలీసు ఉద్యోగులు భూస్వాముల మద్దత్తుతో సామాన్య ప్రజలకు చేస్తూన్న అక్రమాల విషయములో ప్రభుత్వ పాలసీని చర్చించేందుకు.)

318—

(251) SRI PILLALAMARRI VENKATESWARLU : Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(To reduce the expenditure on Police and to point out the conditions in police lock up).

319 —

(273) SRI VAVILALA GOPALAKRISHNAYYA : Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(విధానం చర్చించుటకు.)

320—

(347) SRI S. VEMAYYA : Sir, I beg to move.

To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. ... ... 100

(పోలీసులకు యిండ్లవసతి లేనందుకు.)

MR. SPEAKER : Now the main Demand and the cut motions are before the House for discussion.

Sri B. RATNASABHAPATHY SETTY:—అధ్యక్షా! ఈ Police Demand పైన నేను ఈ రోజు మాట్లాడవలసియున్నది. ముఖ్యంగా కాకినాడలో మొన్న మొన్న జరిగినటువంటి గలభాలలో పోలీసుఉద్యోగులుచేసిన అక్రమాలు చాలా ఉన్నవి. వాటి విషయం మాట్లాడి ఆ తరువాత కాకినాడ పౌరులదగ్గరనుంచి నాకు వచ్చినటువంటి petition గౌరవ సభ్యులందరికీ స్పీకరుద్వారా అంద జేయదలచుకున్నాను. మొన్న మొన్ననే కాకినాడలో Municipal Chairman పైన no-confidence motion కొంతమంది సభ్యులిచ్చారు. ఆ విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ప్రతిపాదించిన సభ్యులు కొంతమంది గాడీలను గుమికట్టుకొని, Chairman గారు మ్యునిసిపాలిటీ విషయాలన్నీ ప్రజలకు నచ్చచెప్పాలనే ఉద్దేశ్యంతో

28th July 1955] [SRI B. Ratnasabhapathy Setty

ఆ పట్టణంలో కొన్నిచోట్ల బహిరంగసభలు పెట్టుకొని ఆ విషయాలు అన్నీ తెలపడానికి ప్రయత్నంచేస్తూంటే, కొందరు Councillor లు పోలీసులయొక్క సహాయంకూడా తీసుకుని వారిపైన రాళ్లు ఋవ్వించడం వారి బహిరంగ సభలను disturb చేయడం జరిగింది. ఈ విషయాలు అన్ని paper లలో వచ్చాయి. మీకందరకీ తెలిసేయుంటుందని నా ఉద్దేశ్యం. Chairman గారు తాను Chairman గా ఉన్న రోజులలో ఏమన్నా మంచిపనులుచేసిఉంటే అవి ప్రజలకు చెప్పేటప్పుడు, ఈ Councillor లు అతనిని ఏ విధంగా ప్రతిఘటించారో, అతను Chairman గా ఉండటానికి ఎందుకు object చేస్తున్నారో ఇవన్నీ ప్రజలకు చెప్పడం ప్రజాస్వామిక విధానంలో ముఖ్యంగా జరుగుతూ ఉంటుంది. వారు ప్రజాస్వామిక సిద్ధాంతాలను అమలుపెట్టుటకు ప్రయత్నంచేశారు. అటువంటి ప్రయత్నాన్ని విఘ్నంచేయడానికి కొంతమంది సభ్యులు, ప్రయత్నించారు. వారు కాంగ్రెసుసభ్యులే అని నాకు తెలుసును. వార్తలను బట్టి తెలుస్తూఉంది. ఆ పట్టణంలో వారికున్న పలుకుబడిని వినియోగించి పోలీసు ఉద్యోగుల సహాయాన్ని పొంది ఆ విధంగా వాళ్ళు చేశారు. Chairman గారు ప్రచారం చేశారంటే, ప్రజలందఱూ వాళ్ళకు వ్యతిరేకంగా తిరిగిపోతారనే ఉద్దేశ్యంతో ఆ meetings ను చెడగొట్టుటకు ప్రయత్నం చేశారు. ఇప్పు డిప్పుడే మంత్రిగారు, Police constables కాని, police ఉద్యోగులుకాని చాలా నిష్పక్షపాతంగా ప్రవర్తించారని, ప్రవర్తిస్తున్నారని వాళ్ళ ప్రవర్తనను బట్టిచూస్తే వాళ్ళలో నాకు సంపూర్ణమైన విశ్వాసం కల్గుతోందని అన్నారు. ఈపాటికి Minister గారికి వార్తలుచేరేఉంటాయి. పత్రికల మూలంగా కాకుండా secret గా, confidential గా ఆయనకు వచ్చినవార్తలనుబట్టి ఆయనకు తెలిసే యుంటుంది, కాకినాడలో జరిగినటువంటి పోలీసు ఉద్యోగుల ప్రవర్తన మటుకు నిష్పక్షపాతంగా లేదనీ, కేవలం అధికారంలోయున్న పార్టీ పురస్కరించుకొని, పోలీసు ఉద్యోగస్థులపై ఒత్తిడితీసుకువచ్చి ఏ విధంగా Chairman ను అతన్ని support చేస్తోన్న సభ్యులనూ ప్రజాస్వామికం అనే అవకాశాన్ని వినియోగించుకుని ప్రజలతో సంబంధం కల్గించుకోడానికి అవకాశంలేకుండా చేశారని. ఈ విషయం మంత్రిగారికి ఇదివఱకే తెలిసియుంటుందని నా నమ్మకం. మొట్టమొదట ఈ సంఘటన అంతా ఏ విధంగా జరిగిందోకూడా నేను తెలియజేయవలసియుంటుంది. 10 వ తారీఖునుంచి 17 వ తారీఖువఱకూ బహిరంగసభలు పెట్టుకోవాలని ప్రభుత్వానికీ, పోలీసువాళ్ళకూ తెలియజేశారు. 10 వ తారీఖునా, 13 వ తారీఖునా, 17 వ తారీఖునా వాళ్ళకు మీటింగులు పెట్టుకోడానికి permission ఇవ్వవలసిందిగా

Voting of Demands for grants (Contd.)

Demand No. XIV—Police

Sri B. Rathnasabhapathy Setty] [28th July 1955

పోలీసు ఉద్యోగులకు తెలియజేశారు. 10 వ తారీఖున మటుకు పోలీసువాళ్లు ఆటంకం ఎందువల్ల చెయ్యలేకపోయారో, చెయ్యలేదు. ఆ రోజు బహిరంగసభ సక్రమంగా జరిగిపోయింది. ఏలాంటి ఆటంకం లేదు. కాని పోలీసువాళ్లు ఆ బహిరంగసభకు హాజరయ్యారని తెలుస్తోంది. హాజరైన రోజు రౌడీలు ఆ బహిరంగసభలో Chairman C. V. K. రావుగారిపైన, మీటింగు అనంతరం రాళ్లు ఋవ్వడం వారిపై సోడాబుడ్లువేయడం జరిగింది. ఆరోజు పోలీసువాళ్లు ఆరౌడీలను ఆపడానికి ఏమాత్రం ప్రయత్నం చేయలేదని బాగా తెలుస్తోంది. కాని 13 వ తారీఖున మళ్లీ ఇదే బహిరంగసభ జరిపారు. బహిరంగసభ జరిపేముందు లైసెన్సుకు డబ్బుకట్టి microphone use చేసుకోడానికి అవకాశం కల్గించాలని వాళ్ళకు మనవిచేసుకున్నారు. కాని వాళ్ళ మనవి పాటించకుండా ఆ లైసెన్సుకోరకు వాళ్ళు కట్టిన చలాను దగ్గరపెట్టుకుని ఆ రోజు D. S. P. గారి Personal Assistant ఇంకా కొంతమంది పోలీసువాళ్లు మీటింగుకు హాజరైనారు. Meeting సక్రమంగా జరిగిపోయింది. Meeting మొదలిపెట్టేటప్పుడు మాత్రం, పోలీసువాళ్లు కాని మరెవరుగాని వాళ్ళను అభ్యంతర పెట్టడం జరగలేదు. Meeting అయిపోయిన తర్వాత D. S. P. Personal Assistant meeting లో యున్నటువంటి Chairman గారిని ప్రక్కకు త్రోసి, microphoneను లాగుకొనిపోవడంకూడా జరిగింది. ఇది ఎందువల్ల జరిగింది? ఏ విధంగా వాళ్ళమీటింగు శాంతిభద్రతలకు అపాయం కల్గించింది అనే విషయం వాళ్ళు తెలపకుండానే microphone సీజ్ చేసి తీసుకుపోవడం జరిగింది. నిజంగా ఇది నిష్పక్షపాతంగా యున్నదా అని మంత్రిగారిని నేనడుగుతున్నాను. అంతకుముందు 10 వతారీఖున జరిగిన మీటింగులో రౌడీల ప్రవర్తనను పోలీసువాళ్ళు ఏ విధంగానూ ఆటంకం చేయలేక పోయారు. తరువాత 13వ తారీఖుమీటింగుకు బందోబస్తు కావాలని కోరారు. Microphone use చేసుకోడానికి permission కూడా కోరారు. Permission ఇవ్వకపోవడమే కాకుండా మీటింగులో రౌడీలప్రవర్తన అరికట్టకుండా microphoneకూడా సీజ్ చేసి తీసుకుపోవడం జరిగింది. 13వ తారీఖున మీటింగుఅయినతరువాత వాళ్లు ఇంటికిపోయేటప్పుడు వాళ్ళను సోడాబుడ్లతోనూ రాళ్లతోనూ కొట్టడం జరిగింది. పోలీసువాళ్లు వెంట ఉన్నాగాని ఆరోజు రౌడీలప్రవర్తన ఆపడానికి ఏమైనా చేశారా అని అడుగుతున్నాను. మీకు వచ్చినవార్తలు ఏవిధంగా ఉన్నాయో నాకు తెలియదుగాని నాకు వచ్చినవార్తలను బట్టిచూస్తే వాళ్లు ఏవిధమైన ప్రయత్నం చేయలేదు. ఇది నిష్పక్షపాతంగా, కేవలం అందరిప్రజలకూ అనుకూలంగా ఉండుటకుచేసిందా లేక కేవలం ఆ Municipality లో వున్నటువంటి కొంతమంది కౌన్సిలర్లకు అనుకూలంగా ఉండేటట్లు చేసిందా

అని మంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను. తరువాత 22 వ తారీఖున అదే మ్యునిసిపల్ Office premises లో World Health Organization తరఫున World Health Day Celebration జరగవలసినదిగా వాళ్లు నిశ్చయంచేసుకున్నారు. ఆరోజు Municipal Chairman గారు ఆ సమావేశానికి అధ్యక్షతవహించి అక్కడున్నటువంటి children కు sweets, పెప్పరుమెంట్సు పంచి National Flag hoist చేసినతరువాత ఆ సమావేశం పూర్తికావాలని నిర్దేశించారు. ఆరోజు ఆ సమావేశం జరగడానికి వీలులేదని అభ్యంతరం కల్గించి National Flag కూడా hoist చేయడానికి వీలులేదని 144 section జారీచేశారు. ఈ Health Organization meeting కేవలం మ్యునిసిపల్ compound లో జరగవలసియుండి. అక్కడ జరిగేటటువంటి సమావేశంకూడా శాంతిభద్రతలకు విఘ్నంకల్గించేది ఏవిధంగా వౌతుందో నాకు తెలియదు. దానికికూడా 144 section జారీచేసి, అది జరగడానికి వీలులేకుండాచేశారు. కేవలం వ్యక్తిగతస్వార్థంవల్ల ఆ Municipal councillor లు పోలీసువాళ్లపై ఒత్తిడితీసుకువచ్చి ఈవిధంగా చేయించిందిగాదా అని నే ననుకుంటున్నాను. ఈవిధంగా ప్రజలు ఏవిధమైన meeting లు జరపకుండా 144 section జారీచేయడం చాలా అన్యాయం. ఈ 144 section ఏపరిస్థితులలో జారీచెయ్యాలి ? రెండుప్రక్కలా ఉద్రిక్తులై శాంతిభద్రతలకు పట్నంలో భంగం కల్గించే అవకాశాలేమైనా ఉంటే అప్పుడు issue చెయ్యాలిగాని ఒకపక్షం weak గావుండి ఏమీ ఉద్రిక్తతలేకుండా ప్రజలలోకివెళ్లి పరిస్థితులు చెప్పబోతూయున్నప్పుడు, వేరొకపక్షం రౌడీలనుపంపి వాళ్ళను ఏవిధమైన కార్యక్రమం జరుపుకోనీయకుండా చేస్తూంటే ఆరౌడీలను అరికట్టే ప్రయత్నం చేయకుండా 144 section జారీ చేయడం అన్యాయమని తెలియజేస్తున్నాను. ఇప్పుడు నాకు కాకినాడ ప్రజలదగ్గర నుంచి వచ్చినటువంటి petition Speaker గారికి అందజేస్తున్నాను. ఇప్పుడు కాకినాడలో ఉద్రిక్తపరిస్థితులేవీ లేవని ఈ 144 section కు అవసరమేమీలేదని అది తీసివెయ్యాలనీ, World Health Organization తరఫున జరగబోయే మీటింగు జరగకుండా అవమానం చేశారనికూడా దీనిలో తెలియజేశారు. ఇన్నూట పదహారుమంది సంతకాలుచేశారు. ఇది గౌరవనీయులైన సభ్యులకందరకూ తెలియజేయవలసిందిగా కోరారు. ఈ 144 section తీసివేయించాలని ప్రార్థించారు.

(At this stage Mr. Deputy Speaker occupied the Chair)

THE HON. Sri A. B. NAGESWARA RAO :—ఎవరెవరిసంతకాలున్నవో తెలియజేస్తారా ?

12-30 p. m.

Sri B. Rathnasabhapathy Setty,

ఇంకా గతములో చాలా నిదర్శనములున్నాయి. వీటిని గురించి నా మిత్రులు తెలియజేస్తారు. ముఖ్యంగా పోలీసు ఆఫీసర్లు నిష్పాక్షిక బుద్ధితో ప్రవర్తించలేదని తెలియచేస్తున్నాను. కాకినాడ Municipal Council లో no Confidence motion move చేసినటువంటి సభ్యులు కాంగ్రెసువాళ్లే. వాళ్లు చేసినటువంటి వొత్తిడివల్లనే ఆ పోలీసువాళ్లు ఈ విధంగా చేశారని మీకు తెలియజేస్తున్నాను. కనుక ఈ విషయాన్ని మీరు జాగ్రత్తగా ఆలోచించి వెంటనే చర్య తీసుకొని, 144-వ సెక్షను withdraw చేసి పౌరసత్వ హక్కులకు భంగములేకుండా కార్యక్రమాలను సక్రమంగా చేసుకోడానికి వీలు కలిగిస్తారని నేను మీకు మనవిచేసుకొంటున్నాను. ఇది చాలా ముఖ్యమైన విషయము. ఇది ఏదో ఇద్దరు ముగ్గురు Councillors కు గాని Chairman కు గాని సంబంధించింది మాత్రమే కాదు. కాకినాడ పట్టణమంతటికీ, అందలి ప్రజల కందరికీ సంబంధించినటువంటిది కాబట్టి దీనిమీద గట్టిచర్య తీసుకోవలసినదని మీకు హెచ్చరిక చేస్తున్నాను.

Sri L. LAKSHMANA DAS:—ఉపాధ్యక్షా, ఈ నాడు Police Demand పైన చర్చ జరుగుచున్న సందర్భములో సంజీవరెడ్డిగారు చెప్పిన లెక్కలనుబట్టి చూస్తే ఆంధ్రరాష్ట్రము నిజంగా గర్వించవలసియున్నది. లెక్కలనుబట్టే కాదు, ఈనాడు గ్రామాలలోను, జిల్లాలలోను ఉన్న పరిస్థితులను గమనించినట్లైతే ఈ Police శాఖ చాలా సక్రమంగానూ, న్యాయంగానూ నడుస్తున్నదనేది బాగా రుజువుఅవుతుంది. అందుకు మనము ప్రతి ఒక్కరు గర్వించడమే కాకుండా పోలీసు శాఖలో ఉన్నటువంటి ఉద్యోగస్థులుకూడ గర్వించవలసియున్నది. దేశ సౌభాగ్యానికి, ప్రజల అభివృద్ధికి పాటుపడేటప్పుడు రక్షణ అనేది చాలా ప్రధానమైన విషయము. రక్షణలేకుండా ఎంత గొప్ప కార్యాలు తలపెట్టినా, అవి సక్రమంగా జరుగలేదు. ఈ విషయంలో ఆంధ్రదేశములోని పోలీసులు ఇతర రాష్ట్రాలకు కూడ మార్గదర్శకులుగా ఉండడం గురించి నిజంగా ప్రతి ఆంధ్రుడు గర్వించవలసి యున్నది. మన రాష్ట్రములో పోలీసు శాఖ ఎంత సక్రమంగా నడుస్తున్నది అనేదానికి ఒకటే నిదర్శనము చెప్పుచున్నాను. ప్రకాశం ప్రభుత్వంలో నిజంగా ప్రపంచంలో ఎక్కడా జరగని సంఘటన ఒకటి జరిగింది. ఆంధ్రరాష్ట్రావతరణ సందర్భమున జైలులో ఉన్న అనేక రకాలైన criminals ను విడిచిపెట్టినపుడు, దేశములో ఒకవిధమైన అలజడి బయలుదేరింది. అనేకమంది criminals, murderers జైలునుంచి బయటికివస్తున్నారు, దేశములో ఏమి ప్రమాదం సంభవిస్తుందోనని ప్రతిఒక్కరు ఆందోళనచెందుతున్న రోజులలో, మన పోలీసులు చాలా చురుకుగా, సక్రమంగా ప్రవర్తించి, జైలు

Sri L. Lakshmana Das] [28th July 1955

నుంచి బయటికి వచ్చినవారు ఎటువంటి చెడ్డకార్యాలు చేయకుండునట్లు వారిని సరియైన కట్టుదిట్టములలో పెట్టి ప్రజలకు రక్షణ ఇచ్చినారు అనే విషయాన్ని గమనించినట్లయితే ప్రతిఒక్క సభ్యుడు నా అభిప్రాయముతో ఏకీభవిస్తారని భావిస్తున్నాను. అందుచేత ఈ శాఖను నడుపుతున్న మన సంజీవరెడ్డిగారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ఈ పోలీసుశాఖనుగురించి ఇంకొక విషయం ముఖ్యంగా మనవిచేయవలసి యున్నది. క్రొత్తగా యేర్పడిన రాష్ట్రములో అనేక రాజకీయపార్టీలతో కూడిన వాతావరణం యేర్పడి కమ్యూనిస్టులుకూడా మేము పరిపాలన చేస్తాము అని ఉర్రూతలూగుతున్న సమయంలోకూడ పోలీసులు న్యాయంగా, నిష్పక్షపాతంగా ప్రవర్తించడమే కాకుండా శాంతిభద్రతలు కాపాడి, దేశానికి యెంతో మేలుచేశారు. ఈ విధంగా ఇతర రాష్ట్రములకుకూడ మార్గదర్శకులు అయ్యారు. ఈ సందర్భంలో వారి కష్టసుఖాలు గురించి కొంత మనవి చేయదలచాను. Police Officers విషయంలో జిల్లా cadre వరకు, వీరి పని చాలా సక్రమంగా ఉన్నది. అందులో యేలాటి ఆక్షేపణలేదు కాని చిన్న చిన్న ఉద్యోగస్థులలో మాత్రము కొంత అవినీతికరమైన కార్యక్రమాలు ఉండవచ్చును. ఈ చిన్న పోలీసు ఉద్యోగస్థులు, constables లో ఒకవిధమైన నిరుత్సాహము ఉండడానికి అవకాశము ఉన్న దేమోనని నేను భావిస్తున్నాను. కనుక ఈ పోలీసు సర్వీసును చాలా essential service క్రింద తీసుకొని కనీసం వాళ్ల పిల్లలకు ఉచిత వైద్య సదుపాయాలను కల్పించినట్లయితే వారు ఇంకా ఎక్కువ పట్టుదలతో పనిచేస్తారని నేను ఆశిస్తున్నాను. అమెరికా, ఇంగ్లండు మొదలగు విదేశాలలో పోలీసువారు ఏ విధంగా ప్రవర్తిస్తున్నారో చూచినట్లయితే అక్కడ పోలీసులు కేవలం బందోబస్తుగాఉండడమే కాకుండా, ప్రజలకు సన్నిహిత స్నేహితులుమాదిరిగా ప్రవర్తిస్తున్నారు. మన పోలీసులుకూడా దీనినిగుర్తించి కేవలంరక్షణగురించే కాకుండా కొత్తవాళ్లు వచ్చినప్పుడు, వాళ్ళను సరియైన విధంగా నడిపి, ఉన్న ప్రజలను కూడ సక్రమంగా తెలుసుకోవాలని కోరుతున్నాను. తరువాత ఈ నాడు ఉన్న పోలీసు చాలదు అని నా ఉద్దేశము. పోలీసు స్టేషన్లు అభివృద్ధిపరచడమే కాకుండా, ఎక్కడెక్కడ ఏమేమి జరుగుతున్నదో తెలుసుకోడానికి, ప్రతి ప్రదేశంలోను పోలీసులు తిరగడం కూడ చాలా అవసరము. అమెరికాదేశపు పోలీసులను, ఇంగ్లండుదేశపు పోలీసువాళ్లు సామాన్యమైన రైళ్లలో మామూలు డ్రెస్సులో తిరుగుతూ ఎక్కడ ఎటువంటి అల్లర్లుకూడ జరగకుండా ఎప్పటికప్పుడు హెచ్చరికచేస్తూ ఉంటారని తెలుస్తుంది. ఆ విధంగానే మన పోలీసు అధికారులుకూడ ప్రవర్తించి ఇతర రాష్ట్రాలకుకూడ మార్గదర్శకులుగా ఉంటారని కోరుతున్నాను. పోలీసువాళ్లకు ఇళ్ళ విషయంలో ఇంకా సదుపాయాలు కావాలని మంత్రిగారు చెప్పారు. నిజంగా, గ్రామసీమలలోను, చిన్న చిన్న పట్టణములలోను వారికి ఇళ్లసదుపాయములు లేక

28th July 1955] [Sri L. Lakshmana Das

పోవడంవల్లనే చాలా ఇబ్బందులు పడుతున్నారు. వారిని గురించి ప్రత్యేకంగా ఎంత ఖర్చుపెట్టినా ఎట్టి ఆక్షేపణా ఉండదు. కమ్యూనిస్టుసభ్యులుకూడ దానికి ఆక్షేపణ తెలపరని నేను భావిస్తున్నాను. దేశానికి, ప్రజలకు రక్షణ చాలా అవసరమైనటువంటిది. గనుక ఇంకా ఈ శాఖకు వచ్చే 2, 3 ఏళ్ళలో హెచ్చు మొత్తాన్ని కేటాయించి ఇంకా హెచ్చుమంది ఉద్యోగస్థులను appoint చేయాలని మనవి చేస్తున్నాను. తరువాత పోలీసు Sub-Inspectors ను direct recruitment ద్వారా తీసుకొంటున్నందువలన, చాలమంది బాగా చదువుకొన్నవారు వస్తున్నారు. వారు చాలా ఉత్సాహంతో, ఈ దేశరక్షణ నాది అనే బాధ్యతతో ప్రవర్తిస్తున్నారు. అయితే, ఈ direct recruitment వలన Head Constables చాలామంది revert కావడం జరుగుతున్నది. దానివలన వారిలో కొంత నిరుత్సాహం ఉన్నది. కాని మనము prohibition ను పోలీసువారికే అప్పజెప్పాలని అనుకొంటున్నాము. గనుక, ఈ Prohibition Department పెట్టేటప్పుడు, చాలామంది పోలీసువారికి promotions వచ్చే అవకాశమున్నదని నేను ఆశిస్తున్నాను. నైతికమైన ఈ శాసనాన్ని అమలుపెట్టినప్పుడు Constable మొదలుకొని, జిల్లాఅధికారివరకు ప్రతిఒక్కరు ఇంకా, ఎక్కువ ఉత్సాహంతో కృషిచేసి ఈ prohibition ను విజయవంతంగా నెలకొల్పినట్లైయితే, నిజంగా పోలీసులకు, పోలీసుశాఖకు ఇప్పటికంటె ఎక్కువ గౌరవము పెరుగుతుందని మనవిచేస్తున్నాను. ఈ గురుతరబాధ్యత వాళ్లమీద పడనున్నందున పోలీసుశాఖవారు ఆ కార్య నిర్వహణలో సక్రమంగా నడుస్తారని ఆశిస్తూ, వారు ఈనాడు చాలావరకు మార్పుచెందినందుకు పోలీసుశాఖకు, ఆ అధికార్లకు నేను ప్రత్యేకంగా అభినందనములు అర్పిస్తున్నాను.

1 p.m.

SRI U. RANGA BABU:-Mr. Deputy Speaker, Sir, the Hon. Deputy Chief Minister has been pleased to state that house-breaking has been on the decrease. At any rate it is not so in my district. In Srikakulam district it is on the increase. Perhaps what he said may be said to be so in Andhra in general. But definitely house breaking and robbery are on the increase in my place ; there is no doubt about it. Such cases do not occur in the house of common people. They take place in the houses of officers, officers like Sub-Divisional Magistrate and Circle Inspector and similar officers. No doubt the Police are investigating those cases. As a result of such investigation it has been found that there is a gang operating. One [illegible] has been caught. He is one who comes from

Ramanathapuram. He is a prisoner who was set free at the time of the general amnesty, an act done by the previous Ministry. That gang is thirty strong. A member of that gang was caught for house-breaking at Ichapur, and he, in his confession, gave a full detail of all the house-breaking and dacoity committed by his gang. There is another gang similar to this. Its methods are also similar to this gang. This gang also broadens the window bars and through sheer physical force enters the house. There were six similar cases in my place. As the existing Police staff is not adequate to put down this crime, I request Government to increase the staff in that place.

With respect to the salary etc., of Police Constables the Hon. Deputy Chief Minister was a bit self-complacent. I think the Police Constables and the village officers are the real administrators of the country. The real success of administration depends upon them. They have got potential power to do mischief, if only they wish to do so. Now, to induce them to do their work honestly and efficiently they should be paid well. Here I would say one word about the daily allowance to the Police Constable while going on tour. He is paid a daily allowance of twelve annas. Can anyone say it is a sufficient sum for him to get on. So I request Government to increase it as early as possible. Government should treat Police Constables as belonging to essential service. To enable them to discharge their work efficiently they should be placed above care and worry. That can be done only by giving their children free education.

With respect to their morale, I am not satisfied. I do not think it is on a high level. Perhaps, in Andhra and in Madras it is better than in other places. But when we take the Police in foreign countries as the standard I have to confess they are far below them. Take England or London. There the Police Constable has a civic sense ; he knows he is the humble servant of the people ; he has to serve them. If a person is stranded in the streets, he helps him to get to his

Sri U. Ranga Babu] [28th July 1955

destination. So to achieve this, there should be a slight increase in their salary. Another way is by improving their status. How can that be done ? It is by making statements given before a Police Inspector valid in a court of law. At present it is not so. The Police also should be imbued with a sense of civic responsibility. Then only our State will be in a better condition. For all this they should be given proper training.

Here I have to say a few words about what Sri Lakshmana Dass said. He said that the direct recruits are better than the promotees in the Police Department. Because, being educated and being Graduates, they are above corruption. Perhaps it may be so ; but, I will say, it is only a matter of opinion. They are not as efficient as their predecessors, who have come up from the lower ranks. Being Graduates they would not undertake hard tasks, especially in my district where there is large scale house-breaking and house-raids taking place. So these Graduates should be given better training. Thank you, Sir.

SRI P. NARASIMHAPPA RAO :—ఉపాధ్యక్షా, ఈ డిమాండును నేను బలపరుస్తూ కొన్ని సలహాలు చేయదలచాను. మా శ్రీ కాకుళంజిల్లాలో చాలా కొండ ప్రాంతాలున్నవి. ఈ కొండప్రాంతాలలో ఎక్కువగా నేరాలు జరుగుతూ వుంటున్నవి. అందువల్ల యిప్పుడు ఆ ప్రాంతాలకుగాను ఏర్పరచిన పోలీసుస్టేషను లకుతోడుగా మరొకటి extra గా station ఏర్పాటుచేస్తూ అందుకు Sub-Inspector ను ఒకరిని వేయవలసిందిగా కోరుతున్నాను. కారణమేమిటంటే, తాలూకా అంతాకూడా వారి చార్జిలో నేవున్నది. ఏజన్సీ ప్రాంతము విస్తీర్ణములో చాలా గొప్పది. అందువల్ల పాతపట్టణం, పాలకొండ, పార్వతీపురం, ఈ ప్రాంతా లకు ఏజన్సీప్రాంతాలు దగ్గరగావున్నందున, ఈ ఏజన్సీకి అందుబాటుగావున్న తాలూకాలో ఒక station extra గా ఏర్పాటుచేసి అక్కడ ఒక Sub-Inspector ను In-charge గా ఏర్పాటుచేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నారు. రెండవది, మా శ్రీకాకుళం జిల్లాకువున్న District Superintendent of

Sri P. Narasimhappa Rao] [28th July 1955

police office తీసుకొనివెళ్ళి విజయనగరంలో పెట్టారు. ఈజిల్లా మాకు వేరుచేసి యిప్పటికప్పుడే నాలుగుసంవత్సరా లయింది. శ్రీకాకుళం జిల్లాలో ఒక జిల్లాఆఫీసు కూడాలేదు. జిల్లా పోలీసు సూపరెండెంటుతో ఏఅవసరము వచ్చినప్పటికినీ, జిల్లాలో ఏ ప్రదేశములోనైనను గలాటాలు జరిగినప్పుడు Reserve Police బందోబస్తు అవసరమై ఉంటుంది. అప్పుడు పోలీసు సూపరెండెంటుసహాయము వెంటనే కావలసి వుంటుంది. Reserve పోలీసులు విజయనగరమునుంచి శ్రీకాకుళం జిల్లాలో ఒక్కొక్కప్పుడు మారుమూలలకుకూడా పోవలసి వుంటుంది. అంతదూరమునుండి రావడమంటే ఎంతో ఆలస్యము అవుతుంది. గనుక చేరువలోనే వాళ్లువుంటే, ఎక్కువగా ఉపయోగపడుతారని అంటున్నాను. మాజిల్లాలో పోలీసులకు training యివ్వటానికి స్కూలుగూడా లేదు. శ్రీకాకుళం దగ్గరలో బొబ్బిలి ఎస్టేటువారి buildings కొన్నివున్నవి. శ్రీకాకుళంలో జిల్లాఆఫీసుల కొరకు buildings కట్టేవరకూ బొబ్బిలి ఎస్టేటువారి buildings లో గాని, యింకా అక్కడనే యితర ఎస్టేటు buildings వున్నవి. కాబట్టి అందులోగాని శ్రీకాకుళంకు దగ్గరగా ఎక్కడనైనాసరే యీజిల్లా పోలీసు సూపరెండెంటు ఆఫీసును వుంచటానికి ఏర్పాటు చేయవచ్చును. ప్రభుత్వమువారు ఈ ఆఫీసును వెంటనే అక్కడికి మార్చటానికి ఏర్పాటు చేయవలసిందిగా కోరుచున్నాను.

మరొక విషయము మనవిచేస్తున్నాను. మా శ్రీకాకుళం జిల్లాలో ఇళ్ళు చాలామటుకు ఎక్కడనో ఒకటితప్ప అన్నికూడా గడ్డితోనే కట్టుకుంటారు. మా జిల్లాలో తాటిఆకులు దొరకవు. అన్నముకూడా చాలామంది గడ్డితోనే వండుకుంటూంటారు. కాబట్టి వరిగడ్డితో కట్టబడివున్న ఇళ్ళసంఖ్య అధికంగా వున్నవి. వేసవికాలములో అగ్నిభయాలు మెండుగా ఉంటున్నవి. అక్కడక్కడ Fire Stations చాలా అవసరం. ఇప్పటికి సోంపేటలో ఒక్కటే Fire Station వున్నది. ఆ జిల్లాకు ఇది ఒకటేచాలదు. దీనికితోడుగా బొబ్బిలిలోకూడా ఒక fire station ను ఏర్పాటు చేయించవలసిందిగా కోరుతూ విరమిస్తున్నాను.

SRI M. VENKATA RAJU :—ఉపాధ్యక్షా, ఈ పోలీసు డిమాండు మీద మంత్రివర్యులు మాట్లాడుతూ వివరించిన విషయాలకు అన్నింటికిన్నీ మా కెట్టి అభ్యంతరమూ లేదు. కాని, సాధారణముగా ఈ పోలీసువారు చేసే అక్రమాలు, అన్యాయాలు యిటువంటివి అని చెప్పటానికి అలవి కాదు. ఈ విషయము సభ్యులందరికి తెలుసుననే అనుకుంటాను. ఇటీవల కొన్ని సంవత్సరాలనుంచి

మన ఆంధ్రదేశపు గ్రామాలలో చాలామటుకు దౌర్జన్యాలు జరుగుతున్నవనే సంగతి గూడా అందరికీ తెలుసు. ఈ దౌర్జన్యాలు రావటానికి కారణము రాజకీయంగా ప్రవేశపెట్టినది మన కమ్యూనిస్టులే. ఈ దౌర్జన్యాలు అంటే, కర్రలతో దౌర్జన్యానికి దిగడము, కొట్టడం ఒరిసెలతో పాడవడం, కూనీలు వగైరాలవరకూకూడా పోతూ వుంటున్నవి. ఈ దౌర్జన్యాలు జరుగుతున్నప్పుడు పోలీసులు దగ్గరలో ఎక్కడైనా వుంటే, వారితో చెప్పితే, దానికి వారు మాట్లాడరు. ఇంకొకసారి పోయి చెప్పి యీ దౌర్జన్యం ఆపమంటే, "ఏదీ !, ఇంకొకసారి కొట్టుకోండి, చూస్తాము" అని అంటారు ఆయన చివరికి ఏచర్య తీసుకోకుండానే పోతారు. తరువాత ప్రతిదానికి 120 వ శెక్షను ఉపయోగిస్తూ వుంటారు. ఎవరో ఒకరిమీద కేసుపెట్టడం జరిగితే, దానికి సాక్ష్యం కావాల్సి వుంటుంది. కాంగ్రెసువారికి తప్పుడు సాక్ష్యం చెప్పడం కాని, పోగు చేయడం కాని చేతకాదాయెను. ఇక అవతలవారు, చెప్పేది అంతా తప్పుడుసాక్ష్యమే. ఇక మేజస్ట్రేటుదగ్గర సాక్ష్యం చెప్పటానికి వచ్చినప్పుడు, వాళ్లు సాక్ష్యం చెప్పే టప్పుడు ఏమి చెబుతారంటే, "కొట్టాడండి. అయితే నేను చూడలేదండి" అని చెప్పడం, యిక కాంగ్రెసువారిమీద వారు చెప్పేటప్పుడు, కొట్టినా కొట్టకపోయినా వారు ఏమి చెబుతారంటె "ఫలానావాడు వచ్చాడు, కర్రతో నెత్తిమీద బాదితల పగల కొట్టాడు, అది నేను చూచాను." అని అంతా జరగకపోయినా జరిగినట్లుగా చెప్పడం జరుగుతున్నది. అక్కడ అసలుమనిషి లేకపోయినా "వున్నాడు నేను చూచాను" అనే చెబుతారు. ఈ విధంగా తప్పుడు సాక్ష్యం ఏర్పాటుచేస్తేనే గాని కేసువుండదా యెను. అందువల్ల మేము కేసు పెట్టడానికి వీలులేకుండా పోతున్నది. అనేకచోట్ల యీ విధంగా దౌర్జన్యాలు, కొట్లాటలు జరుగుచున్నవి. ఇంకా చెప్పాలంటే, చాలా విచిత్రమైన కథలు వున్నవి. పోలీసులకు ఎన్నో రిపోర్టులు చేశాము. పోలీసు స్టేషనుకు పోయి ఎదురుగా చెప్పినప్పటికినీ చెప్పుకున్నవారికీ దిక్కు మొక్కు వుండదు. కాని ఒక విషయముమాత్రం స్పష్టముగా చెబుతున్నాను. మా గ్రామంలో కట్టమీద వున్న కొబ్బరి మొక్కలు నరికివేశారు. పోలీసులకు రిపోర్టుచేస్తే దానిని గురించి ఇంతవరకువచ్చి విచారించినది లేదు. విచారణ చేయకుండానే ఎవరు నరికారో చెప్ప మంటారు. ఎవరు నరికింది చూస్తే పోలీసువారికి కబురు చేస్తామా ? వాళ్లను మేమే అప్పుడే పట్టుకుని ఉండేవాళ్లము. అట్లాగే అనేక పర్యాయములు మంచి ఎడ్ల జతలను, పాడి బర్రెలను ఎత్తుకొనిపోయి అమ్ముకొన్న ఘటనలుకూడా వున్నాయి. అవి రిపోర్టుచేస్తే ఇంతవరకు దిక్కు మొక్కు లేదు. మంత్రిగారితో చెబితే పైగా

చాలా కేసులు తగ్గించా మంటున్నారు. 100 కి 50 మేజస్ట్రేటుగారే కొట్టివేస్తారు. 25, 30 కేసులు పోలీసు పట్టుకొంటారు. అది గొప్పతనము కాదు. ఎవరూ చూడనటువంటి కేసులు, అప్పటికీకూడా అన్యాయంగా జరిగిన కేసులు రిపోర్టులు చేసినప్పుడు వాటిని గురించి ఇన్వెస్టిగేటు చేసి దొంగలను పట్టుకుంటే, అది పోలీసువారి సామర్థ్యము అని చెప్పడానికి వీలవుతుంది గాని, దొంగ సాక్ష్యములతో కోర్టులో 4 కేసులు పెట్టి నిరూపించినంత మాత్రముచేత ఆంధ్రదేశములో వున్న పోలీసువారు చాలా గొప్పపని చేశారని అనడానికి ఏమీ అవకాశము లేదు. ముఖ్యముగా ఈ మధ్య ఒక విషయము నాకు తెలుసు. అనేక గ్రామాలలో వోట్లు ఇవ్వలేదన్న మిషతోవచ్చి మైనార్టీగా వున్నవారిమీద బడి బాదుతుంటే అది సర్కిలు ఇన్స్పెక్టరుగారితో చెబితే, విచారిస్తాము లెండి అంటారు. అథవా విచారించినా కేసులు పెట్టినట్లు లేదు. డిప్యూటీ సూపరింటెండెంటు గారి వద్దకు వెళ్లి, సర్కిలు ఇన్స్పెక్టరుగారు విచారించలేదని చెబితే, ఆయన లంజముండ కేసులు అంటారు. పోనీ స్త్రీలదగ్గర దెబ్బలాట జరిగితే అది పోలీసువారు విచారించనక్కరలేదు. ఈ రకంగా అనేక వ్యవహారాలలో కమ్యూనిస్టు పార్టీవారితో కలసి అనేకచోట్ల పోలీసువారు అనేక అక్రమాలు చేస్తున్నారు. ఎన్నికలలో కూడా ఎంతో న్యాయంగా వున్నామని మంత్రిగారు చెప్పారు. ఇన్స్పెక్టర్లు, కాన్స్టేబుల్సు రూల్సుకు వ్యతిరేకంగా ఏ రాజకీయ పార్టీవారిమీదనూ రిపోర్టు చేయకూడదు అట్లా చేస్తే వారిని శిక్షిస్తామని ప్రభుత్వమువారు చెప్పినప్పటికి కూడా అనేకమంది కత్తి కంకి గుర్తుగల పెట్టెలోనే మీరు వోట్లు వేయాలని వారు బహిరంగంగా ప్రచారము సాగించారు. పై ఉద్యోగస్తులకు రిపోర్టు చేస్తే ఈ రోజు వరకూ అది విచారించిన దిక్కూ మొక్కూ లేదు. ఇది ముఖ్యముగా మీ అందరికీ తెలుసు. మంత్రిగారికికూడా తెలుసు. ప్రపంచములో ప్రతివారికి తెలుసు. కమ్యూనిస్టు పార్టీవారు దౌర్జన్యంతో, దౌర్జన్య పద్ధతులతో వుంటారని తెలుసు. అటువంటి వారి బారినుంచి ప్రజలకురక్షణ ఏమిఉన్నది? పోలీసువారు ఈ 144 సెక్షనును అందరికీ బైండోవరు చేస్తామంటే దెబ్బలు తిన్నవాడికి, దెబ్బలు తిననివాడికి అందరికీకూడా ఒకేశిక్ష అవుతుంది. ఇద్దరూ కోర్టులచుట్టూ తిరగాలి. మేజస్ట్రేటుచుట్టూ తిరగాలి. ఈవిధంగా గ్రామాలలో అనేక సంవత్సరములనుంచి ఈ పద్ధతిగా వుంటున్నది. అభము శుభము ఎరుగని అనేకమంది రైతులు ఈ రోజు కమ్యూనిస్టు పార్టీవారు పెట్టిన దెబ్బలాటలవల్ల, తగాదాలవల్ల కోర్టుచుట్టూ తిరుగుతున్నారు. రెండు, మూడు సంవత్సరాలవరకూ అవి పరిష్కారంకావు. నాకు నిన్న ఒక టెలిగ్రాము వచ్చింది. ఒక ఉత్తరము కూడా వచ్చింది. ఒక రైతుకు ఇంకొకరైతు అడ్డము వస్తున్నాడు. నాట్లకు వెళ్ళ

Sri M. Venkata Raju] [28th July 1955

నివ్వరు. పోలీసుకు రిపోర్టుచేస్తే ఇది Civil matter అంటున్నారు. తన పట్టాభూమికి తాను శిస్తు కట్టుకుంటూంటే Civil matter అంటారు. ఎక్కడ అయినా తగాదాపడితే అది Civil matter అంటారు. అంతేగాని ఈ రైతుకు పట్టావుండి, సాగుచేసుకుంటున్నాడు, అవతలవాడు దౌర్జన్యముమీద వస్తున్నాడు కాబట్టి వాడు రాకుండా చేద్దామనే పరిజ్ఞానము మన పోలీసులకులేదు. ఇంకా మా మిత్రులు చెప్పారు. నేను ప్రతివారిమీద చెప్పదలచుకోలేదు. కొన్ని కొన్నిచోట్ల అక్రమాలు జరుగుతున్నాయి. కాని అంతా అట్లాచేస్తారని నేను చెప్పను. అయితే డైరెక్టు రిక్రూటుమెంటులేదు. ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత ఇంతవరకు చేయలేదు. మామూలుగా కానిస్టేబుల్సును ప్రమోటు చేస్తున్నారు. దానివల్ల డిపార్టుమెంటులో చాలా అవినీతి హెచ్చవుతున్నది. బాగా చదువుకొన్న వాళ్ళను, బి. ఏ., చదువుకొన్నవాళ్లను, తనదేశం తనప్రజలు, అని అభిమానముగలవారిని రిక్రూటుచేస్తే యీ డిపార్టుమెంటు ఎక్కువ బాగుపడుతుంది. ముఖ్యముగా స్వరాజ్యము రాకముందు వుండే పద్ధతులు ఇప్పుడు ఎక్కువగా మారినట్లు నాకు కనిపించడము లేదు. వారిచేతులలో చాలా అధికారాలు వున్నాయి. దారిలో వెళ్ళేవారిని అరెస్టుచేసి వాళ్లను తీసుకువెళ్ళి జైళ్లలో పెట్టవచ్చును. 24 గంటలలో, 16 గంటలలో వుంచవచ్చును. అట్లాగే అనేకమంది గౌరవనీయమైన రైతులను తీసుకువెళ్ళి కక్షకోసము అరెస్టుచేసిన కేసులుకూడా చాలా ఋజావు చేయగలను. ఈ విధముగా వాళ్లకు అధికంగా అధికారాలు వుండడమువల్ల వాటిని వుపయోగించే విషయములో చాలా జాగ్రత్తగా ఆలోచించి వుపయోగించాలి గాని అన్నింటికి ఒకే మందుఅనే పద్ధతిగా వారుచేయడము న్యాయముకాదు. ముఖ్యంగా బాపట్ల పరిసర గ్రామాల్లో ఈరోజు వారికి జరుగుతున్న దౌర్జన్యములను అన్యాయాలను న్యాయముగా మంత్రివర్గమువారు ఎవరినైనా అధికారులను పంపించి విచారణ చేయిస్తే, మేము రుజువుచేస్తాము. మేము ఉత్తరమువ్రాస్తే మమ్ములను అడగరు. ఎవరినో అడిగి వాళ్లు ఇది అంతా అబద్ధము అని వ్రాస్తారు. ఇది మరీ అన్యాయముగా ఉన్నది. ఈ విషయంలో నేను ముఖ్యముగా మనవిచేసేది ఏమిటంటే దౌర్జన్యపరులు ఎవరైతే దౌర్జన్యమును ప్రోత్సహిస్తూ ఎవరెవరిదగ్గర కర్రలు, కత్తులు, ఈటెలు, బరిసెలు వుంటున్నారో. ఎవరు వుపయోగిస్తున్నారో అట్లా దౌర్జన్యము ఉపయోగించేవాళ్లను దండించాలి. ఏదో ఆత్మరక్షణ కోసము ఎదురుతిరిగిన వారిని వదలిపెట్టాలి. అంతేగాని ఉభయులును కలిపి కేసులు పెట్టడము అన్యాయము. ఈ విషయంలో వారు యింకా పెద్దఉద్యోగస్థులతో చెప్పి కమ్యూనిస్టు దౌర్జన్యములనుంచి అమాయకులైన రైతులను, గ్రామాల్లో పొలాలదగ్గర, చెట్లదగ్గర పుట్ల

దగ్గర తగాదాలు రాకుండా, పార్టిని పెంచుకోడానికి పార్టిని అభివృద్ధి చేసుకోడానికి చేసే దౌర్జన్యములను నివారించడానికి చర్యలను తీసకొని రక్షించాలని ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI M. KOTI REDDI :—ఉపాధ్యక్షా ! పోలీసువారు మాగుంటూరు జిల్లాలో ఏవిధమైనటువంటి రక్షణలు ప్రజలకు కల్పించడములేదని నేను చెప్పుకోవలసిన అవసరము చాలావున్నది. ఈ విషయము గురించి మంత్రిగారికికూడా ఒక పిటీషను ఇచ్చాను. దానిమీద ఏమీ విచారణ జరిపినట్లు నాకు తెలియడములేదు. 15 వ తేదీన మా మంగళగిరి ఫిర్కాలో ఎన్నికలు జరిగినవి. మరుసటిరోజున, 17 వ తేదీన, నీరుకొండ గ్రామములో కమ్యూనిస్టులు బరిశెలు కర్రలు పుచ్చుకొని గ్రామస్థుల మీదపడి 30, 40 మందిని కొట్టారు. అందులో 8 మందికి ప్రమాదకరమైన దెబ్బలు తగిలినాయి. వాళ్లను తీసుకొనివచ్చి ఆస్పత్రిలో చేర్చారు. 17 వ తేదీ రాత్రి మేము పెదకూరపాడు ఫిర్కానుంచి వచ్చేటప్పటికి ఈవార్త చెప్పుటకు మాకోసము మనుష్యులు వచ్చారు. మేము వెంటనే పరుగెత్తుకొనిపోయి వాళ్లకు ఆరాత్రే కట్టుకట్టించి, మరునాడు ఉదయము రిపోర్టులు చేయించాము. మేము వెళ్లేటప్పటికి 8 మందిని పోలీసువారు అరెస్టుచేశారు. ఆ గ్రామంనుంచి ఎవరో పరుగెత్తుకొని వెళ్ళి పోలీసులకు రిపోర్టు యిచ్చారు. చెప్పడముతోనే పోలీసువారు వాను వేసుకొని వెళ్లుతూంటే కమ్యూనిస్టు కాండిడేటు అయినటువంటి వెంకట రంగారావుయొక్క కారులో ఆ కొట్టినటువంటి ముద్దాయిలు పారిపోతూవున్నారు. అప్పుడు సర్కిలు ఇన్‌స్పెక్టరు వారిని పట్టుకొన్నారు. అరెస్టుచేశారు. కేసులు పెట్టారు. కాని ఆ కారును వూరికే వదలిపెట్టారు. రంగారావునుపిలిచి ఎందుకు నీకారు అలావచ్చింది అని అడిగారు. వాళ్ళు ఏదో సహాయము కావాలని అడిగారు యిచ్చాను. కాని వాళ్లు యిట్లా కొట్టి పారిపోతున్నారన్న సంగతి నాకుతెలియదు పొమ్మన్నాడు. ఆ రంగారావుమీద ఏవిధమైనటువంటి యాక్షను తీసుకోలేదు. ఆ పట్టుకొన్న 8 మందిమీద కేసులుపెట్టారు. అవి ఇప్పటికికూడా నడుస్తూనేవున్నవి. ఆ విషయము అలావుంచండి.

దానితరువాత 18 వ తేదీ రాత్రి గుంటూరు పట్టణములో నాకు ఎన్నికలలో పూర్తిసహాయము చేశాడు అనే ఉద్దేశ్యముతో ఇగురుపాటి గోవిందరావు అనిచెప్పబడే ఒక హోటాకు వర్తకునియొక్క గోడవున్స్ అన్నీ తగులబెట్టి సుమారు రెండు లక్షల రూపాయిలు నష్టము కలుగజేశారు. అవి నష్టను చేయడము మాత్రమేకాదు.

[Sri M. Koti Reddi 28th July 1955]

ఇంట్లోనుంచి బయటకు మనుష్యులు రాకుండా గొళ్లెము పెట్టి పెట్రోలు పోసి ఇంటికి నిప్పుఅంటించారు. బయటపరున్న డ్రైవరులేచి మంటలనుచూచి అయ్యా, అయ్యా, ఇల్లు తగులబడిపోతోంది అని కేకలువేస్తే ఆయనవచ్చి తలుపు తీయబోతే బయట గొళ్ళెముపెట్టి వున్నది. అప్పుడు ఆడ్రైవరు గోడదూకివచ్చి తలుపులుతీశాడు. ఈ విషయము పోలీసువారికి రిపోర్టుచేశాము. పోలీసువారువచ్చి ఎంక్వయిరి చేశారు. ఎంక్వయిరీలో ఇంటికి గొళ్లెములు పెట్టినట్టు కాపలావున్న జవాను చెప్పాడు, డ్రైవరుకూడా చెప్పాడు, బయటవున్న మనుష్యులుకూడా చెప్పారు. సుమారు ఒక లక్షా ఏబదివేల రూపాయిల విలువగల వారి సరకు నాశనము అయింది. మనుష్యులు మాత్రమే ఎట్లాగో ప్రాణాలు దక్కించుకొని బయట పడ్డారు. దానినిగురించి మాకు కొంచెము ఇన్ ఫర్ మేషను తెలిసింది. తరువాత పోలీసువారికి చెప్పాము. మేముచెప్పిన విషయములుగురించి వారు ఏవిధమైనటువంటి విచారణకూడా చేయలేదు. మీరే లేని పోనివన్నీ కల్పించి కమ్యూనిస్టులు చేశారని అంటారు తప్ప, కమ్యూనిస్టులకు దానికి ఏమిటి సంబంధము ఎక్కడో మంగళగిరిలో ఎన్నికలు జరగడమేమిటి, గుంటూరులో పొగాకు గోడౌన్సును తగలబడడము ఏమిటి అంటారు. ఇది తప్ప వారు న్యాయము విచారించడము వాళ్లకు చేతగాకపోయిందని నేను చెబుతున్నాను.

1 p. m.

ఎలక్షన్స్ జరుగకముందు ఒక మీటింగులో 15 వ తేదీ దాటనివ్వండి వీళ్ల సంగతి చూస్తాను, అని కమ్యూనిస్టులు public గా చెప్పారు. మరి C. I. D Department ఉన్నదోలేదో వాళ్ల reports ఏమైనవో అర్థముకావడములేదు. ఆ విధముగా చెప్పి 16 వ తేదీన సిమెంటు కంపెనీలో పనిచేసే ఒక కాంగ్రెసు worker ను కొట్టారు. తరువాత 17 వ తేదీని సీరుకొండ గ్రామంలో కమ్యూనిస్టులు కర్రలు, బరిసెలుపుచ్చుకొని గ్రామస్థులపైబడగా 8 మంది ప్రమాదకరమైన దెబ్బలకు గురియైనారు. 18 వ తేదీన గుంటూరులో ఒక పొగాకు వర్తకుడియొక్క Barrons తగులబెట్టారు. 20 వ తేదీన మంగళగిరిలో ఇద్దరు, ముగ్గురుని కొట్టారు. వీటన్నింటికి పోలీసుకు రిపోర్టుయిచ్చాము. ఏమిచేసినప్పటికీకూడా కమ్యూనిస్టులు వాళ్ల plans ప్రకారము ఫిర్కా-అంతా అలజడి చేస్తుంటే పోలీసువారు ఏమి action తీసుకోలేదు. పైగా నాకు Circle Inspector మంగళగిరిలో కనబడి ప్రొద్దుపోయిన తర్వాత తిరగబోకండి అని సలహాయిచ్చాడు. ఈ విషయములను Deputy Superintendent of Police తోకూడా చెప్పాను. Action తీసుకోలేదు. తరువాత కొన్నాళ్లకు కేసులుపెట్టినారుగాని తగిన సాక్ష్యములేదని కేసులు కొట్టివేసి

నారు. కాని అది జరిగిన రెండు, మూడు రోజులకు పొగాకుబారన్లు తగలబెట్టి, వారి ఇంటి ఆవరణలోనే గడ్డివాములుకు నిప్పుపెట్టారు. అంటే వాళ్ల ఉద్దేశ్యము ఏ విధముగానైనా మనిషి బైటకువస్తే వానిని చంపాలని. తగలపడితే తగులబడింది, లేనని మెదలకుండా ఊరుకొని చివరకు ఆ ఇల్లుఖాళీచేసి యింకొక చోటకు ఆసామి వెళ్లవలసి వచ్చినది. ఇంత పెద్ద గుంటూరు town లో అంతమంది పోలీసులుఉండగా ఇన్ని ఘోర కృత్యములు చేస్తున్నారు అంటే, పోలీసువారివల్ల మాకు రక్షణ కలుగుతుందని అనుకోడానికి అవకాశము లేకపోయింది. పైగా ఏ గ్రామానికి వెళ్లినప్పటికీ “ ఏమండి మీకు ఓట్లుయిచ్చిన ఫలితముగా మీకీగతి పడుతున్నది ఏమిటి, ఈ అన్యాయమా ” అని అడిగినప్పుడు సమాధానము చెప్పుకోలేకపోయాము. మంత్రిగారికి కూడా petitions ఇచ్చాము. అయితే దానిని ఏమిచేశారో నాకేమీ తెలియదుగాని ఇంతవరకు ఏమిచర్య తీసుకోలేదు. ఇంకొకవిషయం. నీరుకొండ గ్రామంలో గ్రామం కంటే, మాలపల్లే పెద్దది. ఆ మాలపల్లిఅంతా కమ్యూనిస్టులే. ఆ గ్రామరైతులను వారు అనేక హింసలు చేస్తున్నారు. ఇప్పటికి 2 మాసాలక్రితము నీరుకొండ గ్రామములో నాలుగైదు పొగాకు బారనులు తగులబెట్టిరి. దానివల్ల 10 లేక 15 వేల రూపాయలు నష్టము వచ్చినది. దానిని గురించి పోలీసువారు ఏమిచర్య తీసుకొనలేదు. ఈ పోలీసువారివల్ల రక్షణ ఏమీకలుగుటలేదని ప్రజలు చాలా భయపడుచున్నారు అని మాత్రం మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI C. V. SURYANARAYANA RAJU:—ఉపాధ్యక్షా ! సంజీవ రెడ్డిగారు ఈడిమాండును మనముందు పెడుతూ గ్రామాలలో ఇండ్లదోపిడీలు తగ్గినవి, పోలీసువారు చాలా బాగా పనిచేస్తున్నారు అని చెప్పారు. అయినా అది కొంత వరకు నమ్మవలసినదే. కాని మా విశాఖపట్టణజిల్లాను గురించి వారి దృష్టికి తీసుకురాక తప్పినదికాదు. విశాఖపట్టణములో Central jail, habitual offenders కొరకు కట్టిన jail ఉన్నది. ఆ జైలునుండి ప్రతివారము కొంతమందిని వదలి పెట్టినప్పుడు Waltair Railway Station కు తీసుకువచ్చి అక్కడవాళ్ళకు ticket కొని వాళ్లను రైలుఎక్కిస్తున్నారు. వాళ్లువచ్చి అనకాపల్లిలోనో యలమంచిలిలోనో నర్సీపట్టణంలోనో దిగి ఆ ప్రక్కనఉన్న గ్రామాలలో కొన్ని దొంగతనములు చేస్తున్నారు. ఆ విధముగా మొన్న జనవరిలో మా యలమంచిలిలోఉన్న Sub-Divisional Magistrate గారి ఇంటిలోఉన్న పెట్టెను పగులగొట్టి అందులో రు 1400/ లు దొంగిలించారు. అది ఇంతవరకు trace కాలేదు. పట్టుకోలేదు. తరువాత కొంతమంది తాలూకా subjail లో ఉన్నవారిని తీగెలుకోసి అందులోని దొంగలను పైకి తీసుకుపోయినారు. అది ఇప్పటివరకూ trace కాలేదు. దానినిబట్టి

గ్రామాలలో police వారివల్ల రక్షణ ఏమీలేదని చాలా భీతితో ఉన్నారు. రెండవది Fire Stations గురించి చెప్పవలసియున్నది. ప్రతీతాలూకాలోనూ Fire station పెట్టినట్లయిన గవర్నమెంటువారికి fire relief grants ఇవ్వడం తగ్గుతుంది. ప్రస్తుతము ఇండ్లు తగలబడినవారికి రు. 20/ compensation ఇస్తున్నారు. ఈ రు. 20/ లతో పూర్తిగా యిండ్లు కట్టుకొనుటకుగాని, పోయిన ఆస్తిని చేబట్టడానికిగాని వీలులేకుండా ఉన్నది. ఇకపోతే గ్రామాలలో ఏమైనా అల్లరులు జరిగినప్పుడు Sub Inspector గాని Circle Inspector గాని వచ్చి, గ్రామములలో open enquiry పెట్టడములేదు. ఎక్కడో ఒక ఇంటిలో కూర్చొని ఏదో statements వ్రాసుకొని వెళ్లుచున్నారు. Open enquiry పెట్టినట్లయిన ఎక్కువ న్యాయం ప్రజలకు జరుగునని మనవిచేయుచున్నాను.

నేను చాలమారులు Sub Inspector తోనూ Circle Inspector తోనూ open enquiry పెట్టండి అని చెప్పిననూ వారు దానికి ఒప్పుకోరు. అందుచేత కొన్ని దోపిడీలు ఇంకా కొన్ని ఎక్కువ అవుచున్నది. ఇప్పుడు jails లోని దొంగలను వదిలిపెట్టేటప్పుడు ముందు ప్రతి Police Station కు intimate చేసి వదలినచో కొంత జాగ్రత్తగా ఉంటారు అని బాగుంటుందని నేను సలహా యిస్తున్నాను.

*SRI RAJA SAGI SURYANARAYANA RAJU:—ఉపాధ్యక్షా, మన మంత్రిగారు అన్ని రాష్ట్రములలో మొత్తముమీద జరిగే crimes యొక్క statistics percentage ప్రకారము సెలవు ఇచ్చారు. అది నేను కాదని చెప్పను. కాని విశాఖపట్టణంజిల్లాలో ప్రత్యేకముగా నేను మనవిచేసేది మునుపటి కంటె crime చాలఎక్కువైనదని ప్రతివారు చెప్పడము వింటున్నాను. ప్రత్యేకముగా మా నర్సీపట్టణము తాలూకాలోను, యలమంచిలి తాలూకాలోను crime 3, 4 సం॥ల లోపల ఎంత ఎక్కువైనదో ప్రత్యేకముగా చూస్తే వారికే విశదము అవుతుందని మనవిచేస్తున్నాను.

మా నర్సీపట్టణము తాలూకా చాలా పెద్దతాలూకా. Agency ప్రాంతములో కలిసి ఉన్నది. ఎక్కడో K. D. pet లో ఒక police station, నర్సీపట్టణంలో ఒక police station ఉంటే అది మా తాలూకాను అంతా cover up చేయడములో కష్టమై crime ఎక్కువ అగుచున్నది. చాలామంది petitions పెట్టుకొన్ననూ లాభములేకపోయినది. ఈ కేసులు చాలా జరుగుటవలన అర్జీలు దాఖలుచేసిననూ ఈ పోలీసువారు ఏమీ చర్యతీసుకొనకపోవుటవల్ల చాలామంది అసలు reports యివ్వకుండా ఉంటున్నారు. పూర్వము ఊరట్లలో ఒక police

station ఉండేది. అక్కడ ఇంత వరకు జరుగుచున్న వ్యవహారము విషయమును గురించి పరిశీలించి చూస్తే యదార్థము తెలుస్తుంది. అందుచేత మీరు దయయుంచి మా ఊరట్లలో ప్రత్యేక police station ఏర్పాటు చేస్తేనే గాని నర్సీపట్టణము తాలూకాలో పరిస్థితులు ఎన్నటికి ఏ విధముగానూ శాంతియుతంగా ఉండడానికి అవకాశము లేదని మనవిచేస్తున్నాను. యలమంచలి చాలా విశాలమైన తాలూకా. వెడల్పుగాను, పొడుగుగాను ఉన్నది. నక్కపల్లినుంచి సముద్రప్రాంతమంతాకూడా ఎక్కువగా సారాబట్టీలు, దొంగతనములు, సరుకుతోటలలో కూనీలు ఎక్కువగా జరుగుచున్నవి. నక్కపల్లినుంచి రిపోర్టురావడానికి ఒక రోజు పట్టును. రిపోర్టు ఇచ్చిన తరువాత దర్యాప్తుకు వెంటనే వెళ్ళడానికి men లేదంటారు. కనుక నక్కపల్లిలోకూడా ఒక పోలీసుస్టేషన్ పెట్టినయెడల ఆ తాలూకాకుకూడా కొంత సహాయము జరుగుటకు అవకాశము కలుగుతుంది.

Fire stations విషయం తీసుకుంటే, నర్సీపట్నం, పాయకరావుపేట ప్రాంతాలలో ఎంతమందికి relief ఇచ్చారు? రాష్ట్రం మొత్తంమీద ఎక్కడా మా రాష్ట్రంలో కాలిపోయినంతగా ఇండ్లు కాలిపోయివుండవని సత్యంగా చెబుతున్నాను. ప్రతి తాలూకా headquarters కు fire stations ఇవ్వడానికి వీలులేకపోతే, నరసీపట్నం Divisional Headquarters గనుక అక్కడైనా ఒకటి ఏర్పాటుచేసి ఈ అగ్నిప్రమాదాలను తగ్గించాలని కోరుతున్నాను. పోలీసు స్టేషను విషయంలో మా Police Officers కు వ్రాసినట్లు విన్నాను. Fire stations విషయంకూడా ఆలోచించి మాకు ఈ సదుపాయం కలుగజేస్తారని నమ్ముతున్నాను. ఎలక్షన్లనుగురించి చాలా రకాలుగా చెప్పారు. నేనుకూడా కొంచెం చెప్పాలి. కొంతమంది constables పోయిన election లో కొడవళ్ళి, లం కె చూపించి భ్రమింపచేయడం జరిగిందని personal గా చాలామంది రిపోర్టుచేశారు. శాంతియుతంగా పోలీసువారు ఎలక్షన్లజరిపారంటే అది అతిశయోక్తియేనని చెబుతున్నాను. ఇది కాంగ్రెసువారి శాంతియుత ప్రబోధంవల్ల తప్ప మరొక విషయం కాదని మనవి చేస్తున్నాను.

*Sri P. RAMACHARLU:—ఉపాధ్యక్షా! లా అండు ఆర్డరు మంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు చెప్పినట్లు ప్రజలకు రక్షణ మొదట అవసరము. అది పోలీసువారిచేతనే జరుగుచున్నది. కావున పోలీసువారు మన కభివందనీయులు కాదనము. కాని కొందరు పోలీసుఉద్యోగులు చేయు అక్రమములనుమాత్రము నిరసించక తప్పదు.

Voting of Demands for grants (Contd.)

Demand No. XIV—Police

Sri P. Ramacharlu] [28th July 1955

ఇంగ్లండు మొదలగు పాశ్చాత్యదేశములలో ప్రజలు పోలీసుబంట్రోతును ఆత్మబంధువువలె స్నేహితునివలె చూచి ఆదరింతురు. కాని మనదేశములోనో పోలీసు వాడు వచ్చెననిన గాభరాతో యమదూతనువలె చూచెదరు. అనగా పోలీసువారీదేశములో ప్రజావిశ్వాసమును గడించలేదనుట. పోలీసు ఉద్యోగులలోనూ మంచి వారు లేకపోలేదు గాని ప్రభుత్వమునకు చెడ్డపేరు తెచ్చునది ఏ కొలదిమంది అక్రమప్రవర్తనులచేతనే.

శ్రీ సంజీవరెడ్డిగారు, ఇతరరాష్ట్రములలోకంటె మనరాష్ట్రపోలీసులు కేసులు పత్తాచేయుటలోనేమి క్రమప్రవర్తనలోనేమి చాల మెఱుగని సంతృప్తిని కనుపరచినారు. అది నిజమేనని అంగీకరింతును. కాని నూటికి పదిమార్కులు వచ్చిన విద్యార్థికంటె పదిహేనుమార్కులు వచ్చినవిద్యార్థి మెరుగేయైనను ఇద్దరును ఫేలే అను సంగతిని మంత్రిగారు మరువరాదు.

నూటికిన్ని నేరములు పత్తాయైనవి అని (percentage) శాతమునుబట్టిచూచిన రౌడీల దొంగతనములు మొదలగు నేరములను మన పోలీసులు తృప్తికరముగానే పత్తా చేసిరని సంజీవరెడ్డిగారు అంకెలతో నిరూపించిరి. కాదనను. కాని పోలీసువారుఇచ్చిన ఫిర్యాదులను రిజిష్టరుచేసికొనుటలోనే జాగ్రత్తవహించుచున్నారు. ఎంతో ప్రయత్నించినగాని వారొకకేసును రిజిష్టరుచేసికొనరు. రైటరు లేదని, హెడ్‌కానిస్టేబిల్ లేదని చెప్పిపుచ్చుచు విధిలేనప్పుడే వారు కేసులు రిజిష్టరు చేసుకొందురు. కొన్ని కేసులు పత్తా అయినవెనుకనే రిజిష్టరు చేసుకొందురు. కావున రిజిష్టరయిన కేసులలో పత్తా పర్సెంటేజి గొప్పగా నుండుటలో ఆశ్చర్యముండ నక్కరలేదు. కాని అందువలన కేసులు బాగా పత్తా అయినవని భావించ వీలులేదు. ఎన్నో ఖూనీలు దొంగతనములు, ఇండ్ల బీగములునంచి చేసినదోపిడీలు పత్తాకాకున్నవి. కాని అట్టివానిని పోలీసులు రికార్డుచేసుకొనియే యుండరు.

పోలీసుపరిపాలన చక్కబరచవలెననిన కానిస్టేబిల్సును రిక్రూట్‌చేయునప్పుడే గుణవంతుల నేరుకోవలెను. కులాలవారిగనో సిఫారసులు కారణముగనో మరియే ఇతరకారణములచేతనో ఒడ్డు పొడువున్నవారిని సెలెక్టుచేసెదరు. ఇందులో చాలమంది గుణములేనివారుందురు. అందుకనే పోకిరీలకు పోలీసు ఉద్యోగమను సామెత ఏర్పడినది. కాబట్టి రిక్రూటుచేసేటప్పుడే వాని ఇంటితనమును గుణమును విద్యను చూచి చేర్చుకోతగును. ఇందుకై ఒక కమిటీని ఏర్పరచినను మంచిదే.

పై అధికారుల టూర్లవలన క్రిందిపోలీసు ఉద్యోగులు చాల చిక్కుపోవుచున్నారు. వారికి సప్లయిచేయుటకొఱకు సబ్ ఇన్‌స్పెక్టరుల ఒకనెల జీతముకూడ

చాలదు. ఇట్టివి ఏడాదికొకసారిగాదు. పలుమారు సంభవించుచుండును. మంచి సబ్ ఇన్‌స్పెక్టరైతేమాత్రము ఇట్టి దూబరలను ఎన్నాళ్లు భరింతురు ? కావున వారును తమవంతున ఆ ఖర్చులు భర్తీచేసుకొనుటకు ప్రయత్నింతురు. అవినీతి ఉత్పత్తికి అదే మొదటి కారణము. కావున ఈ విషయమున సి. ఐ. డీ ల నేర్పరచి ఈ సప్లయి విధానమును ప్రభుత్వము రూపుమాపవలెను.

ప్రజలు దుర్మార్గులవలన భయభ్రాంతులు పొందకుండచేయుటయే law and Order లక్ష్యము. కాని తమకున్న బాధను ఫిర్యాదిగూడ చేసుకోవాలని స్థితి ఉన్నప్పుడు పోలీసు రక్షణ ఉన్నదని అంగీకరింపజాలము గదా !

కల్యాణదుర్గం (అనంతపురం) గ్రామములో పంచాయతీ అధ్యక్షుడును వాని అనుచరులును నూరుమంది కమ్యూనిస్టులకుపైబడి పన్నులు వసూలుచేయు నెపముతో ఇల్లిల్లు దూరి పెద్దమనుష్యులను హింసించుచుండగా మొదట పోలీసులు రక్షణయియ్య జాలకపోయిరి. తర్వాత కొందరిని అరెస్టుచేసి విడిచిరి. అక్కడ ప్రజలు మేజస్ట్రేటునకు ఫిర్యాదీచేసుకొనుటకుగూడ జంకుచున్నారు. వారికి సాక్ష్యమునొరకుట దుస్సాధ్యము. ఇట్టి పరిస్థితిదేశములో నుండుట కీడు.

కొందరు పోలీసు ఉద్యోగులకు మానసికకంపు సరిపడదు. ఎవ్వరినో ఒకరిని కొట్టకున్న వారికి నిద్రపట్టదు. తుదకు ఇంటిలో భార్యనైనను చావమోదవలసినదే. అట్టి హింసాపరులను హద్దులో నుంచవలసినదిగూడ ప్రభుత్వబాధ్యతయై యున్నది.

ప్రొహిబిషన్‌వలన పోలీసు మరింత పాడైనది. దొంగసారాయము పట్టణములలోనే పబ్లిక్‌గా అమ్మబడుచున్నది. పోలీసులకు నిత్యం జినమామూళ్లున్నవి. త్రాగుబోతులకు వారే ఫలానాచోట సారాయమున్నదని తెలియజేసెదరనిగూడ విన్నాను. ఈ విధముగా వారు లాభము సంపాదించి అక్రమప్రవర్తనమును ప్రోత్సాహించెదరు. అట్టి దుర్మార్గులను కనిపెట్టి శిక్షించినతప్ప సజ్జనులకు రక్షణయుండదు. ప్రభుత్వము ఎంత మేలుచేసినా ఇట్టి దుష్టుల అక్రమచర్యలవలన ప్రజలు ప్రభుత్వముమీద విశ్వాసమును గోల్పోవుచున్నారు. కావున ప్రభుత్వము ఈ లోపములను సవరింప గోరుచున్నాను.

SRI S. RANGANATHA MUDALIAR :— Mr. Deputy Speaker, Sir, I wish to bring to the notice of the Government for such immediate redress as they may deem fit to grant, the several hardships that have been caused to certain

Voting of Demands for grants (Contd.)

Demand No. XIV—Police

28th July 1955] [Sri S. Ranganatha Mudaliar

members of the Special Armed Police who are now in the service of this State owing to the retrenchment effected by the composite Madras Government. It is a known fact that the Special Armed Police was constituted in the year 1948 with a view to combating the communist menace. A number of young men, loyal citizens, enlisted themselves in the new force, underwent special training under the Malabar Special Police and one unit of 6 battalions was formed in the first instance. In the last quarter of 1952, the Government of Madras retrenched a number of officers and men in the Special Armed Police. Whether the then Government considered that the communist trouble was fairly eliminated or whether the retrenchment was a measure of economy, I do not know. But the fact is, a certain number of officers and men were retrenched and at the time of their discharge an assurance was given to the discharged personnel that they would be absorbed in the other forces in the same cadre in which they were at the time of retrenchment. What they meant by ' in the same cadre ' is that an Assistant Commandant in the Special Armed Police who was retrenched would be given a post similar in grade, viz., a Deputy Superintendent of Police, and a Jamadar in the Special Armed Police would be given either a Sergeant's place in the armed reserve or a Sub-Inspector's place in the district police. But unfortunately when the jamadars were taken in, they were taken only as jamadars in the armed reserve. Though ' jamadar ' is a common designation for jamadars in the Special Armed Police and jamadars in the armed reserve, the distinction is very great. Whereas the jamadar in the Special Armed Police is equal in rank to a Sergeant in the armed reserve or a Sub-Inspector in the general police, a jamadar in the armed reserve is equal in rank only to a head constable. Therefore, when jamadars from the Special Armed Police were absorbed in the armed reserve as jamadars, they were practically demoted for no fault of theirs. In G.O. No. Mis. 920, dated 19—3—1953, it was laid down that any interruption in the service in the Special Armed

Sri S. Ranganatha Mudaliar] [28th July 1955

Police caused by the discharge consequent on the disbandment of 16 companies of Special Armed Police, shall not, if he is subsequently absorbed in the district police or Malabar Special Police, entail the forfeiture of past service, and the service from the date of re-employment shall for all purposes be deemed in continuation of the service before such discharge. In pursuance of that G.O. in the Madras State, such of the jamadars that were absorbed as jamadars in the armed reserve were subsequently promoted as Sergeants and their services were considered to be in continuation of their former service in the Special Armed Police. But, in this State, similar justice has not been done. Many jamadars from the Special Armed Police are still kept on in the inferior grade of jamadars in the armed reserve and this is a great injustice. I request the Government to look into this and cause investigations to be made and redress be given to such jamadars who are still kept in the inferior rank of jamadars in the armed reserve.

One other point I wish to bring to the notice of the Government is, the accommodation given to the Sub-Inspectors is most inadequate. The Sub-Inspectors' quarters are type design buildings and those type-design buildings were conceived at the time of the Britisher. They always made a distinction between the quarters intended for Anglo-Indian and European Sergeants and quarters for Sub-Inspectors. Now, even after Independence the same type-design is continued. The poor Sub-Inspector has no place to move about. Evidently the department seems to think that only bachelors or persons who have no prospect of bringing forth children should be Sub-Inspectors. If that is the object, the present accommodation is quite all right. There is absolutely no space and they are kept, as it were, in imprisonment. There is no place for the children of Sub-Inspectors to move about. In this respect, the attention of the Government is very urgent. Their accommodation must be improved. Side by side I see the accommodation given to the Reserve Sergeants. The quarters given to them are considerably much better. I wish

Voting of Demands for grants (Contd.)

Demand No. XIV—Police

28th July 1955] [Sri S. Ranganatha Mudaliar

to commend to the Government that the present buildings must be demolished and new buildings, built after the same design of the quarters which were originally intended for Anglo Indian or British Sergeants, must be provided for the Sub-Inspectors.

Then, Sir, the Police lines are veritable cells. There is no playing ground for the children of constables ; there is no space ; there is no privacy for the women. Also people of all communities are huddled together ; in one room there will be a Brahmin ; in another room there will be a depressed classes man ; in another there will be a Muslim ; in the fourth there will be a Christian. In that way they are huddled like cattle. Women in particular have no privacy. I wish the Government do spend some money for improving the lot of these constables and their quarters.

What is most urgently necessary is a recreation building to the constabulary. They should have some recreation club. It is not sufficient for Gazetted Officers' wives or rich men's wives to have Women Societies. The poor women folk of the constables also should have some recreation and it is absolutely necessary that such recreation homes are created in each police line at every place. Also, their environment must be improved. Their children have no place to roam about and it is very pitiable. Especially in Kanchakachatram, there are not even good buildings ; they are in huts and if they are in private houses, they must have got them by paying very heavy rents.

SRI V. KURMAYYA :—ఉపాధ్యక్షా, నేను ఈ డిమాండును మనస్ఫూర్తిగా బలపరుస్తున్నాను. మంత్రిగారు చెప్పిన విషయాలలో 100 కి 99 పాళ్లు నేను ఏకీభవిస్తున్నాను. ఎందుకంటే పోలీసులంటే పుట్టుకతోనుంచికూడా వాండ్లు లంచాలతోటి జీవనము చేస్తున్నారని చెప్పే భావాన్ని కలిగినవానిని, కాని యీ 5-6 సంవత్సరములనుంచి నేను ప్రతిగ్రామము వెళ్లి close గా చూస్తే పోలీసులు ఇతర Departments కంటే లంచగొండితనము లేదేమోనని నేనిపుడు నమ్ముతున్నాను. ఎందుచేతనంటే పోలీసువారు ఎక్కడనైనా లంచాలు తీసుకున్నట్లైతే

ఏ murder case లోనో ఎక్కడో జరిగినచోట ఒక్క మనిషిదగ్గరనే తీసుకుంటారు గాని ఇతర departments లో అందరిదగ్గర లంచాలు తీసుకోవడము జరుగుతున్నది. అందులో పోలీసువారు నిజముగా స్వతంత్రము వచ్చినతర్వాత వారి మనస్సుకూడా మారింది. రామాచారిగారు చెప్పినట్లు బండ బూతులు కూయడము లేక ఎక్కువగా హింసించడము తప్ప చాల మారిపోయినారు. వారు పోట్లాటలు జరిగినచోట్లకు వెళ్లి శాంతంగా రెండు పార్టీలకు రాజీచేయడము పోట్లాటలు లేకుండా చూడడముకూడా చేస్తున్నారు. కేవలము అరెస్టు చేయడమే వాండ్ల బాధ్యతగా పెట్టుకోకుండ వున్నందులకు నేను చాల సంతోషిస్తున్నాను. ఎందుకంటే పోలీసువారి బాధ్యత చాల కఠినమైనది. పెద్దవాండ్లుకూడా చూస్తూవుంటారు. రెండు పార్టీలు గ్రామములో వున్నపుడు ఒక పార్టీపై కేసుపెట్టితే రెండవపార్టీకి ఏదో చేస్తున్నారని మూడవ పార్టీవారు ఒక్క పార్టీకి పక్షపాతము వహిస్తున్నారని చెప్పడము సహజమై పోయింది. మనదేశము caste-ridden country గా వుంది. ఇటువంటి country లో కుల తత్వము పోవడము చాల కష్టము. ఈ officers వారి కులాలకు చెందినవారికి సహాయము చేయడానికి ప్రయత్నించడము జరుగుతూనే వుంది. దీనిని ఎవరుకూడా కాదు అనలేరు. ఇప్పుడు మన కోటిరెడ్డిగారు మాట్లాడుతూ నీరుకొండ గ్రామము విషయము హెచ్చరించారు. పోలీసులు ఏమి action తీసుకోలేదని చెప్పారు. ఆ గ్రామము విషయము నాకు పూర్తిగా తెలుసు. కాని యీ మధ్య వారితోకూడా చెప్పాను. వారు శ్రీ మేకా కోటిరెడ్డి నేను తర్వాత హరిజనసేవా సంఘమువారుకూడా వెళ్లి ఆ తగాదాలను పరిష్కరించుదామని చెప్పాను. అది కమ్యూనిస్టుల తత్వాలమీద వచ్చిన తగాదా కాదు. అక్కడ 10 సంవత్సరములక్రింద ఒక murder జరిగింది. అప్పటినుంచికూడా civil rights మీద వచ్చిన తగాదాలు. అందుచేతనే మేము ముగ్గురము కలసి అక్కడవున్న officers తో మాట్లాడాలని కూడ నెలరోజులనుంచి అనుకుంటున్నాము. కాని జరుగలేదు. నీరుకొండ గ్రామములోనే కమ్యూనిస్టులుగావున్న కమ్మవారంతా కాంగ్రెస్‌వాండ్లతో కలసి పోయి హరిజనులను harass చేయడానికి వారిని కేసులలో యిరికించడానికి ప్రయత్నము చేస్తున్నారు. వాయిదాకు 30-40 మంది రావడము గుంటూరులో కండ్లారా చూశాను. కాబట్టి ఇంతమాత్రము పోలీసు డిపార్టుమెంటు న్యాయముగా వుండడము వల్ల అక్కడవాండ్ల కేసు జరుగలేదని నా భావన. మంత్రిగారు చెప్పిన విషయాలతో ఏకీభవిస్తూ ఒక్క సలహామాత్రము మంత్రిగారికి చెప్పుతున్నాను. పోలీసు డిపార్టుమెంటులో హరిజనులకు representation చాల తక్కువ. ముఖ్యంగా పోలీసు రెవెన్యూ, Judicial Department లో హరిజనులకు తగిన ప్రాతినిధ్యము లేదని

Voting of Demands for Grants (Contd.)

Demand No. XIV—Police

Sri V. Kurmayya] [28th July 1955

ఎప్పటినుంచో మేము చెప్పుకుంటూవస్తున్నాము. పోలీసు డిపార్టుమెంటులో హరి జనులకు తగిన ప్రాతినిధ్యము కల్పించి యీ రక్షణ శాఖ కేవలము కొన్ని కులాలకే కాకుండా అన్నికులాలతో కూడిన రక్షణ శాఖగా వున్నప్పుడే దేశములో law and order న్యాయంగా జరుగుతుందే గాని దాని విషయమై విచారించాలని మంత్రి గారిని ప్రార్థిస్తూనే ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

Mr. DEPUTY SPEAKER:— The House will now rise for lunch and meet again at 3-00 P. M.

AFTER LUNCH 3 p. m.

Sri S. K. V. KRISHNAVATARAM :—ఉపాధ్యక్షా! నేను ఈ demand ను బలపరుస్తున్నాను. ఈ demand చాలా ముఖ్యమైనది. ఏ దేశ పరిపాలనలోనైనా శాంతి భద్రతల నిర్వహణమీదనే ప్రజలకు ప్రభుత్వంమీద నమ్మకం ఏర్పడుతుంది ప్రభుత్వముయొక్క బాధ్యత ప్రజల ధనమాన ప్రాణముల సంరక్షణే. ఈ సంరక్షణ ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఎంతైనా యున్నది. పరాయి ప్రభుత్వంపోయి స్వరాజ్యం వచ్చినతరువాత ఈ శాఖలోని అధికారులు వెనువెంటనే మనతోనూ, ప్రభుత్వంతోనూ ఎడ్జస్టై ప్రభుత్వానికి చాలా loyal గా పనిచేస్తూనే ఉన్నారు. అదివారికి ఒక peculiar ఐన charactoristic. ఏ ప్రభుత్వం వస్తే, ఏ పార్టీ అధికారంలోకి వస్తే ఆ పార్టీతో వెంటనేవాళ్లు అడ్జస్టై పోయి నడుస్తూంటారు. చాలామటుకు, లోగడకంటెకూడా ఇప్పుడు రానురాను, మిత్రులు రామాచార్లుగారు చెప్పినట్లు ఆ డిపార్టుమెంటుమీద ప్రజలకు ఇంకా అట్టే విశ్వాసం లేదు. ఇంతవఱకూ ప్రజలలో ఇంకా ఎక్కువ confidence వారు సృష్టించుకోలేక పోతూయున్నారని చెప్పారు. ప్రజాసహకారం ఎక్కువగా వారికి లభించడం లేదు. ఇటీవల రానురాను పరిణామాలన్నీ మారుతూ ఉన్నాయి. వారి దృష్టిలోకూడా చాలమటుకు మార్పువస్తుంది. ప్రజలతో సన్నిహితంగా ఉండాలనీ, ప్రజల అభిప్రాయం మన్నించాలనివారు ప్రయత్నిస్తూనే యున్నారు. కాకినాడలో జరిగిన కొన్ని సంఘటనలను గురించి ప్రజాసోషలిస్టుపార్టీ సభ్యులు ఎవరో మాట్లాడారు. కాని కాకినాడలో జరిగిన సంఘర్షణ లన్నికూడా ఎప్పుడో Chairman గారు ఒక మీటింగు పెట్టినప్పుడు జరిగినవని వారుచెప్పారు. Chairman గారికి విశ్వాసరాహిత్య తీర్మానం అందజేసినతరువాత, మ్యునిసిపాలిటీలో అధిక సంఖ్యాకులైన Councillor ల, ప్రజా ప్రతినిధులయొక్క విశ్వాసాన్ని పోగొట్టుకున్న తరువాత, విశ్వాసరాహిత్య తీర్మానం pending లో యుండగా, ఈ విశ్వాస రాహిత్య తీర్మానం ఇచ్చినవారిని ఎలా ఐనాసరే public లో ఆయన చెప్పేకథలు ఏవో చెప్పి

28th July 1955] [SRI S. K. V. Krishnavataram

ప్రజలను వారిమీద రెచ్చగొట్టాలనే ఉద్దేశ్యంతో ఆయన అట్లాంటి సభలు పెట్టడం జరిగింది.. ఆయన Communist party లో నుంచి విడిపోయి వేరే పార్టీలో ఉండడం కూడా సంభవించింది. Communist party వారుకూడ ఇటీవల జరిగిన ఎన్నికలలో ఆయనకు పోటీ పెట్టడం జరిగింది. కాబట్టి మ్యునిసిపాలిటీలోయున్న ప్రజా ప్రతినిధుల గౌరవాన్ని, ప్రజాగౌరవాన్నికూడా ఆయన కోల్పోయారు. ఆ పరిస్థితులలో ప్రజలు ఉద్రిక్తులై యుండడంవల్ల దాన్ని అరికట్టడానికి పోలీసువారు కొన్ని arrest లు చెయ్యడం, తిరిగి వారిని bail మీద వదలి పెట్టడం జరిగింది. ఆ విషయం అంతరం పత్రికలమూలాన తెలుసుకున్నాం. దానితోపాటు వెంటనే 144 Section ఒక నెలపాటు జారీ చేశారు. Meeting లు పెట్టినట్లయితే సంఘర్షణలు వస్తాయనే ఉద్దేశ్యంతో preventive section కూడా పెట్టవలసివచ్చింది. ఇల్లాంటి పరిస్థితు లున్నప్పుడు అది అవసరమే. 144 సెక్షన్ అనగానే ప్రతిసభ నిషేధించడం అనేది కాదు. ఎవరైనా సరే ప్రత్యేకంగా ఇంకో విషయాలమీద ఏదైనా సభలుపెట్టుకోవలసి వచ్చినట్లైతే ప్రత్యేకంగా permission పొందవచ్చును. దాన్నిగురించి ఏమంత ప్రత్యేకంగా చెప్పవలసిన విషయం కాదది. ఆ విమర్శ అర్థ రహితమైనదని నేను చెబుతున్నాను. తదుపరి నా సూచన ఏమంటే ఈ preventive sections ని ఇంకా ఎక్కువగా అమలుపరచాలనీ, 107, 109, 110 Section లు ఉపయోగించడంవల్ల అనేకచోట్ల ఈ offences against person జరగడం తగ్గిపోతాయి. తరువాత 109, 110 వగైరా section లు ఉపయోగించడంవల్ల offences against property కూడా తగ్గతాయి. కాబట్టి ఈ sectionలు చాలాఅవసరం. వీటివల్ల offences against person and property చాలావరకూ తగ్గించటానికి వీలుంది. ఈమధ్య రెండు, మూడు నెలలలోపున పశ్చిమగోదావరి జిల్లాలో ఏలూరు తాలూకాలోనే రెండు మూడు murder లు జరిగాయి. అంతకుముందు కొన్ని rioting లు జరగడం ఆ parties petition లు ఇచ్చినాగాని పోలీసువారు సకాలంలో తగిన చర్య తీసుకోక పోవడంవల్ల ఆ murder లు జరగడం తటస్థించింది. అంతకంటె ఎక్కువగా ఆ విషయంలో నేను చెప్పటానికి వీలులేదు. ఎందుచేతనంటే అవి pending లో ఉన్నవి కనుక గ్రామాలలో అనేక కారణాలవల్ల కక్షలు పెరుగుతున్నాయి. ఇల్లాంటి సందర్భాలలో ఎప్పుడైనా petition లు రాగానే వెంటనే తగుచర్య తీసుకొని preventive sections క్రింద action తీసుకోవడం చాలా అవసరం. మామూలు పరిస్థితు లున్నప్పుడు preventive sections ఎక్కువగా ఉపయోగించడం అంత మంచి పని కాదు. ఎందుకంటే మామూలు నేరాలకు తక్కువ శిక్ష లున్నప్పుడు

Sri S. K. V. Krishnavataram] [28th July 1955

preventive sections క్రింద జామీను బాండుపై విడిచిపెట్టినప్పటికీ శిక్ష ఎక్కువ కాబట్టి అవిమితంగా ఉపయోగించాలని కొంతమంది అభిప్రాయపడినప్పటికీ, ప్రస్తుత పరిస్థితులలో గ్రామాలన్నీ కూడా కక్షలతో ఉన్న పరిస్థితిలో ఇవి ఉపయోగించడం చాలా ముఖ్యమని నేను చెబుతున్నాను. తరువాత మనదేశంలో, మన రాష్ట్రంలో అనండి, ఇంకా ఎక్కువ advanced scientific methods in the detection of crime ఏమీ ఉపయోగించడంలేదు. Finger prints, foot prints వీటివల్ల, ఇంకా అనేక మార్గాలవల్ల advanced technique in the detection of crime ఉపయోగించడంవల్ల detection చాలా improve చేయవచ్చు. వీటిని మన పోలీసు అధికార్లు వినియోగించడం లేదు. ఇప్పుడు కుక్కలు కూడా ఉన్నవి. Madras ప్రభుత్వం, Madras city లో వాటిని ఉపయోగించి కొంత ప్రయత్నం చేశారు. ఇటీవల ఒక case లో చాలా ఉపయోగ పడ్డాయని, కుక్కలుకూడా crime detection లో చాలా ఉపయోగపడతాయి. కాబట్టి ఈ technique బాగా develop చేయడంచాలా అవసరం. ఎంతసేపూ old rut లోనే వెళ్ళినట్లైతే దానివల్ల ఏమీ ప్రయోజనం ఉండదు. ఇప్పు డేమి జరుగు తోంది? వాడంతట వాడు, వాడి కర్మం చాలక ఏ Bus stand లోనో, ఏ Railway Station దగ్గరో ఏ దొంగతనమో జరిగితే ఎవడో ఒకడు అది కనిపెట్టి చెప్పడంవల్ల ఎక్కువగా దొంగతనాలు పట్టుబడుతున్నాయి. కాని వీళ్ళ తెలివితేటలు detection లో ఉపయోగించడంవల్ల ఎక్కువగా దొంగ తనాలు దొరకటంలేదు. ఇటీవల ఏలూరు పట్టణంలో చాలా పెద్దపెద్ద దొంగ తనాలు జరిగినప్పటికీకూడా ఇప్పటివరకూ అవి detect అవకుండా పోవడం జరిగింది. ఇప్పుడు District Officerలు అనగా ఈ D.S.P.లున్నారు. ఈవిషయం నేను చాలా రోజులనుంచి ఆలోచిస్తున్నాను. వీరు ఊరికే ఏదో పెత్తందార్లుగా పనిచేయడంతప్ప files తిరగేయడంవల్ల ఏమి ప్రయోజనం? Sub-Inspector మీద Circle Inspector, ఒక Dy. S. P., D. S. P. ఉన్నారు. ఊరికే files చదివివేయడంవల్ల ప్రయోజనం లేదు. మామూలుగా కేసులలో వట్టి supervision తప్ప, subordinates లో original thinking and imagination develop చేసి, crime అనేది ఏవిధంగా వస్తుంది, ఇది తెలుసుకొనేటట్లు చేయాలి. ఆ history of the district తెలిసి ఉండాలి. జాగ్రఫీ తెలిసియుండాలి. ఇంకా సైకాలజీ, సోషియాలజీ ఇన్నీ తెలిసియుండి ఆపరిస్థితులలో crimeని గురించి ప్రత్యేక study చేయడం ఎక్కడా కనిపించడంలేదు. చాలా time, సావకాశం ఉన్న District అధికార్లూ, D. I. G. లు, Inspector General

of Police కూడా ఇటువంటివాటిమీద ఈ literature, crime detection మీద కొంతవరకైనా పరిశోధన చేయవలసిందనిన్నీ, ప్రతివిషయంలోకూడా, మనం పరిశోధన కేంద్రాలద్వారా research ఉండాలని చెబుతున్నామే, అటువంటివి ఏర్పర్చి అనుభవజ్ఞులైనవారిని ఏర్పాటుచేసి crime, detection వీటినిగురించి అవసరమైతే scotland yard కు, మన రాష్ట్రంనుంచి కనీసం ఇద్దరినైనాసరే పంపించి వారిని scientific methods of detection and prevention లో training ఐన తరువాత ఇక్కడకు తీసుకువచ్చి ఒక Board అనండి, ఇంకేదైనా అనండి రాష్ట్రానికి ఒకదానిని ప్రత్యేకంగా ఏర్పాటుచేసి ఎప్పటికప్పుడు both Theory and Practice of crime and detection మీద సూచనలు ఇచ్చేటట్లు చేయాలి. అటువంటి Advisory Board లేనిదే ఎంతమంది అధికార్లున్నా ఏమీ ప్రయోజనంలేదు. మనకు Head of the State police, D. I. G. లు సమర్థులైనవారే ఉన్నారు. ఇక్కడ మన నంబియారుగారుకూడా ఉన్నారు.

ఆంధ్రరాష్ట్రంలో పెద్ద అధికార్లంతా చాలామంది మంచివారే ఉన్నారు. కాని వారి దృష్టిని కేంద్రీకరించడానికి ఎట్టి సావకాశం లేదు. కాబట్టి అలాంటి వొకటి పెట్టమని చెప్పతున్నాను. ఇప్పుడు Sub Inspectors గానూ, Circle Inspectors గాను పనిచేసినవారినే C. I. D. డిపార్టుమెంటులో వేస్తున్నారు. దీనివల్ల ఏమి ప్రయోజనంలేదు. వీరు అందరికి తెలిసినవారే అయినందున, ఈ డిపార్టుమెంటులో వారి కర్తవ్యాన్ని సక్రమంగా నెరవేర్చలేకుండా పోతారు. అటువంటిది మనను కర్నూలులో చూస్తూనే ఉన్నాము. కాబట్టి ఈ విధంగా ఇదివరకు Police Department లో ఉండినవారిని వేయడంవల్ల ఏమి ప్రయోజనం లేదు. కాబట్టి C. I. D డిపార్టుమెంటుకు ప్రత్యేక సిబ్బందిని recruit చేసి, వారిని ప్రత్యేకంగా training ఇచ్చి crime detection కు ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ప్రజలతో సంబంధం లేనటువంటివారిని ప్రత్యేకంగా recruit చేసి వారిని ప్రత్యేకంగా ఉంచవలెననే సూచన చేస్తున్నాను.

తరువాత ఈ Armed Police ల విషయంలో, వీరికి చాలాచోట్ల దొంగలవాలలో సంబంధం ఉండడం జరుగుతూ ఉంటుంది. నిరుడు papers లోకూడా చదివాము. గుంటూరులో వీరి ఇండ్లు వెదికితే, lorry load of stolen goods వీళ్ల దగ్గర దొరికిందని తెలిసింది. ఇటువంటి cases నెల్లూరులోకూడ చాలా ఉన్నాయి. వీటిలో పనిచేయడంవల్ల, నాకు అనుభవం ఉన్నది. Thefts లో

Sri K. V. Krishnavataram] [28th July 1955

వీరు చాలా సంబంధాలు పెట్టుకొంటున్నారు. Local గా ఉండడంవల్ల, వారికి ఒకవిధంగా బలముకూడ ఉంటుంది. సినిమాదగ్గర, ఇంకా కొన్నిచోట్ల, వాళ్లు చాలా గొడవచేయడం జరుగుతుంది. కాబట్టి వారితోకూడ ఒక ప్రత్యేక ఆఫీసరు ఉండవలసిన అవసరమున్నది.

తరువాత Prohibition కూడ పోలీసువారికే అప్పజెప్పుతామని అంటున్నారు. అప్పుడు Constables, Head Constables, Sub-Inspectors, వీరంతా crime detections మానివేసి, ఊరిచివర ఉంటూ ఎవరు సారాబుడ్డితో వస్తున్నారా అని ఈ దృష్టితోనే ఉంటారేమోనని, crime detection అనేది బొత్తుగా మరచిపోతారేమోనని భయపడుతున్నాను. ఏమైనప్పటికీ, పోలీసు అధికారులు చాలా సక్రమంగా పరిస్థితులకు adjust అవుతూ, క్రమ శిక్షణతోటి ఉంటున్నారు. ఇకముందుకూడ ఈ విధంగానే వ్యవహరిస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI D. KONDAIAH CHOWDARY:-ఉపాధ్యక్షా, నేను ఈ డిమాండును హృదయ పూర్వకముగా, సంతోషంగా బలపరుస్తున్నాను. ఇందులో నేను చెప్పదలచినటువంటి 2, 3 విషయములు, ఇంతకుముందే మనమిత్రుడు చెప్పివేశాడు. అయినా ఒకవిషయం ముఖ్యంగా మనవిచేస్తున్నాను. మన ప్రతిపక్ష సభ్యులు సాధారణంగా పోలీసువారు ఏదో చాలా దుర్మార్గము చేస్తున్నారని వారిని ప్రభుత్వము అరికట్టలేకుండా వున్నారని ఈ విధంగా ఒక వైపు చెబుతూ, మరొకవైపు పోలీసువారికి జీతాలు చాలవని, వారికి తగిన సౌకర్యాలు లేవని, ప్రభుత్వము వారికి సౌకర్యాలు ఎక్కువ చేయవలసిందని చెప్పుతూ ఉంటారు. ఈ విధంగా రెండువిధాల చెప్పడమనేది నాకేమి అర్థంకావడం లేదు. నిజంగా పోలీసువారు ఏవిధంగా కష్టపడుతున్నది మనం అందరం చూస్తూనే వున్నాము. వారికిచ్చే allowances విషయంలోగాని, జీతాలు విషయంలోకాని, అన్నివిషయాలలోను చాలా బాధపడుతూ తమ కార్యక్రమాన్ని సక్రమంగా చేస్తున్నారనే సంగతి గమనిస్తే కమ్యూనిస్టులుకూడ వారికూడ sympathy అయినా చూపించక తప్పదని మనవిచేస్తున్నాను. వారికిచ్చే 12 అణాలు allowance లో వారు ఏవిధంగానో తమ దినబత్యాన్ని గడుపుకొని ఊరూరు తిరుగుతూ చాలా కష్టపడుతూన్నారు. ఈ సందర్భంలో, వారు లంచాలు తీసుకొంటున్నారని చెప్పడం చాలాపరిపాటి అయిపోయింది. ఇప్పుడు ఏ departmentలో తక్కువ corruption ఉన్నది అన్నట్లయితే, అది Police Department లోనే

అని అనకతప్పదు. ఎక్కువ corruption P. W. D. డిపార్టుమెంటులోను అన్నిటికంటె తక్కువ corruption పోలీసు డిపార్టుమెంటులోను జరుగుతున్న దనే విషయం ప్రభుత్వంవారు గమనించవలసి యున్నది. ఎప్పటికైనా గాని, ఒక దేశముయొక్క శాంతిభద్రతలు చేకూరాలంటే, పోలీసువారు తృప్తిగా ఉండ వలెను. ఇది మన ప్రభుత్వంవారు గమనించి, వారికి సరియైన జీతాలు, allowances ఇచ్చి, వారికి ఇళ్లవసతులు తదితర సౌకర్యాలు కలుగజేయవలెనని మీ ద్వారా ప్రభుత్వంవారికి మనవిచేస్తున్నాను.

తరువాత ఈ Police Department లో, promotions విషయంలోగూడ lower ranks కు చాలా అన్యాయం జరుగుతున్నదని మనవి చేస్తున్నాను. పూర్వము, కొన్ని crimes detect చేసి వాటిలో విజయవంతులు గనుక అయితే, వారికి కొన్ని rewards ఇస్తూ ఉండేవారు. ఆ rewards ను బట్టి, promotions ఇస్తూఉండడం జరిగేది. అందువల్ల ప్రతిపోలీసువాడుకూడ తాను కొన్ని rewards సంపాదిస్తే promotion వస్తుందనే ఆశతోటి, లంచాలు తీసుకోవడం మానివేసి నేరాలు పట్టుకొని సక్రమంగా విజయవంతంగా వాటిని కోర్టులో నడుపుకొంటూ ఉండేవాడు. ఆవిధంగా తనకు గౌరవం వస్తుందని, promotion వస్తుందని, తన భవిష్యత్తు ఉజ్వలంగా ఉండగలదనే ఉద్దేశంతో ఉండేవాడు. కాని ఈరోజు ఆ rewards చూచినపాపాన పోవడంలేదు. ఈనాడు కేవలం ఇతర కారణాలచేత, promotions వస్తున్నాయే గాని, rewards ద్వారా రావడంలేదు. కనుక, promotions ఇచ్చేటప్పుడు అది rewards ద్వారా ఇచ్చేటట్లు చేయవలెనని ఈ విధానాన్ని కఠినంగా అమలు జరుపవలెనని తమద్వారా మంత్రివర్గానికి మనవిచేస్తున్నాను.

ఇప్పుడు, క్రిష్ణావతారంగారు 1, 2 cut motions security proceedings గురించి ఇచ్చిఉన్నారు. నిజంగా security proceedings విషయంలో బుద్ధిమంతులకు ఎప్పటికీకూడ బాధలేదని చెప్పుచున్నాను. సహజీవన శాంతియుత సిద్ధాంతాన్ని రేడియోలో ఉపన్యాసము ద్వారాను, platforms మీద ఉపన్యాసాల ద్వారాను చెప్పుకొంటూ సక్రమంగా, న్యాయంగా నిత్యజీవితములో అమలుజరిపే టటువంటి పరిస్థితులలో ఏ పౌరునికికూడ ఈ security proceedings తో బాధలేదని మనవిచేస్తున్నాను. సాధారణంగా తన నిత్యజీవితంలో తనయొక్క లక్ష్యాలను, ఆశయాలను దౌర్జన్యంతోనే సాధించాలి అనుకునేవాళ్లకు తప్ప, శాంతియుతంగా తన యొక్క లక్ష్యాలను సాధించుకోవాలనేటటువంటి ఏ పౌరునికి గూడ ఈ security

SRI D. Kondaiah Chowdary] [28th July 1955

sections వల్ల బాధలేదని, నా lawyer అనుభవాన్ని పురస్కరించుకొని చెప్పుచున్నాను. Preventive sections లో ఒక Security section జారీచేసేటటువంటి procedure అంతా సంపూర్ణంగా ఎవరైనా గనుక గమనించినట్లైయితే, దాంట్లో యేమాత్రం ప్రమాదంలేదని తెలుసుకోవచ్చు. ఏదైనా over-tax వేయాలంటే, వారి ద్వారా సాక్షిరావాలి. ఆ సాక్షితో కేసుపెడతారు. తరువాత charge sheet ఇస్తారు. దీనిని పోలీసు రుజువుచేయవలసి యుంటుంది. అదికాదని రుజువుచేయడానికి ముద్దాయికిగాని, respondentకు గానిఅధికారం వున్నది. ఇదంతా జరిగిన తరువాత ఒక న్యాయాధిపతి శాంతి భద్రతలకు భంగం కలుగకుండా ప్రవర్తించవలసిందని 1, 2 మాసాలు శిక్ష విధిస్తాడు. దానివల్ల ప్రమాదంలేదు. దౌర్జన్యంపైన నమ్మకం లేనటువంటి, న్యాయంగా, ధర్మంగా, చట్టబద్ధంగా తన జీవితాన్ని గడుపుకొనేటటువంటివారికి ఏలాటి బాధ ఉన్నదో నాకు అర్థంకాదు. ఇందులో కేవలం వాదానికి వాదం ఇవ్వడం తప్ప ఇంకేమి ప్రయోజనం లేదని మనవిచేస్తున్నాను.

పోతే, పోలీసువారికి ఉన్న ఇళ్లు చూస్తే, lower grade menial staff కు కూడా అంత అధ్వాన్నముగావుండే ఇళ్లు యిస్తారు. ఈ సంగతి ఇదివరకే చెప్పాను. మంత్రిగారు ఒక పర్యాయము పోలీసు లైన్సువైపుకు వెళ్లి చూచినట్లయితే వాటి పరిస్థితి అంతా బోధపడుతుంది. అందులో వున్నవి ఒకొక్కరికి ఒక వంటగది, మరొక రెండు గదులు మాత్రము వున్నవి. ఒక పోలీసుకు 7, 8 మంది పిల్లలు వుంటే, అతడు యీ చిన్నసైజు quarters లో ఏవిధంగా కాపురముచేయ గలడో గుర్తించాలి. సాధారణంగా ఒక కుటుంబానికి ఎలాంటి గృహావసతి వుండాలనేది గమనించాల్సి వుంటుంది. ఈ విషయములో మాత్రం తక్షణం వారికుటుంబాలకు తగినట్లుగా ప్రభుత్వము గృహావసతి ఏర్పాటుచేయాలి. పోలీసువారికి యీ రోజులలో duties ఎక్కువైపోయినవి. అందువల్ల సమన్సు సర్వుచేయుటయములో చాలా విలంబన కూడా జరుగుతున్నది. దానివల్ల కోర్టులలో చాలామటుకు కేసులు వాయిదాపడు చున్నవి. కోర్టులలో పోలీసువారు పెట్టిన కేసులకు సమనులు త్వరత్వరగా జారీ కానందువల్ల ఖైదీలుగాని, సాక్షులుగాని గుర్తుకు రావడములేదు. అందువల్ల చాలా కేసులు వాయిదాలుపడుచున్నవి. దీనివల్ల పార్టీలకుకూడా చాలా ఇబ్బందులు కలుగు చున్నవి. ఈవిధంగా ఆలస్యము కావడము పోలీసువారి దోషమువల్లననండి, లేక మరి యితర కారణాలవల్లననండి, కేసులుమాత్రం వాయిదాలు పడుచున్నవి. ఈ విషయములో ప్రభుత్వమువారు వెంటనే జోక్యము కలుగజేసుకొని, యీ ఆలస్యములకు కారణము ఏమిటో విచారించి అటువంటిది జరగకుండా తగు చర్య తీసుకోవాలని

ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అవసరమైతే అదనముగా సిబ్బందిని వేయడముకూడా మంచిదే. అదనపు సిబ్బందిని వేసినప్పటికినీ, సమనులు జారీచేసే పద్ధతిలో మార్పు రావాలని అంటున్నాను. పార్టీలకు యిబ్బందేకాకుండా అనవసరంగా రాను, పోను, యీ వాయిదాలకోసం తిరగడమువల్ల చాలా దుబారా ఖర్చులు అవుతున్నవి. త్వర త్వరగా పనులు జరిగితే కోర్టులలో న్యాయము కూడా జరగటానికి వీలుంటుంది. సామెత చెప్పినట్లు "Justice delayed is Justice denied" అనేది దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వము తగు చర్య తీసుకోవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను. ఆలస్యమువల్ల ఫలము శూన్యము అయిపోతున్నది. సరియైన ఫలితము రావాలంటే, service of summons సరియైన పద్ధతిలో చేయవలసి యున్నది. అయితే పోలీసులకు ఇబ్బందులు కూడా వుంటాయి; లేవని నేను చెప్పడములేదు. చేరువగ్రామాలలో crimes జరిగినప్పుడు, వెంటనేపోయి విచారించుకొని రావటానికి పోలీసులకు రవాణా సౌకర్యాలువుంటావి. అట్లాంటివి వుంటేనే అక్కడికిపోయి వెంటనే తిరిగి రావటానికి వీలుంటుంది. కాని మారుమూల గ్రామాలలో crimes జరిగినప్పుడు, అక్కడికి తక్షణమే పోలీసువారు పోవటానికి రవాణా సౌకర్యాలు యిప్పుడులేవు. అక్కడ విచారణచేసి, అక్కడ నుంచి మరొక గ్రామానికిపోయి, టైములోగా తిరిగి హెడ్‌క్వార్టర్సుకు రావాలంటే, రవాణా సౌకర్యము దొరకకపోవచ్చు. అందువల్ల కొంత delay కు కూడా కారణము కావచ్చు. ఈ విధంగా యిబ్బందులుంటే, పోలీసు investigation సక్రమంగా జరగదు. ఎప్పుడుపడితే అప్పుడు బండ్లుగాని, బస్సులుగాని వుండడము అసంభవము. గనుక P. W. D. వారివద్ద ఎన్నో జీపులు వృధాగా పనిలేకుండా పడివుంటున్నవి. డిప్యూటీ సూపరింటెండెంటుకు అవసరమే వుండదు. బహుశ ఆయనకు కారువుంటేవుండవచ్చు. Investigation కు వెంటనే పోవలసిన Circle Inspector, Sub-Inspector కాబట్టి, ప్రతి Circle Inspector కు ఒక జీపుసప్లయిచేస్తే దాన్ని Sub-Inspector కూడా వుపయోగించవచ్చును. జీపులు సప్లయిచేస్తే, investigation త్వరలో పూర్తి చేసుకోవచ్చు. నేరస్థులను వెదకటానికిగాని, హెడ్‌క్వార్టర్సుకు తీసుకొనిరావటానికిగాని, యింకా crime detection కు చాలా వుపయోగముగాను వుంటుంది. ముఖ్యంగా మారుమూల గ్రామాలు చార్జిలో వున్నటువంటి ప్రతి Circle Inspector కు జీపును సప్లయి చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఇక పోలీసులకు క్రమశిక్షణచూస్తే చాలా pitiable గా వున్నది. నేను కూడా U. T. C. లో వున్నవాణ్ణి. పోలీసులకు ముఖ్యమైనవి discipline and

Sri D. Kondiah Chowdary] [28th July 1955

drill. ఇవి రెండూ లేకపోతే పోలీసు అనిపించుకోటానికి అర్హతలేదనే నా అభిప్రాయము. ఈనాటి పరిస్థితులు పూర్వకాలముకంటే చాలా భాగాము లోయర్ గ్రేడులోకి దిగజారినవి. ఎందువల్లనంటె, పూర్వకాలములో ఆజాను బాహులను select చేయడం, దినమూకూడా పోలీసులకు డ్రిల్లు వుండేవి. ఈనాడు ఎటువంటివాడైనాసరే, good physique వున్నా లేకపోయినా select చేయబడుతున్నాడు. చాలా బలహీనముగా వున్న వాడుకూడా పోలీసే. ఖైదీని పట్టుకోటానికి తగిన సామర్థ్యము కలవాడుగా వుండాలి గదా! మనిషిచూస్తే బలహీనముగా వుండడము డ్రిల్లుమాద్దాను అంటే, అది అంతకంటేవుండదు. కాని ఎప్పుడో పోలీసు అధికార్లు వచ్చినరోజున మాత్రం డ్రిల్లు చెబుతారు. తరువాత మరల అధికార్లువచ్చేదాకా అతనికి డ్రిల్లు అనేది వుండదు. ఎప్పుడో ఒకరోజున డ్రిల్లు చేయబోతే, అతనికి అంతా కొత్తగా నేవుంటుంది. కాబట్టి పోలీసులకు యీ పద్ధతి తీసివేసి ప్రతిదినము డ్రిల్లు చేయించేటట్టు చేయాలిఅని యిది పోలీసు డిపార్టుమెంటుకు చాలా ముఖ్యమని గుర్తించాలని, ప్రభుత్వమువారు పోలీసు అధికార్లను హెచ్చరికచేస్తారని, యిందుకు తగినచర్య మంత్రిగారు తీసుకుంటారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

3-30 p.m.

SRI V. VISWESWARA RAO :—ఉపాధ్యక్షా, ఉపముఖ్యమంత్రి గారు పోలీసు డిమాండును ప్రతిపాదిస్తూ కొన్ని విషయాలు చెప్పారు. ఈ పోలీసు పద్దు సామాన్యంగా చాలా పెద్దపద్దు. దీనిపైన return మాత్రము వచ్చేది యేమీ వుండదు. అంతాఖర్చే. దేశములో శాంతి భద్రతలు కాపాడటానికి మాత్రం యిచ్చిన పద్దేగాని, Irrigation పద్దుమాదిరి return వచ్చేపద్దు యేమీకాదు. Irrigation పద్దుమీద 6% లేక 5% return వుంటుందని అని లెక్క వేయడం సాధారణముగా జరుగుతూవుంటుంది కాని యీపద్దుమీద అటువంటి అంకెలు వేయటానికి వీలులేదు. ఈ డిమాండు దేశములో శాంతిభద్రతలు కాపాడటానికి మాత్రంవేసిన పద్దేనని మంత్రిగారే చెప్పారు. అసలు బడ్జెటులోని అన్ని పద్దులుకలిపి, లెక్కచూస్తే యీ పద్దు పదవ వంతువరకు అవుతుందని నా అభిప్రాయము. ఒకవైపున లోటుబడ్జెటు అనిచెబుతూ, 866 లక్షలు యీ పద్దుక్రింద వినియోగిస్తున్నామని అంటె, మొత్తము బడ్జెటులో పదోవంతు వరకు ఖర్చు చేయడము చాలా ఆశ్చర్యముగావున్నది. పరిస్థితులు చూడగా పూర్వంకంటె యీనాడు ఏమైనా ప్రత్యేకపరిస్థితులు, అత్యవసర పరిస్థితులు వున్నవా? ఇంతపెద్ద పద్దు యీ డిమాండుక్రింద [illegible]

యేదైనావున్నదా అంటే, అదేమి నాకు కనబడటములేదు. చాలా విషయాలలో దేశము యిదివరకటి కన్నా బాగావున్నదని మంత్రిగారు చెప్పారు. నేను యీ నాడు మన Legislature లైబ్రరీలో కూర్చొని చూచాను. 1950-వ సంవత్సరపు మద్రాసు ప్రభుత్వపు బడ్జటు అంచనా రు. 6.29 లక్షలువుంటే, మన బడ్జటు దానితో పోల్చిచూస్తే, మనకువున్న యీ నాటి పరిస్థితులనుబట్టి చూస్తే, యిది చాలా ఎక్కువ బడ్జటు అని అభిప్రాయపడుతున్నాను. ఒక ప్రక్కన మనము Planning అని అనేక విషయాలలో దేశమును ముందుకు తీసుకొని పోవాలని అనుకుంటున్నాము. మొదటి పంచవర్ష ప్రణాళికలో నాలుగు సంవత్సరాలు అప్పుడే గడచి పోయినవి. ఇప్పుడు మనము ఎంతవరకు ముందుకువెళ్ళాము అని చూస్తే, చాలా తక్కువే అని చెప్పాలి. ఇక ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రావటానికి ఎదురు చూస్తున్నాము. అప్పుడే గ్రామసంఘాల ఏర్పాట్లు తయారు అవుతున్నది. తాలూకా సంఘాలు చర్చిస్తూన్నవి. మనము యిక్కడ దాన్నిగురించి రేపో మరునాడో చర్చించపోతున్నాము. ఈ విధంగా ప్రంచవర్ష ప్రణాళిక తయారవుతున్నది. గ్రామాలలో హాస్పటల్ సౌకర్యాలు యే మాత్రం లేవు. మందుల సౌకర్యాలు అంతకన్నా లేవు. మంచినీటి సౌకర్యాలు అసలే లేవు. వీటి కంతటికినీ డబ్బు కావాలి. కాని వచ్చేది లోటు బడ్జటు అని అంటున్నాము. విద్యావిధానము తక్కువగా వున్నదని అంటే, లోటు బడ్జటు అని ప్రభుత్వమువారు అంటున్నారు. నిజమే. లోటు బడ్జటుగానే కనబడుతున్నది. కాని పోలీసుపద్దు క్రింద మొత్తము బడ్జటులో పదియవ వంతు మనము వుపయోగించదలచితే, లోటు బడ్జటు కాక surplus budget ఎక్కడి నుంచి వస్తుంది? మంత్రిగారు చెప్పినట్లు యీ నాటి పరిస్థితులనుబట్టి మనకు సరియైన వాతావరణము కాదని మనము అభిప్రాయపడుతున్నాము.

(At this stage Mr. Speaker resumed the Chair.)

ఈ విషయములో శాసన సభ్యులు కొంతమంది ఏకీభవించకపోవచ్చు. కాని మంత్రిగారు ఆ విధంగా అభిప్రాయపడివున్నారు కాబట్టి, యీ పద్దులో కనీసము అయిదవవంతు అయినా తగ్గిస్తే యిందులోనుంచి సుమారు 50 లక్షలు రాబట్టుకో గలుగుతాము. బడ్జటులోటు కొంతవరకు తగ్గిపోతుంది. ఈ నాడు లోటు బడ్జటు అనే వుద్దేశ్యముతో ప్రజలమీద అదనంగా పన్నులు వేయటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది. దీన్ని వ్యతిరేకించడము మా పార్టీ యే కాక, కాంగ్రెసు పార్టీ కూడా వ్యతిరేకిస్తున్నది. నిన్న మొన్న కాంగ్రెసుపక్షు నాయకులతో చాలామంది పార్టీని సమావేశపరచి యీ విషయము చర్చించవలసిందిగా requisition యిచ్చినట్లు తెలుస్తున్నది. ప్రజలందరు ఆందోళన చేస్తున్నారు. ఇట్టి పరిస్థితులలో అదనపు పన్నులు

Sri V. Visweswara Rao] [28th July 1955

వేసేదానికన్న యీ బడ్జెటును మరొక విధంగా సరిపెట్టుకోటానికే ప్రయత్నించినా లంటాను. Prohibition కూడా ఒకటి వున్నది. ఇదికాకుండా Prohibition క్రింద రు. 85 లక్షలు ఖర్చుపెట్టడం జరుగుచున్నది. ఇదికూడా తగ్గించితే, అంతా కలిపి సుమారు ఒక కోటి రూపాయలు అవుతుంది. అప్పుడు యీ లోటును కొంచెము తేలికగా సరిపెట్టుకోటానికి వీలు వుంటుంది. ఆ విధంగా చేయకపోవడము మంచిది కాదని నా అభిప్రాయము.

అయితే యింకొక విషయము వున్నది. ఈ బడ్జెటులోని details చూచి నప్పుడు, యిందులో చాలా అంచెలు వున్నవి. ఒక విషయము గుర్తించండి. జిల్లాలలో District Superintendent of Police, Assistant Superintendent of Police, Deputy Superintendent of Police, Circle Inspector, Sub-Inspector, Head Constable, Constable-ఇన్ని విధాలుగా అంచెలు అంచెలుగా వుంటున్నారు. ఇంతమంది ఎందుకు ? Work పెరగడము, ఆలశ్యము కావడము, red-tapism తప్ప మరేమి కనబడదు. ఇప్పటికే ఎక్కడచూచినా red-tapism ఎక్కువగా ప్రబలిపోయింది. దీన్ని అరికట్టాలి. అనేక సందర్భాలలో Sub-Inspector తన చేతులలోనున్న ఖైదీలను భూస్వాములకు అప్పచెప్పి, వాళ్లు తానుకొట్టి ఆ ఖైదీని చిత్రహింసచేసిన పరిస్థితులు వున్నవి. భూస్వాములకు అప్పచెప్పి, చిత్రహింస చేయించడమే కాకుండా, అయిదు రోజులదాకా, లాకప్‌లో వుంచి, మేజస్ట్రేటు ఎదుట హాజరుపరచకుండా, ఆ ఖైదీని బాధపెట్టిన సందర్భాలు కూడా వున్నవి. చివరకు ఆ ఖైదీ చాలా ప్రమాద పరిస్థితులలో పడినప్పుడు, I.G. of Police కు పిటిషనుపెట్టితే, వెంటనే విచారణచేయమని కోరితే రెండునెలలుదాకా దానిసంగతే ఎత్తుకున్నట్లు కనబడలేదు. ఏమి చేసిందికూడా. I.G. of Police నుంచి జవాబు రాలేదు. రెండునెలలు అయినతరువాత ఆ పిటిషను I. G. of Police నుంచి, అంచెలంచెముగా ఉన్న వారందరినీ చూచి, చివరకు చిత్రహింస, బాధలుపెట్టిన Circle-Inspector, Sub-Inspector దగ్గరకే తిరిగి వచ్చింది. అప్పుడు ఆ Inspectors సరియైన రిపోర్టు పంపుతారనేనా, I. G. of Police గారివద్దకు ఆ పిటిషను పంపించాడు ? కాబట్టి యిది సరియైనపద్ధతి కాదని చెప్పకతప్పదు. ఇక్కడనే యీ red-tapism మన ఎదుటనే వున్నదని అంటున్నాను. ఇందులో ప్రధానంగా ఎవరు బాధించింది అనేది విచారించవలసిన అవసరము వున్నది. ఈ నాడు యీ డిపార్టుమెంటులలో Gazetted Officers ఎక్కువగాను, విపరీతంగాను పెరిగిపోయినారు. వారు పెరిగిన కొద్ది, ఫలితము శూన్యము. Red-tapism, concoction మాత్రము యెక్కువగా పెరిగింది. దానికి తోడు పనిలో

28th July 1955] [Sri V. Visweswara Rao

చురుకుతనం బొత్తిగా కనబడదు. ఈ చురుకుతనమును revive చేయాలని నా అభిప్రాయము. ఈ నాడు అనేకవిధాలుగా crime ఎక్కువగా జరుగుచున్నదని చెబుతున్నాను. Investigation వెంటనే చేయరు. అందువల్ల కేసుయొక్క బలముపోయినట్లే గదా! దేశములో ఎక్కడ చూచినా దొంగతనాలు, ఖూనీలు ఎక్కువయినవనే చెప్పాలి. సరియైన investigation చేస్తే, crime cases యిన్ని వుండవని నాకు నమ్మకము. ఒక గ్రామంలో దొంగతనము జరిగింది. ఆ విషయము పోలీసులకు రిపోర్టు చేశారు. వెంటనే Circle Inspector, Sub-Inspector యిద్దరూ వెళ్లి, అసలు నిజంగా దొంగతనముచేసిన వాడిని విచారణచేసి పట్టుకోకుండా, మరొక ఏ కూలినో అక్కడ భూస్వాములు చెప్పిన వ్యక్తిని తీసుకొని వచ్చి, కొట్టడము, తరువాత ఆ భూస్వాములకు అప్పజెప్పి కొట్టించడము జరిగింది. దానిమీద పై అధికార్లకు పిటీషను పెట్టడము జరిగితే రిపోర్టుచేసిన వెంటనే వచ్చి విచారణ చేయలేదు సరి కదా యింకా ఎవరికో అన్యాయము జరిగిందనే బాధ. సోదర సభ్యుడు రామాచార్యులుగారు చెప్పినట్లు, యీ పోలీసులకు "కొట్టే mania" తప్ప వేరే ఏమీ వుండదని అన్నారు. ఉదాహరణకు ఒక గ్రామములో ఒక కేసు జరిగినప్పుడు పోలీసులు సరిగా విచారణచేయకుండా, ఎవరినో తీసుకొనివచ్చి కొట్టడము, అతని భార్యనుకూడా తీసుకొనివచ్చి కొట్టడము జరిగిందని తెలిసింది. ఇటువంటివి జరుగుతున్నవా అని కొంతమంది ప్రశ్నలు వేస్తున్నారు. నిజంగా జరిగినదే, నేను మనవిచేస్తున్నాను. ఒకచోట ఒక కేసు జరగడం, ఏదో విచారణ చేయడం, చివరకు ఆ Sub-Inspector తన వుద్యోగము పోగొట్టుకోవడంకూడా జరిగింది.

పోలీసు స్టేషనులకు మనము వెళ్లి చూస్తే కర్టసీబోర్డులు అనేవి మనకు కనపడుతూ వుంటాయి. అవన్నీకూడా కర్టసీబోర్డులే. ప్రజలకు సేవ చేయాలని మాత్రము బోర్డులు వుంటాయి. కాని సామాన్య ప్రజలకు పోలీసు స్టేషనుకు వెళ్ళాలంటే విపరీతమైన భయముగా వుంటుంది. సామాన్య ప్రజలు స్టేషనులకు వెళ్ళితే వారిని అతిహీనంగా చూస్తారు. వారిని అదే పనిగా బూతులు తిట్టుతారు. వారినోటి వెంట అవి తప్పితే సరియైన మాట ఒక్కటికూడా రాదు. నేను ఆంధ్రదేశంలో బాగా అభివృద్ధిచెందిన ప్రాంతంనుంచి వచ్చినవాడిని కాబట్టి నా అనుభవములో చెబుతున్నాను. తెల్లనిబట్టలు వేసుకొన్న వాళ్లు వస్తేను, లేకపోతే కోర్టువేసుకొని వచ్చిన వారితోనూ స్టేషనులో ఇన్‌స్పెక్టర్లు గౌరవముతో మాట్లాడుతారు గాని, సామాన్య ప్రజలు మాట్లాడితే అతి నీచముగా చూచి బూతులతో మాట్లాడుతారు. కొన్ని

Voting of Demands for Grants (Contd.)

Demand No. XIV—Police

Sri V. Visweswara Rao] [28th July 1955

కొన్ని సందర్భాల్లో అవి వినడానికికూడా చాలా అసహ్యంగా వుంటాయి. అవి వినలేక మేము కూడా బయటకువచ్చిన ఘట్టాలు వున్నాయి. గొల్లపల్లి వూరు తగులబడి పోయింది. మనుష్యులుకూడా చనిపోయారు. దాని కోసం పోలీసులు పోస్టు మార్టమునకు వచ్చారు. వూరు అంతా తగులబడిపోయిందని వారంతా విచారపడు తుంటే పోస్టుమార్టమునకు వచ్చినప్పుడు తాను పోలీసుస్టేషనుకు తిరిగి పోవాలని సబిన్‌స్పెక్టరు బూతులు తిడుతూవుంటే నేనుకూడా అసహ్యించుకొన్నాను. అక్కడ ఫైర్ సర్వీసువాళ్లుకూడా అసహ్యించుకునే పరిస్థితులు వచ్చాయి. ఇది అంతా అంత సరియైనది కాదు. పోలీసులయొక్క ప్రవర్తన పై ఉద్యోగుల ప్రసక్తిన ఏ రూపంలో వుందో కర్తనీకి కావలసిన విలువలేకుండా ఎలా వున్నదో మనము గ్రహించగలుగు తాము. దీనినిబట్టిచూస్తే సామ్రాజ్యవాదులైన ఇంగ్లీషువారు మనదేశములోనుంచి పోయారు. కాని వాళ్లు ప్రవేశపెట్టిన కూడా, వాళ్లు మనదేశంలో స్థాపించినటువంటి విధానములుమాత్రము పోలేదు. ఈ నాడు మనకుఉన్న స్వేచ్ఛా వాతావరణములో ఎన్నికలు జరిగాయి. మనము వాటి గురించి అనేక రూపములలో అనేక పత్రికలలో పొగడుకొనడము కూడా జరిగింది. అయితే ఒక ఉదాహరణ చెబు తాను. 3, 4 రోజుల క్రితము విశాలాంధ్ర పత్రికలో ఒక కేసు విషయము వచ్చింది. ఎవరో వి. హనుమంతురావు అనే ఆయన కమ్యూనిస్టు ఎన్నికల ఫండు క్రింద కొంత ధనము ఇచ్చాడట. హనుమంతురావు అనే ఆయన పెనుమండ్ర హైస్కూలులో ఒక ఉపాధ్యాయుడున్నాడు. వాళ్లు నువ్వు కమ్యూనిస్టు పార్టీకి కొంత పండు ఎందుకు ఇచ్చావని ఆయనను నానాబాధలు, నానాతిప్పలు పెడుతున్నారు. సి. ఐ. డి. లు అధికారములోవున్న పార్టీలకు వ్యతిరేకంగా ఉన్న పార్టీలను అణచివేయడానికి అధికారము వినియోగించడము సరియైనదేనా ? ఇది సరియైనపద్ధతికాదు. ఆ రూపంలో మనము దానినే చూడకూడదు. ఎన్ని కలు స్వేచ్ఛా వాతావరణములో జరిగినాయని మనము అందరము చెప్పుకుంటున్నాము. ప్రజలందరు స్వతంత్రము వుందని చెప్పుకుంటున్నారు. వారియిష్టము వచ్చినవారికి ఓటు యివ్వవచ్చునని చెప్పుకుంటున్నాము. హనుమంతరావులు అనేకమంది వుండ వచ్చును. ఎవరినో ఒకవ్యక్తిని పట్టుకుని ఇది నువ్వేచేశావు అని అనడము సరికాదు. అదేవిధంగా జరుగుతున్న కొన్నిఘటనలు చెప్పవలసి వున్నది. మంత్రిగారుకూడా సెలవిస్తూ ఏదైనాసరే చెప్పితే వాములు తగులబెట్టారు, అవి తగులబెట్టారు ఇవి తగులబెట్టారుఅని చెప్పారు. వారికి నేను సవినయంగా మీద్వారా మనవిచేసేది ఏమిటి అంటే దివి తాలూకాలో రెండు నెలలో ఏడుకూనీలు జరిగినవి. వాటిలో ఒక్క కూని విషయములోకూడా ప్రభుత్వము ఆచూకీగాని, చర్యగాని తీసుకొని దానికి కారకులైన వారు ఎవరు, ఎందుకు ఇది జరగవలసి వచ్చింది అని విచారించిన పాపాన పోలేదు.

లా అందు ఆర్డరు విషయములో మనము జాగ్రత్తతీసుకోవలసిన అవసరము లేదా అని ఆలోచనతో కేసులు పెట్టారా అంటే ఇంతవరకు అవన్నిటికీ కూడా ఆచూకి తీసుకోవడమే జరగనప్పుడు ఇక కేసులప్రసక్తే లేదు.

SRI D. KONDAYYA CHOWDARY:—మన విశ్వేశ్వరరావుగారు కమ్యూనిస్టు పార్టీకి విరాళాలు యిచ్చినంత మాత్రాన ఉద్యోగస్థులను అరెస్టు చేస్తున్నారని చెబుతున్నారు. కాని నేను చెబుతున్నది ఏమిటంటే, సంజీవరెడ్డిగారి ప్రభుత్వములో నాతో పోటీచేసిన కమ్యూనిస్టు నాయకుడికి ఉద్యోగముయిచ్చి రప్పిస్తున్నారనిచెప్పి వారు తెలుసుకుంటే మంచిది.

SRI V. VISWESWARA RAO:—ఎక్కడ అయినా ఒకటిఇస్తే ఇచ్చివుండవచ్చును. కాని నేనుకూడా ఆవిషయము చెబుతాను. కొండయ్యగారు చెప్పినదానికికూడా నేను ఒక విషయము చెప్పబోతున్నాను. దివి తాలూకాలో కూడా కూనీలుజరిగిన విషయము మంత్రిగారికి, ప్రభుత్వమువారికి తెలియపరిచాను. కాని యింతవరకు దానిమీద ఎటువంటిచర్య జరపలేదు.

దివి తాలూకా కూచిపూడి గ్రామములో ఒకస్త్రీని బలవంతముగా కారులో తీసుకొనిపోయి, ఆమె జుట్టుకోసి బందరు పట్టణములో విడిచిపెట్టారు. అక్కడ వున్న పోలీసులకు ఈపని చేశారని తెలియజేసి నప్పటికీకూడా ఆ కారునుగాని, ఆ కారులోవున్న వ్యక్తులనుగాని అరెస్టుచేయడానికి పూనుకోలేదు. చివరకు ఒక వ్యక్తిని అరెస్టుచేసి ఏదోవిచారణ జరుగుతోందని మాత్రము చెప్పడము జరిగింది. అదేవిధంగా దివి తాలూకా మంగళాపురములో ఎంతోమంది తుపాకులు పుచ్చుకొని వూరేగారు. తుపాకులు చూపించి సైన్యపద్ధతులద్వారా పల్లెలమీద దాడిచేస్తామని చెప్పివేశారు. అక్కడవున్న ముతరాసుల ఇండ్లపై దాడిచేసి వారి సామానులను చిత్రహింసచేసి వారిని హింసించారు. ఇది పోలీసుకు రిపోర్టుచేయబడింది. ఈ విషయములో ఇంతవరకు ఏ చర్య తీసుకోబడలేదు. కాని వాళ్లే ఆ తుపాకులతో ఆ వూరిలో వూరేగినారు. వాళ్ళనాయకుడికి చల్లపల్లి రాజాగారు 8 ఎకరాల భూమి బహుమతి యిచ్చారు. అంటే దీని అర్థము ఏమిటి? దీని ప్రోత్సహించడముకాదా, బలపరచడముకాదా అని ప్రశ్నిస్తున్నాను. ఇటువంటి వాటి విషయములో ప్రభుత్వమువారు తగినచర్య తీసుకోకపోతే అది సరియైన పద్ధతి కాదని మనవి చేస్తూ ఇటువంటివి వెంటనే నిర్మూలించాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI K. PUNNAYYA:—అధ్యక్షా! ఉప ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ డిమాండును నేను బలపరుస్తున్నాను. మొదట శ్రీకాకుళము జిల్లా

డి. ఎస్. పి. ఆఫీసు గురించి చెప్పి తరువాత మిగతా విషయాలకి వస్తాను. డి. ఎస్. పి. ఆఫీసు యిప్పుడు విజయనగరములో ఉన్నది. మా జిల్లాకు సంబంధించి నటువంటి పోలీసు జ్యూరిస్ డిక్షను హెడ్ క్వార్టర్సు ఆఫీసు విజయనగరములో వున్నది. అందుచేత తొందరగా పనిజరగడానికి యడ్మినిస్ట్రేటివ్ డిఫికల్టీసు వున్నాయి కాబట్టి, తొందరగా ఈ డి. యస్. పి. ఆఫీసును శ్రీకాకుళమునకు మార్పించి వెంటనే ప్రజలకు యడ్మినిస్ట్రేషను సౌకర్యములు కలిగించాలనికోరుతున్నాను. పోలీసు డిపార్టుమెంటులో లంచగొండితనము వున్నది. అది మంత్రిగారుకూడా తెలియజేశారు. అది క్రమేణ తగ్గించడానికి కనీసం ప్రయత్నం చేయాలని మంత్రిగారిని కోరుతున్నాను. పోలీసు వారు అంటే సామాన్యప్రజలు భయపడుతున్నారు. ఎందుచేత అంటే వాళ్లలో వున్నస్థాయి ప్రజావిశ్వాసాన్ని చూరగొనడము లేదు. ముఖ్యముగా హరిజనులకు సంబంధించినంతవరకు పోలీసులు అతిఘోరముగా ప్రవర్తిస్తున్నారు. హరిజనులు పోలీసులకు ఏవైనా రిపోర్టులుచేస్తే వాటిపైన ఏమాత్రముకూడా పోలీసు శాఖవారు శ్రద్ధవహించడము లేదు. ఇక పోలీసు ఆఫీసులలోవున్న రైటర్లు హరిజనులకు చాలా అన్యాయము చేయుచున్నారు. ఒకప్రక్కన సబిన్స్పెక్టర్లకో ఏ విషయమైనా తెలియజేసుకొన్నప్పుడు రైటర్సు వెంటనే సవర్ణ హిందువులకు అంటే ప్రతిపక్షపార్టీ ఏ విధముగా ప్రొసీడ్ అవాలో హరిజనులకు ఏవిధముగా న్యాయము లభించకుండా చేయాలో అది అంతాకూడా వారు చెబుతూంటారు. కాబట్టి పోలీసు రైటర్సు విషయంలో పోలీసుశాఖ పై అధికారులు శ్రద్ధవహించాలి. ఈ విషయములో తగినంతశ్రద్ధ తీసుకోవాలని ప్రత్యేకంగా ఉపముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను. చిన్నచిన్న పోలీసు ఉద్యోగులు చిన్నతప్పులు చేసినాకూడా ఉద్యోగము నుంచి భర్తరఫ్ చేయడము జరుగుతోంది. ఈ విషయంలోకూడా అంతపెద్ద శిక్ష విధించకుండా తగువిధముగా వారిని పరీక్షచేయాలని నేను కోరుతున్నాను.

కానిస్టేబుల్సు రిక్రూటుమెంటులో ఎక్కువగా హరిజనులు లేరు. అందువల్ల హరిజనులకు ఎక్కువగా పౌరసత్వ హక్కులు రక్షించబడుటలేదు. రిమూవల్ ఆఫ్ సివిల్ డిజబిలిటీస్ యాక్టు ఉన్నది. అది ఎక్కువగా అమలు కావడము లేదు. దీనికివున్న చిక్కులు ఏమిటంటే పోలీసుశాఖవారు దీని విషయములో ఎక్కువ శ్రద్ధతీసుకొనక పోవడమువల్లనే. ప్రతి సబిన్స్పెక్టరుగాని, సర్కిలు ఇన్స్పెక్టరుగాని ఈ కార్యక్రమములో పాల్గొనడానికి అవకాశము వుండదు. కాబట్టి సాధారణముగా పోలీసు కానిస్టేబుల్సునే గ్రామాలకు పంపించడము జరుగవలసి వున్నది. వీరు హరిజనులపట్ల సానుభూతికరంగా ప్రవర్తించుటలేదు. దీనికి కారణము ఏమిటంటే కానిస్టేబుల్సులోకూడా కులభేధములకు సంబంధిం

28th July 1955] [Sri K. Punnayya

చినవారు వున్నారు. క్రమేణ హరిజనులను ఎక్కువమందిని రిక్రూటు చేయనిదే వాళ్ల పౌరసత్వ హక్కులను రక్షించబడేందుకు అమితముగా అవకాశం వుండదు. కాబట్టి ఈ విషయముకూడా ఉపముఖ్యమంత్రిగారు గుర్తించుకోవాలి.

ఇక Security proceedings విషయము ఉన్నది. 107, 110, 111, Section Proceedings ఉన్నవి. ఈ Sections లో ఏమీ తప్పులేదు. చాలా ఉదాత్తమైన అభిప్రాయముతో కూడుకొని యీ Sections ఉన్నవి. Security proceedings లేకపోతే ఇప్పటికే సాధారణ రక్షణకూడా ఉండదేమో అనిపిస్తున్నది. పోలీసు సిబ్బందిలో ఉన్నలోపము తప్పితే Proceedings లో తప్పులేదు. కనుక Proceedings ఉండవలసినదే. అవి లేకపోతే అసలు దేశములో ఏ మాత్రము శాంతిభద్రత ఉండదనే నా అభిప్రాయము. కాని Police Department యొక్క స్థాయి పెరగాలి. పూర్వముకంటె ఇప్పుడు ఎక్కువగా Sub-Inspectors ను direct గా recruit చేయడం జరుగుచున్నది. educated people వస్తున్నారు. వారికి castism గాని classism గాని ఏమిలేదు. వీళ్లు administrative integrity, honesty ని దృష్టిలో పెట్టుకొని పనిచేస్తారు. కాబట్టి ఎక్కువమందికి direct recruitment యిప్పించాలని, కోరుచున్నాను. సాధ్యమైనంతవరకు Departments లో promotion ¼ వరకే ఉంచాలి. ఎక్కువగా Sub-Inspectors ను మాత్రము direct recruit గా చేసే విషయం ప్రభుత్వము పరిశీలించాలని కోరుచూ, వీరిలో ఎక్కువగా హరిజనులకుకూడా అవకాశము యిప్పించాలని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

* Sri VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, నేను యీ డిమాండుమీద కోతతీర్మానాన్ని బలపరుస్తూ మాట్లాడుతున్నాను. సంజీవరెడ్డిగారు సెలవిస్తూ State లో Police లేకుండా ఎట్లాఅన్నారు. నిజమే. Police లేకుండా ఏ పరిపాలన జరుగదని నాకు తెలుసు కాని జాతీయప్రభుత్వము వచ్చిన తరువాత వాళ్లదృక్పథములో మార్పువస్తే బాగుంటుంది. కాని జరిగినదేమిటంటే దానిపైన పెత్తనమునకు వచ్చినవారు మారారు కాని, డిపార్టుమెంటు అధికారులలో దృక్పథము మాత్రము మారలేదు. ఉదాహరణకు ఇదివరకు ఉన్నటువంటి లంచగొండితనము ఇప్పటికీ తగ్గలేదు. ఇందాక కొండయ్యగారు చెప్పినట్లు వాళ్ళకష్టాలుకూడా సానుభూతితో ఆలోచించాలన్నారు. ఇప్పుడువచ్చిన చిక్కు ఏమిటంటే వాళ్ళ కష్టాలు సానుభూతితో ఆలోచిస్తే వాళ్లకు జీతము ఎక్కువ ఇవ్వాలని చెప్పితే, డబ్బులేదు అని చెప్పుతారు. అందుచేత సానుభూతి చూపి

Sri Vavilala Gopalakrishnayya] [28th July 1955

డబ్బుయివ్వకపోతే లంచము తీసికోవడము జరుగుతుంది. చిన్నవాళ్ళను శిక్షించటానికి వీలుంటుందిగాని పెద్దవాళ్ళను శిక్షించడానికి వీలులేదు. అయితే దృక్పథంలో మార్పురానందున చిన్నపెద్దలలోకూడా అధికారదర్పం తగ్గలేదు. అసలు జరుగుచున్న సమస్య Police Constable పైన Head Constable తనే సబ్ యినిస్పెక్టరును అనుకుంటాడు. Head Constables నుచూచి Sub-Inspector తానుసర్కిల్ యినిస్పెక్టరు అనుకుంటాడు. సర్కిల్ ఇన్‌స్పెక్టరు తనే సూపరిం టెండెంటు ననుకొని సబ్ యినస్పెక్టరును చిన్నచూపు చూస్తాడు. ఆపైన ఎవరికివారే I. G. ననుకుంటారు. నాకనుభవము. ఒక Sub-Inspector వచ్చి Constable ను you are a fool అంటే yes, sir అనాలి. అట్లాగే, సబ్‌యిన్‌స్పెక్టరును చూచి సర్కిల్, సర్కిల్‌నుచూచి డిప్యూటీ, డెప్యూటీని చూచి డి.యస్.పి., డి.యస్.పి. ను చూచి ఐ. జి. తక్కువగాచూస్తూ, మానవత్వం మరచిపోయి అధికారం దర్పమే అధి కారంగా దలంచి "you are a fool" అంటాడు. అది తప్పు అనగలిగిన తాహతు లేదు. పైగా "Is it not?" అంటాడు. అటెన్‌షన్ అన్నప్పుడు yes, Sir అనకపోతే డిసిప్లిన్‌కు వ్యతిరేకం. You are a fool అంటే, yes, sir అనాలి. ఇది discipline అంటారు ఇది డిసిప్లెన్ అనాలె-లేక అవమానం అనాలె. అంగీకరిస్తే fool అయిపోతున్నాడు. అంగీకరించక "అదేమిటండీ" అంటే, dismiss అయిపోతాడు. ఈపద్ధతిలో ఈనాడు పోలీసుశాఖ యొక్కువ discipline నడుస్తున్నది. ఇది తప్పు, మార్చండి అంటె మనం ఐక్యంచేసుకోవడంవల్ల integrity కి భంగం వస్తుందిఅంటారు.

రాజు అనే ఒక Circle Inspector విశాఖపట్నంలో ఉన్నాడు. ఇప్పుడు ఆయన నిరుద్యోగిగా ఉన్నాడు. ఆతను నాకొక ఉత్తరము వ్రాశాడు. ఏమంటే ఈ సమస్య శాసనసభలో లేవదీయండి, నేనుచేసిన పొరబాటు ఏమిటో D. S. P. Garu చెప్పినట్లు లంచాలను తీసుకోలేదు. అతనుచెప్పిన అపభ్రంశపు పనినంతా నేను చేయటానికి, ఆయన చేస్తుంటే నేను చూడడానికి తలవూపటానికి సంసిద్ధంగా లేక పోయాను. అని వ్రాశాడు. అందువల్ల వీరిని పనికిరారని తీసివేశారు విధిలేక పస్తు లతో రోజులు కడుపుతున్నాడు, ఆయన. అయితే నన్నుగురించి మీరు బాధపడ నక్కరలేదు. ఈవిధముగా department లలో జరుగుతూ ఉంటే అలకించేవారు ఎవరు, D. S. P. చెప్పింది ఒప్పుకోనవలసినదేనా అని వ్రాశాడు. అట్లా వినక పోతే administration జరుగదు. లేకపోతే ఎట్లా అంటారుగాబోలు, జనాన్ని మర్యాదగా చూడడం యింకా నేర్చుకోలేదు. నేను చెప్పేది చిన్న అధికారుల సంగతికాదు. పెద్దవారిసంగతే. నాకు జ్ఞాపకము ఉన్నది. Assembly session

నాడు ఆంధ్రరాష్ట్రం ప్రారంభోత్సవం నాడు ప్రారంభంలోనే ఈ అవకతవక ప్రారంభం అయింది. నిర్దేశించిన స్థలాలు అధికారుల భార్యలు ఆక్రమించితే స్థలం చూపుటకు బదులు Assembly Members ను అందరిని బైటికి నెట్టివేసి, తరవాత వాళ్ళను రమ్మన్నారు. ఇట్లు ఎందుకు జరుగుతోంది ? దీనికి కారణం మార్పురాక పోవడం, పూర్వపు పటాటోపం అణుమాత్రమైనా తగ్గకపోవడం. ఇదివరకు ఈ శాఖ పోలీసురాజ్యంలో (Police station లో) యేర్పడింది. ఈనాడు మనం Welfare State లో వున్నాం. కాని దానిలో వచ్చినటువంటి Welfare State లో welfare మనోతత్వం వీళ్ళ హృదయాలలో రా లేదు. ఇప్పుడు ఉన్న సమస్య ఏమిటంటే వాళ్ళ దృక్పథములో మార్పురాలేదు. ఇదివరకు ఉన్నటువంటి తీవ్రత వాతావరణం పరప్రభుత్వం తరపున జరిగింది. అందువలన అందరం దానిని వ్యతిరేకించాం. కాని ఈనాడు అధికారదర్పం మనప్రజలమీదనే చూపబడుతున్నది. పోలీసు పాతపద్ధతినే నడుస్తున్నది అని అంటారు కాబోలు.

అనాడు ప్రజలు ఒకవైపు పోలీసులు మరొకవైపు ఉండేవారు. ఈనాడు విధానం మారింది. ప్రజలకు ప్రభుత్వంవచ్చింది. ప్రభుత్వాన్ని బలపరిచేవర్గం వుంది. అయితే పోలీసులను అనుదినకార్యక్రమం ఒప్పగించి వూరుకుంటే బాగుండు గాని, కొందరు కాంగ్రెస్‌వారు పోలీసు అధికారుల దగ్గరకువెళ్లి అనవసర జోక్యం కలిగించుకొని కేసులలో ఏవిధంగా ఎవరిపై కేసులు పెట్టాలెనో తమకు నచ్చనివారి పేర్ల జాబితానిచ్చి అధికారులతో చెప్పి శిక్షలువేయిస్తున్నారు. ఆవిధంగా జోక్యం కలిగించుకోవడం, పరిపాలనలో జోక్యం కలిగించుకోవడం అనేది ఎవరూ అంగీకరించరు. కాని చూచిన యథార్థం చెప్పటానికి ఎవరైనా అధికారులవద్దకు వెళ్లితే-వెళ్ళడంతప్పని నేనూ అంగీకరిస్తాను. కాని ఒకవైపు అంతా అక్రమం జరుగుతుంటే ఈవిధంగా మీరు న్యాయంవదలి గ్రామతగాదాలలో ముఠాదారులు చెప్పిన చెప్పుడు మాటలు విన వద్దని చెప్పబోతే—ఇది జోక్యం కలిగించుకోవడం అంటారు. పోలీసు అధికారం దర్పానికి, లంచగొండితనానికి ఉపయోగపడుతున్నది. కనుక తమకు అనుకూలంగా వున్నట్లే వ్యవహరిస్తున్నారు. ప్రోత్సహించినవారిని మెచ్చుకుంటారు. అందువల్ల political parties ను వీళ్లు ఉపయోగించుకుంటున్నారు. అందువల్ల political parties ను ఉపయోగించేపద్ధతిలో వీళ్లు చేసే చిన్నతగాదాలు ఎక్కువగా వస్తున్నాయి. సెక్యూరిటీ సెక్షనుక్రింద కేసులుపెట్టడం గౌరవమే నని కందుకూరు సభ్యుడు కొండయ్యగారుకూడ చెప్పారు. ఈ రాజకీయ వివాదాలను ఆధారపరుచుకొని గ్రామాలలో పోలీసులు తమకుపయోగపడేందుకు రాజకీయపార్టీల వ్యక్తిగత వివాదాలలో పాల్గొని సెక్యూరిటీ కేసులు బనాయిస్తారు. శ్రీకొండయ్య

గారిని నేను అడుగుచున్నాను. అయ్యా! మీమీద 107 section క్రింద కేసు పెడతారు. మీరు good behaviour కు ఒప్పుకున్నట్లు accept చేయండి తెలుస్తుంది. అది మర్యాదగా ఉండేదిగా. సెక్యూరిటీ కేసులు పెట్టినతర్వాత సంఘంలో ఎంత అమర్యాద పాలుఅవుతాడో అవి గ్రామతగాదాల్లో ఎంతబాధ కలిగిస్తారో, అనుభవిస్తే తెలుస్తుంది. బైటవాళ్లు ఇదేమి? వీడు security Section లో ఉన్నాడు అంటారు. అంటే, 1920 లో, కో ఆపరేటివ్ మ్యూవ్మెంటు సమయంలో Security section నాకు పెట్టమంటే నాకు పెట్టుఅన్నారు. అంతేకాకుండా National movement లో Security section వల్ల ప్రభుత్వానికి ఏగతి అయింది. మరోవిధంగా నేరం మోపలేకపోయారు. అటువంటి Security section మంచిది కాదు అనికాదు. అప్పుడు రాజకీయంగా పెట్టినందువల్ల గౌరవప్రదము అయింది. ఇప్పుడు Acts లో ఏది మంచికాదు అనగలరు? ఇప్పుడు Implementation లో వస్తోంది. కొన్ని Acts చాలా prohibitory గా పనికిరాని Acts గా ఉన్నవి. ఇప్పుడు Habitual Offenders Act ఉంది. నిజముగా నేను అనుభవములో చూస్తూ ఉన్నాను. Criminal Tribes Act ఉన్నప్పుడు ప్రతి ఇంటికి వెళ్ళిచూచాము. వారిబాధలు భరించలేకుండా వుండేవి. ఈ Habitual Offenders Act రావడంతో వీరి ఈమూకఉమ్మడి బాధలుపోయినవికదా అని ఆశించాము. దానికి double rate గా Habitual Offenders Act వచ్చింది. బాధలు ఇనుమడించాయి. Criminal Tribes Act విధంగానే ఇవి అమలుచేస్తున్నారు. నేడు చాలా స్వల్పమే అయింది ఆచరణలో. ఇప్పుడు పోలీసువాళ్ల అధికారము ఎక్కువగా conductors మీద ఉన్నది. ఈ రోజు సాయంత్రము కారు తీసుకురారాఅంటే తప్పకుండా తీసుకు వెళ్లవలసినదే. లేకపోతే licence cancel చేస్తారు. కేసుపెడతారు. దానిని ఒప్పుకోమంటారు. పైగా బతిమాలతారుకూడా. మా స్టేషనులో కేసులు తక్కువగా ఉన్నాయి. ఊరికే నామకార్థము ఒప్పుకోమంటారు. ఒప్పుకుంటే, ఈ దఫా ఒక్కమాటు కేసు ఒప్పుకున్నావు గనుక ఈ నేరముకూడా నీవె చేశావు అని అంటూ 10 లేక 15 రూపాయలు Fine కూడా వేస్తారు. చివరకు కేసు రద్దుచేసేస్తారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—గోపాలకృష్ణయ్య గారు ఊరికేచెప్పేదానికంటే ఒకటి, రెండు instances చెప్పితే ఉపయోగము ఉంటుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అచ్చంపేట Police Station లో ఇటువంటి కేసులు జరుగుచున్నవి. కండక్టరులు ఇంటిలో ఉంటే నీవు ఎందుకు డ్రెస్‌తో ఉన్నావని కేసు పెడతారు.

MR. SPEAKER :—The cases are pending. You please refer the cases to the Hon. Minister.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—మీకు కేసులు పేరులతోసహా ఇస్తే చిక్కు ఏమివస్తుందంటే, నాకేమీ లేదు. నేను Assembly లో ఉంటున్నాను. నాకు కొంతరక్షణవుంది. కాని మీరు వెళ్ళి కండక్టరును, డ్రైవరులను [కేసు ఎవరిమీద ఉన్నదో వాడిని] "నీవు గోపాలక్రిష్ణయ్యతో ఎందుకు చెప్పితివి" అని నానాబాధలు పెట్టుతారు. అందువల్ల వాళ్ళకు నాకున్న రక్షణకూడా లేదు.

ఇకపోతే Driver licences విషయం గవర్నమెంటు స్పష్టంగా వ్రాసింది ఇదివరకు లైసెన్సు ఉన్నవాళ్ళకు ప్రథమచికిత్స సర్టిఫికేటులు అక్కరలేదు. కొత్త వాళ్ళకు లైసెన్సులు కావాలిఅని. కాని అది ఎక్కడ అమలుజరుగడములేదు. 6 నెలలనుంచి గవర్నమెంటుతో correspondence, చేస్తూంటే దానికి సమాధానమురాదు. కాగితాలు pending లో ఉన్నాయి అంటారు. పైకిమాత్రం Rules మార్చాము అంటారు. కండక్టరు, డ్రైవర్ లైసెన్సులు renew చెయడంమాని, త్రిప్పి పంపుతున్నారు.

మరొకటివున్నది. కేసులుపడుతూనే వున్నాయి. ఎలక్షన్లు చాలా ప్రశాంతంగా జరిగాయి. ఇందుకు కారణం పోలీసుమాత్రమే కాదు. మా ఆంధ్రదేశంలో సహజసిద్ధమైన ప్రజాస్వామిక సాంప్రదాయాలు ఎన్నిచిక్కులువచ్చినా ప్రజలు నిలబెట్టుకున్నారు. ప్రజలను పోలీసులనుకూడా అభినందించవలసిందే. కాదనను. మనరాష్ట్రం 2 కోట్లమందిజనం కలది కనుక ఏమి జరిగిందని ఆలోచిస్తున్నాం. కాని అసలు కేసు book చేయకపోతే, జైలులో పెట్టినదానికి లెక్కలో వ్రాయకపోతే తన్ని పంపినదానికి మాట్లాడకపోతే, ఇటువంటి ఎన్నో కేసులు అక్కడవున్నాయి. అన్నీ unaccounted for అయిపోయినాయి. ఉదాహరణ చెప్పగలను. కాని Constables dress విషయంలో కొంచెం సానుభూతితో చూడాలని కోరుతున్నాను. అయ్యా, పల్లెటూళ్ళకు వెళ్ళడానికి ఈ పెద్ద boots చాలా బాధగా వున్నాయి. దానిని అయినా మార్పించండి అంటున్నారు. అదికారులు అది discipline కు ఆటంకం అంటున్నారు. పోలీసుడ్రసును కొంచెం మార్చండి. కొంచెం National dress గా తయారుచేయడం కనీసం గాంధిగారి టోపి పెట్టినా బాగుంటుంది అనుకుంటాను,

Voting of Demands for Grants (Contd.)

Demand No. XIV—Police

[28th July 1955

SRI E. AYYAPU REDDI :—అధ్యక్షా మహాశయా, ఈ డిమాండును నేను బలపరుస్తూ నా స్వల్పఅనుభవాన్ని పురస్కరించుకుని కొన్ని సూచనలుమాత్రం చేయదలచుకున్నాను. పోలీసు శాఖలో అత్యంత ప్రాముఖ్యమైనది, అవసరమైనది అపరాధపరిశోధన. ఇందుకు ప్రస్తుతం పోలీసుశాఖలో తగినంత ప్రాముఖ్యత ఇవ్వడంలేదని దానికి తగినంత కాలాన్ని కూడా పోలీసుశాఖవారు వ్యయపరచలేదని నా ఉద్దేశం. కోర్టులో జరిగే 80% కేసులలో ముద్దాయిలు విడుదలైపోతున్నారు. 75% పోలీసుశాఖ పరిశోధనలో ఏదో లోటుపాట్లు వుండడంబట్టి అపరాధులు తప్పించుకొనిపోతున్నారు. ఈ అపరాధ పరిశోధన అనే దానిలో గడచిన ఒక శతాబ్దంనుంచి ఇంతవరకు ఎలాంటి మార్పురాలేదు. అపరాధపరిశోధన సరిగా జరుగలేదని పోలీసుశాఖను నిందించడం భావ్యంకాదనే నేను అంటాను. ఈ అపరాధ పరిశోధన విషయమై పోలీసుశాఖకు ఎంత విజ్ఞానం, ఏమి పరికరాలు ఇచ్చారు అనేదిమాత్రే అపరాధపరిశోధనలోవుండే లోటుబాట్లకు పోలీసుశాఖవారు జవాబుదారీకారని నేను చెప్పగలను. కొంత వరకు bureaucratic set up లో వుండడంబట్టి దానినుంచి ఇంకా మార్పు చెందకుండా వుండడంబట్టి పోలీసుశాఖలో కొన్ని లోపాలు వున్నాయి. కాని ముఖ్యమైన లోపం తగినంత పరికరాలు, విజ్ఞానం లేకుండా పోవడమేనని నేను అనుకుంటున్నాను. ఉదాహరణకు ఒకటి చెబుతాను. ఇటీవల 6, 7 మాసాల క్రింద గుత్తి దగ్గర ఒక గ్రామంలో రాత్రిపూట రహస్యంగా ఒక యువకుని చంపినారు. హంతకుని గుర్తించడానికి ప్రస్తుతం పోలీసువారికి వున్న పరికరాలు ఏమిటి? వారికి వున్న విజ్ఞానం ఏమిటి? కేసు register చేసేది Head Constable. అతను 5-వ తరగతి, 6-వ తరగతి—కట్టకడపటకు V Form చదివి వుంటాడు. అతనికి అపరాధపరిశోధనలో ఎంతవరకు అనుభవం, విజ్ఞానం వుంటుంది? గ్రామానికిపోయినప్పుడు, నేరస్థలానికి పోయినప్పుడు ధీశక్తితో ధైర్యంగా ప్రవర్తించడానికి అతనికి తగినంత స్తోమతు వున్నదా అని ఆలోచిస్తే అదికూడా లేదు. సాధారణంగా న్యాయమూర్తులు తీర్పులలో వ్రాసినటువంటి వ్యాఖ్యానాలు నిశితంగా పరిశీలిస్తే ముఖ్యంగా ఎంత ఘోరమైనటువంటి అపరాధం అయినప్పటికీ మొదట కేసు రిజిస్టరుచేసి పరిశోధనకు ఉపక్రమించేవాడు Head Constable. అతడు ఆనోకీలు ఏమాత్రం తెలియకుండా కేసులో అవకతవకలుచేసి ఇక ముందుకు పోకుండా చేస్తున్నాడు. ఇంకా కొన్ని ఉదాహరణలు కావలసివస్తే, బ్యాంకుల్లో, co-operative societies లో జరుగుతున్న mis-appropriation పత్తాతీసేదానికి పోలీసుశాఖలో వున్నవారికి ఏవిధమైన పరిజ్ఞానం వున్నది? ఒక Sub-Inspector వున్నాడనుకొండి. అతడు లావుగా ఎత్తుగా ఉన్నాడనుకుని

select చేసివుంటారు. అతనికి ఈ పరిజ్ఞానం ఎంత వరకు వున్నది, ఎంతవరకు పరిశోధనలు అర్థం చేసుకోగలడు—ఈ ప్రాతిపదికపై select కాబడి వుండడు. లెక్కలను గురించి ఏమాత్రము తెలియని ఈ accounts గురించి ఏమాత్రం తెలుసుకోగలడు? తప్పు, లోటు ఎక్కడ వుందనేది వెదికిపట్టుకోగలడా? Motor అంటే తెలియనివానికి ఎక్కువ speed వల్ల పోయే motor వల్ల జరిగే ప్రమాదాన్ని పరిశీలించాలంటే ఏవిధంగా పరిశోధించగలడు? Driver negligent and rash driving చేసినట్లు తెలిసికొనుట ఎట్లా? ఇప్పుడు ఇచ్చే పరిజ్ఞానంగాని పరికరాలు గాని అవసరాలకు అనుగుణంగా లేవు అని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తున్నాను. కనుక అపరాధపరిశోధనకు ప్రాముఖ్యత ఇచ్చి దానికి అనుగుణ్యమైన పరిజ్ఞానం, పరికరాలు ప్రభుత్వం పోలీసుశాఖకు వెంటనే చేకూర్చవలెను. ఇటీవల కేంద్రప్రభుత్వం కూడా అపరాధ పరిశోధనకు కొంత ప్రత్యేకమైనటువంటి ప్రాముఖ్యత ఇస్తూ అపరాధపరిశోధనలో శిక్షణపొందేదానికి కొంతమందిని పాశ్చాత్యదేశాలకు పంపుచున్నారు. పాశ్చాత్యదేశాలలో నేటి అపరాధ పరిశోధన నైపుణ్యం చూసినపుడు మన పోలీసు శాఖవారిని చూసి కనికరించవలసి వస్తుంది. నేను ఒక కుక్కను గురించి supplementary question వేస్తూ పాతకాలంనాటి లాఠీ కర్ర తప్ప ఎటువంటి ఇతర పరికరాల పరిజ్ఞానంలేని పోలీసుదళం ఏ విధంగా అపరాధపరిశోధన చేయగలదని అడిగాను. ఇప్పుడైనా తగు జాగ్రత్త తీసుకొని అపరాధ పరిశోధనకు తగినటువంటి పరికరాలు, పరిజ్ఞానం పోలీసు శాఖకు చేకూర్చాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

SRI G. RAMI REDDI :—అధ్యక్షా, పోలీసు డిమాండుగురించి చర్చలో ఒక విషయం మాత్రం చెప్పవలసియున్నది. ఇది ప్రజారక్షణ శాఖ. ప్రజల రక్షణ కలిగిననాడే దేశం భద్రంగా వుంటుంది కాబట్టి పోలీసు డిమాండుకు ఇంకా ఎక్కువ మొత్తం ఇచ్చినా తప్పులేదని ఈ డిమాండుగురించి ఆక్షేపణలేదని చెపుతూ కొన్ని సూచనలు మాత్రం చేయగలుగుతున్నాను. జరిగిన చర్చలను బట్టిచూస్తే పోలీసువారిని గురించి కేవలం ఎందుకో ఒక విధమైన బాధకూడా కలుగుతుంది. వీళ్ళ పరిస్థితి డోలుమాదిరి అయినది. ఇన్ని రాజకీయ పక్షాలవారు వున్నారు; ఎవరైనా వీరిని మంచివారని అన్నారా అంటే, అటు కాంగ్రెసు, ఇటు కమ్యూనిష్టులు రెండు వైపులవారు తిడుతున్నారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—దానిని బట్టి ఎంత నిష్పాక్షికంగా వున్నారో తెలుస్తుంది.

[28th July 1955

SRI G. RAMI REDDI :—Nationalist పార్టీ తరఫున token గా నైనా బాగా పని చేశారని చెప్పదలచుకున్నాను. ఉద్యోగస్థులలో నిజానికి ఒక రకమైన నిస్తబ్ధత, జేజవాబు దారీ వచ్చిందని ఒప్పుకోక తప్పదు. ఎందుకు వచ్చింది ? అధికారులు, అనధికారులు ఒకే రీతిగా వుండవలసిన పరిస్థితులు వచ్చినపుడు ఎందుకు వచ్చింది ? మనవారు కొంతమంది చెప్పినపుడు ఎన్నికలలో కేవలం కమ్యూనిస్టు పక్షపాతముగా పోలీసులు వున్నారని చెప్పారు. దీనికి కారణం వున్నది ? ఇది ఒక జాడ్యం. మన కమ్యూనిస్టు సోదరులకు తంతి ఎక్కడ మీటితే స్వరం వస్తుందో, ఎక్కడ అపస్వరం వస్తుందో బాగా తెలుసును. పేద ప్రజానీకం, కార్మికులు, తక్కువ వేతనాలు వుండేవారి దగ్గరకుపోయి, నాయనా, చాలా కష్టం పడుతున్నారు ; మా కడుపు మాడుతోంది ; పెద్ద అధికారులు తింటున్నారు—కటా కటా ; అంటే స్వార్థం కాబట్టి వారు నిజమే ననుకుంటారు.

బిడ్డను పోషించాలని తండ్రికి తెలుసు. బిడ్డను పోషించకూడదు అనే ఉద్దేశము అతనికి వుండదు. కాని ఆర్థిక లోపమువల్ల వీలువుండదు. ప్రక్కవాడు కొడుకు దగ్గరపోయి మీ నాయన ఎంత పిసనాసి నీప్రక్కయింటిలో చూడు ఎంత మంచి చొక్కా కుట్టించుకున్నాడో అంటే, తండ్రి నిజంగా ఆర్థిక లోపమువల్ల కుట్టించలేదని వానికి తెలియదు. కాని నిజముగా కుట్టించలేదని వాండ్ల తండ్రి తప్పుడువాడని అనుకుంటాడు. ప్రభుత్వము వారికి కొంచెము సహాయము చేయాలనిన కూడ ధనలోపమువల్ల వాండ్లకు వీలులేకుండ వుంది. పోలీసు విషయమై నాకు 10 ఏండ్ల అనుభవమున్నది. కాబట్టి కొన్ని తగువైన సూచనలు చేయదలచుకున్నాను. పోలీసు శాఖలో సబ్ ఇన్స్పెక్టర్ ఉద్యోగము కష్టతరమైనది. కారణమేమి ? అటువైపు పై ఉద్యోగస్థులు చేసే నింద, ఇటువైపు వెనుకవున్న constables బాధ. ఈ కానిస్టేబుల్స్ Inspector టైములో ఏమిచేస్తారంటే right అంటే left కు తిరుగుతారు. Kit తీసిపెట్టమంటే పాతవి పెట్టుతారు. అందువల్ల చీవాట్లుపెట్టడము జరుగుతూవుంటుంది. పైవాండ్ల సమాచారమది. ఇంకొక విషయము చెప్పదలచుకున్నాను. అది ముఖ్యమైన విషయము. Sub-Inspector ను కేవలము అపరాధ పరిశోధనకు executive functions కు పెట్టినారు కాని scriptory work కు మాత్రము కాదు. నేను పోలీసు office లో 10 సంవత్సరాలువుండి దానిని నా అనుభవముతో చూచినాను. ఏమంటే Sub-Inspectors Graduates గా వున్న వాండ్లు కేవలము honest gentlemen గా వున్న young men కు censors, dismissals వచ్చినాయంటే ఎందుచేత వచ్చినాయి. అవి delay of papers

28th July 1955] [Sri G. Rami Reddi

వల్ల వచ్చినాయి. అది కేవలము ఘోరమని చెప్పుతున్నాను. కాబట్టి Sub-Inspectors కు detective capacity వుందా? లేదా అని చూడాలి కాని ఒక paper delay ఐతే శిక్షించరాదు. వారు clerks కారు, వాండ్లు executive officers కాబట్టి నే నొక సలహా చెప్పుతున్నాను. Sub-Inspector కు కొంతవరకు scriptory work తెలిసినవానిని, atteneder ను గాని లేక clerk నైన ఇవ్వండి. Scriptory work చేసుకోడానికి మాత్రము ఒక clerk వుండడము చాల ముఖ్యమైన విషయమని చెప్పుతున్నాను. మిగతా వాండ్లను గురించి కూడా చెప్పినారు. తక్కువ జీతగాండ్లుగా వున్న constables కు బత్తా రు. 0-12-0 యిస్తున్నారు. అది చాలదు. Sub-Inspector కూడా railway journey చేస్తే అతనికి railway warrant యిస్తారు. మరేమియివ్వరు. D. A. యిస్తారు. అతనికి రానుపోను చాల ఖర్చుబోతుంది కాబట్టి పాతకాలపు M. T. A. Rules నైనా పెట్టడానికి కొంచెము పునరాలోచన చేస్తే బాగుంటుంది. అదికూడ సాధ్యమైతేనే పెట్టమని నేను సలహాయిస్తున్నాను. యిక ఎందుకు వస్తుంది ప్రజలమధ్యన పోలీసుల మధ్యన సంఘర్షణ. గోపాల కృష్ణయ్య గారు చెప్పినట్లు పోలీసులు పూర్వపు tension లోనే వున్నారు. స్వరాజ్యము వచ్చిన వెనుక మన ప్రజలు స్వతంత్రమనే పదానికి విపరీత అర్థము యిస్తున్నారు. నాకు స్వాతంత్ర్యము వచ్చింది కాబట్టి విచ్చలవిడిగా తిరుగవచ్చును, బజారులో నిరాడంబరముగా తిరుగవచ్చును, కేవలము bare body తో తిరుగవచ్చును అనుకుంటారు, చట్టమే లేదనుకొంటారు. మన మందరము సమానము కాబట్టి యీ విధంగా వుండాలనడం మంచిది కాదు. ఆ నాడు ఎటుపోయిన తన్నేది అలవాటుగా వుండేది. ఇప్పుడు తంతే కేసులు పెట్టుతారు. కాబట్టి ఆ పిత్రార్జితమైన హక్కు పోయెనే అని పోలీసువాండ్లకు ఒక బాధ. ఈ యిద్దరి మధ్య జరిగిందేమిటంటే, ఒకవిధమైన స్తబ్దత. కనుక అధికారులు అనధికారులు అనే భేదము లేదని యిరువైపులవారు సమాధానమునకు వచ్చినప్పుడే సరిపడుతుంది. కాబట్టి యీ పోలీసువారుకూడా ఒక విధమైన కలుపుకోరుతనము అనేది నేర్చుకోవాలి. ప్రజలుకూడ వాండ్లు మన సోదరులనేది ముఖ్యముగా నేర్చుకోవాలి. రాజకీయ పార్టీలలోనికి పోతూ వుంటారంటే, యీ రాజకీయ పార్టీలు యీ వైపు పోతారు, ఆ వైపు పోతారు. వీరూ చేస్తారు, వారూ చేస్తారు. కనుక మనయందుకూడ లోపమువుందనే సంగతిమాత్రము విమర్శకులు కొంతవరకు తెలుసుకోనేది మంచిదని మాత్రము చెప్పుతున్నాను. పోలీసు శాఖ elections లో బాగానే పనిచేసిందనే విషయమును గురించి నాకే విధమైన సందేహము లేదు. చాలా బాగా మంచి పట్టుదలతో నిర్దాక్షిణ్యముగా, నిష్పాక్షి

Sri G. Rami Reddi] [28th July 1955

కముగా చేసినారని చెప్పుతూ యీ పోలీసు డిమాండును గురించి మాట్లాడడానికి అవకాశ మిచ్చినందుకు అధ్యక్షులవారికి ధన్యవాదాలు సమర్పిస్తున్నాను.

SRI K. VENKATARATNAM :—అధ్యక్షా మహాశయా, ఇప్పుడు ఉప ముఖ్య మంత్రిగారు ప్రతిపాదించిన యీ Police Demand ను నేను బలపరుస్తాను. కాని యీ నాడు యీ Demand లో హెచ్చుగా ఖర్చు పోతున్నదని కొంతమంది గౌరవనీయ సభ్యులు చెప్పారు. యింత హెచ్చుగా ఖర్చు ఐనప్పటికి యీ నాడు దేశములో శాంతి భద్రతలు మాత్రము చక్కగాలేవని చెప్పవలసి యున్నది. నిజంగా యీ నాడు ఏ మనిషికూడా తా నున్నచోట వుంటాడా లేడా? తన ఆస్తి భద్రంగా వుంటుందా లేదా? అనే విషయము లలోకూడా రక్షణ లేకుండ వున్నాయి. ఇంత ఖర్చు పెట్టినప్పటికి ఇది చాలదని నేను అనుకొంటున్నాను. ఒక్కటే ఉదాహరణ తీసికోండి. వేసవికాలములో ఎక్కడైనా గ్రామాలలో నిప్పు గాలికిలేచి దహనాలు కావచ్చును. వానలు కాలవచ్చును. అటు కాకుండా ఎవరైతే కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా వుండి canvass చేశారో అటువారియిండ్లు ప్రత్యేకంగా పేరుపెట్టి తగులబెట్టి నటువంటి కొన్ని గ్రామాలను చూపిస్తాను. క్రిష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాలలో కొన్నివందల గ్రామాలలో యీపని చేశారు. ఇంతకుముందు గౌరవనీయ సభ్యులైన విశ్వేశ్వర రావుగారు పోలీసువారు అల్లరులు చేశారు అన్నారు. ఎవరేమి చేశారో చెప్పమని నేను అడుగుతున్నాను. కమ్యూనిస్టులకు వ్యతిరేకముగా ఉన్న కాంగ్రెస్ వాదుల కుప్పలను తగులబెట్టారు. వాండ్ల ఆస్తులను సర్వనాశనముచేశారు. ఇంకా వారిపైన action ఆరంభించలేదు కాని.

SRI V. VISWESWARA RAO :—కమ్యూనిస్టులు తగులబెట్టారని చెప్పారు. నేను ఒకటే అడుగుతున్నాను. మీద్వారా Deputy Chief Minister గారిని అడిగేది ఏమిటంటే, ఇప్పుడైనా మంత్రిగారు కనీసము న్యాయముగా విచారిస్తే వారియొక్క యదార్థము తెలుస్తుంది. కర్నూల్ నుంచి C. I. D. లు వెళ్లారు. విచారించి చివరకు అది కమ్యూనిస్టులు కాదనిచెప్పి తెలుసికొన్నారు. ఆ reports ను గౌరవనీయసభ్యులు చూడడము మంచిదని చెప్పుతున్నాను.

SRI K. VENKATARATHNAM :—గౌరవనీయ సభ్యులు చెప్పారు ఎవరో వెళ్ళి enquiries చేశారని. నేను అడుగుతున్నాను. చెప్పమనండి. పెనుమచ్చ గ్రామంలో సీతాకాలంలో రాత్రి ఒంటిగంటకు తగులబెట్టారు.

28th July 1955] [Sri K. Venkatarathnam

5 ఎకరాల వాని. అదేవిధంగా అగ్నిపర్రులో కాంగ్రెస్ వాదులకు భోజనముపెట్టాడనే ఉద్దేశంతో ఆయన ఇంటిదగ్గరవున్న నాలుగువేల రూపాయల విలువగల చావిడిని ఒంటిఘంటకు తగులబెట్టారు. తగులపెట్టుతామని చెప్పారు. తగులపెట్టారు. అదేవిధంగా కపిలేశ్వరపురంలో తగులపెట్టారు. అయనమూరులో తగులపెట్టారు. గండికుంటలో తగులబెట్టారు. కంచికచెర్ల, పెనుగంచిప్రోలు వగైరా గ్రామాలలో తగులపెట్టారు. అంతేకాదు కంకిపాడుదగ్గర యీడ్పుపల్లె అనే గ్రామములో ఒక్కసారి కాదు మూడుసార్లు తగులబెట్టారు. ఎవరివి ఈ వాములు ? ఒక్కసారి ఎనిమిదివాములు తగులబెట్టారు. మరొకసారి మూడువాములు తగులబెట్టారు. ఇంకొకసారి నాలుగువాములు తగులబెట్టారు. కాంగ్రెస్‌వాండ్లెక్కడో తగులబెట్టలేదు. కమ్యూనిస్టు పార్టీవాండ్ల వాములను ఎక్కడైన ఒక్కదానిని తగులబెట్టారా ? చెప్పమనండి. అడుగుతున్నాను గౌరవనీయ సభ్యులను. ఎక్కడనైన ఒక్కచోట కాంగ్రెస్‌వాండ్లు ఏ గ్రామములోనైన తగులబెట్టిఉంటే చెప్పమనండి. ఎక్కడా తగులబెట్టలేదు. తగులబెట్టింది ఎవరివి ? కాంగ్రెస్ వాదులుగా ఉండి కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా పని చేసినందువల్ల వారిని భయపెట్టడానికి "నీవు మాకుగనుక వ్యతిరేకముగా చెసినావంటే నీ ఆస్థిని తగులబెట్టుతాము, ప్రాణాలు తీస్తాము" అని కూడా వుత్తరాలు వ్రాశారు. అటువంటివి ఉదాహరణలు కావాలంటే అన్నీకూడా యిస్తాను. శాంతిభద్రతలకు యిక రక్షణ లేదంటున్నాను. ఇంకా రక్షణ చాలదంటున్నాను. అపరాధ పరిశోధకులను యింకా ఎక్కువ చేయాలన్నారు నాకుముందు మాట్లాడిన గౌరవనీయసభ్యులు. నిజంగా ఎక్కువచేయవలసిందే. రక్షణ లేకున్నట్లయితే ఎవరయితే బయటకువస్తారో ఆయన వామి తగులబెట్టుతూ వుంటారు. ఆయనఇల్లు తగులబెట్టుతారు. లేకపోతే ఆయన ప్రాణాలనుకూడా తీస్తుంటారు. న్యాయమైన పద్ధతులనుఅనుసరించి స్వాతంత్ర్యము కావాలి అనుకొనేవారు స్వేచ్ఛగా ఓటుయివ్వడానికి ప్రచారముచేసుకోడానికి హక్కుగల మనుష్యులెవరు వస్తారు బయటికి ? ఎందుకంటే, యీ విధంగాచేస్తే తమ ఆస్తులను తగులబెట్టుతారని భయపడుతున్నారు. చిన్నచింతల అనే గ్రామములో గుడివాడ నియోజకవర్గములో కాంగ్రెస్ వాదులకు ఓటుచేశారనే కారణముచేత ఆ గ్రామములో రెండువందల ఎకరాల కుప్పలను ఒక్కసారి తగులబెట్టారు. ఆ విధంగా చెప్పాలంటే కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలో ఎన్నోచోట్ల చూపించగలము. ఎవరుచేశారని అడుగుతున్నాను ? కనుక ఇటువంటి పరిస్థితులలో యీనాడు, రక్షణలేదు. కనుక ముఖ్యమంత్రిగారు, మన డిప్యూటీ ముఖ్యమంత్రిగారు ఏదిజరిగినా ఎవరినుంచిజరుగుతుందో, ఎటులజరుగుతుందో విచారించి తెలుసుకోవాలని మనవిచేస్తున్నాను. కాంగ్రెస్ వాదులని తేలితే కాంగ్రెస్

Sri K. Venkatarathnam] [28th July 1955

వారైనాసరే arrest చేయండి. లేక కమ్యూనిస్టుపార్టీకి సంబంధించినవారు చేస్తున్నారంటే అరెస్టుచేయండి. నేను కమ్యూనిస్టుపార్టీ అనేటప్పటికి నిజముగా కొంతమంది సోదరసభ్యులు ఆక్షేపణ చేయవచ్చును. ఎవరుచేస్తున్నారని అడుగుతున్నాను. భయపెట్టుతున్నారు. చంపుతామంటున్నారు. యీవిధంగాచేస్తుంటే దేశములో శాంతిలేదు.

ఇంక fire station లను గురించి రాయలసీమలో లేకుండా మా ప్రాంతంలోనే పెట్టమని చెప్పి అడగంగాని అక్కడున్నవి తాటాకు కొంపలు. కొన్ని చోట్ల కొంపలన్నీ తాటాకువి. వరిగడ్డి వాములు ఉంటాయి. ఒక్కసారి అంటుకుందంటే గ్రామం గ్రామం ఎగిరిపోతుంది. ఎండా కాలంలో ఒకేనాడు ఒక్క తాలూకాలోనే 5, 6 చోట్ల అంటుకొని, ఊళ్లు తగలబడిపోతున్నాయి. చాలా నష్టం వస్తోంది కనుక, ఈ fire stations కూడా Police Department కు సంబంధించే యున్నవి కనుక తాలూకాకు ఒకచోట ఐనా fire station పెట్టి, అక్కడ ప్రజలకు ఉపయోగం కలిగేటట్లు చేయవలసినదని నేను మనవిచేస్తున్నాను. ఇంక ప్రజలకు రక్షణ ఇవ్వడం విషయంలో మన Deputy ముఖ్య మంత్రిగారు తప్పకుండా శ్రద్ధవహించి రక్షణ కలుగజేయవలసినదని మనవి చేస్తున్నాను.

SRI T. VEERARAGHAVULU :—అధ్యక్షా! పోలీసు పద్దును బలపరుస్తూ పోలీసువారు పౌరులయొక్క ప్రాణధనమాన రక్షణయందు, శాంతి భద్రతలు కాపాడే విషయంలోనూ చూపించిన శ్రద్ధా భక్తులకు వారిని అభినందిస్తూ మన ఉప ముఖ్యమంత్రిగారు చెప్పిన అభిప్రాయాలతో నేను ఏకీభవిస్తున్నాను. ఐతే రెండు మూడు ముఖ్యమైన సలహాలు మాత్రమే మనవిచేసి నేను విరమిస్తాను. నేరాలు జరగకుండా ఉండేందుకు ప్రభుత్వం చర్యతీసుకొనుట అవసరమని గమనించినట్లుగాలేదు. నేరాలు ఎందువల్ల జరుగుతున్నాయి. జరిగిన నేరాల ఆచూకీ తీయుటం, నేరస్థులను శిక్షించడమేకాకుండా, నేరాలు జరగకుండా ఉండేందుకు తగిన ప్రయత్నాలుకూడా చెయ్యడం మంచిది. నేరాలు చెయ్యడానికి కారణమైనటువంటి ఆర్థిక దుస్థితి, సాంఘిక పరిస్థితులను గురించికూడా ప్రభుత్వం అప్పుడప్పుడు ఆలోచనచేసి తగినటువంటి చర్యలు తీసుకోవడం అవసరం. ఇప్పుడు రైళ్ళలోనూ, సినిమాలలోనూ, బస్సులలోనూ చాలామంది నిరుద్యోగులూ చదువుకున్నటువంటి యువకులూ

కొద్ది కొద్ది ఆస్తులున్నటివంటి వాళ్లు వేరొక జీవనోపాధిలేక,—తరువాత తల్లీ తండ్రీ లేనటువంటి దీనులూ అనేకమంది - pick-pockets గా తయారవుతున్నారు. అది మదరాసులోనే కాదు. చిన్న చిన్న ఊళ్ళలో కూడా bus stand ల దగ్గర ఈ నేరాలు జరుగుతున్నాయి. Railway station లలో జరుగుతున్నాయి. రైళ్ళలో జరుగుతున్నాయి. ఇటువంటి నేరాలు జరగడానికి కారణం ఏమిటంటే, నిరుద్యోగం ప్రబలంగా యుండడం అనేది ఒకటి. రెండవది వారికి వేరే జీవనోపాధి లేకపోవడం. మూడవది వారిని పట్టుకోవడం దుస్తరమైపోవడం. అందు చేత వీటినిగురించికూడా ప్రభుత్వంవారు జాగ్రత్తగా ఆలోచించాలని మనవి చేస్తున్నాను. ఇక నేరస్థులలో చిన్న వయస్సులో ఉండి పరిజ్ఞానం చాలక, యుక్త వయస్సు రాని కారణంచేత, ఇది నేరం అనేటటువంటి జ్ఞానంలేక నేరం చేసిన పిల్లల విషయంలో కూడా తగినటువంటి శ్రద్ధ చూపించాలి. వారిని చెంగల్పట్టులో యున్నటువంటి school లో చదివించడం ఐన తర్వాత వారు ఏమౌతున్నారు వారు? సక్రమమైన పౌరులుగా తయారైనారా? లేదా? అనే శ్రద్ధకూడా చూపించాలి. ఈ juvenile offenders విషయంలో ప్రభుత్వం ఇప్పుడు తీసుకుంటూయున్న చర్యకంటె సంతృప్తికరమైనటువంటి, సక్రమమైనటువంటి, సమగ్రమైనటువంటి కృషి చేయడం సమాజంయొక్క సుస్థిరశాంతికి చాలా అవసరమని మనవిచేస్తున్నాను. ఇక పోలీసువారిని గురించి చెబుతాను. పోలీసుజీవితం చాలా ఒడిదుడుకులతో కూడినవిషయం. Brothel Act అతనే అమలుపరచాలి. Prohibition Act అతనే అమలుపరచాలి. Habitual offenders Act అతనే అమలుపరచాలి. Bus traffic ని గురించి, overload గురించి అతనే చూచుకోవాలి. పాపం గుండీలు తోసుకోటం, belt లు తోసుకోటం dress వేసుకోడం, పట్టీలుచుట్టుకోవడం వీటితో ఈ నికృష్టమైనటువంటి జీవితంతో ఈ స్వల్పజీతగాడు ఎంతమంది నిందకు పాత్రమైనాడో అనేది మనం ఆలోచించుకుంటే ఒక్కొక్కప్పుడు కనికరించవలసికూడా వస్తుంది. దీనివిషయంలో గౌరవసభ్యులు చేసిన విమర్శలు సహృదయతతో ఆలోచించాలి. మనదేశకాలమాన పరిస్థితులనుబట్టి ఈ పద్దుకై మనం హెచ్చించిన డబ్బు ఏమంత గొప్పదికాదు. దీన్ని ఎటువంటి ఆక్షేపణ లేకుండా అందరూ ఒప్పుకోవలసినదిగా నేను మనవిచేస్తున్నాను.

*SRI D. V. SUBBA RAO:—అధ్యక్షా! ఈరక్షణశాఖను గురించి ఉపముఖ్యమంత్రిగారు చేసిన అభ్యర్థన బలపఱచలేనందుకు విచారిస్తున్నాను. కారణం ఏమిటంటే, రక్షణశాఖ అసలు అనవసరం అని కాదు. ఏపరిపాలననా వ్యవస్థకైనా

Sri D. V. Subba Rao] [28th July 1955

రక్షణశాఖ అవసరమే. కాని అది నిర్వహించే పద్ధతి చాలా లోపభూయిష్టంగా ఉందనే కారణంవల్ల మాత్రం బలపరచలేక పోతున్నాను. ప్రధానమైన లోపమేమిటంటే పోలీసుశాఖలో top ranking officials కున్నూ, bottom లోయున్న Low grade officers కి అంటే ఉన్నతశ్రేణిలోయున్న వారికీ, క్రింది శ్రేణిలోయున్న వారికీ మధ్య జీతాలలో యుండే తారతమ్యం హాస్తిమసికాంతరంగా ఉంది. పోలీసు ఉద్యోగంలో క్రిందిశ్రేణివారు అంటే Sub-Inspectors, Head Constables, Constables ఏ ప్రదేశంలోనైనా ఏ నేరం వచ్చినా దర్యాప్తుచేయడం వగైరాపనులన్నీ చేయడం వీళ్ళే. ఉన్నతశ్రేణిలో యున్న Deputy Superintendents గాని, D.S.P లుగాని, D.I.Gలుగాని, I.G గాని వీరెవ్వరూ ఏపనీచేయరు. వీరు డైరీ వ్రాయనక్కర్లేదు. కోర్టుకు రానక్కర్లేదు. ఏదో grave crime reportఅని ఒకటివ్రాసి పారేస్తేచాలు. అందుచేత వారు చేసేదేమీలేదు. కత్తిపెత్తనం ఉద్యోగం అన్నమాట ఇది. దీనికి వేలకొలదిజీతాలు అనవసరం. దీనికి పెద్ద intellect అవసరంలేదు. పెద్ద ఇంజనీరింగు skill అవసరంలేదు. పోనీ ఏదో నందిగొండ డామ్ లాంటిది కట్టడమైతే engineering skill ఉండాలి. ఒక్కరాయి తక్కువపడింవంటే అంతా కృష్ణార్పణం ఐపోతుంది. లక్షలకొలదీ ఎకరాలు వేలకొలదీ గ్రామాలు కొట్టుకుపోతాయి; పంటలు నష్టపడతాయి. అటువంటప్పుడు మేధస్సు కావాలి. ఈ కత్తిపెత్తనం ఉద్యోగాలకువేలకొలదీ జీతాలు ఇవ్వడం అనవసరం. పైశ్రేణిలోయున్న పెద్ద ఉద్యోగస్థుల జీతాలలో నుంచి కొంత తగ్గించేసి క్రిందశ్రేణిలోఉండి శ్రమపడుతూయున్నవాళ్ళకు పెంచినట్లయితే చాలా సమంజసంగా యుంటుంది. భారం అంతా వీళ్ళెసహిస్తున్నది. మన ఉపముఖ్యమంత్రిగారు మొట్టమొదట ఉపోద్ఘాతంలో ఏమిచెప్పారంటే, చాలా సంతృప్తికరంగానే ఉన్నాయి వీళ్ళ జీతాలు అని. 30 రూపాయలు మొదలు 40 రూపాయలవరకూ constables కు జీతం ఉందని చెప్పారు. దానికి వారు అంత సంతృప్తిపడడానికి కారణం ఏమీ కనబడడం లేదు. గోచీపెట్టుకుని చెరువు త్రవ్వే ఉప్పరవాడికి రోజుకు రూపాయిపావలా రూపాయిన్నరకూడా కూలీ ఉంది. ఉత్తరాలు పట్టుకువచ్చే Postman కు 70 రూపాయలు జీతం ఉంటూంటే, ఎంతో బాధ్యతగల ఉద్యోగం నిర్వహించే Police Constable కు 30 నుంచి 40 రూపాయలవరకూ జీతం అంటే, అది పెద్ద సంతోషించవలసిన విషయం కాదు. క్రింద శ్రేణిలో యున్నవారి జీతాలుమాత్రం చాలా తక్కువగా ఉన్నాయనీ, అందుచేత పెద్దజీతాలు తగ్గిస్తే బాగుంటుందనీ సూచిస్తున్నాను. క్రింద శ్రేణి జీతంలోయున్నవాళ్లు ముఖ్యంగా పోలీసులు ఏదైనా

28th July 1955] SRI D. V. Subba Rao]

జీతం ఎక్కువ చేయమని అడిగితేమటుకు తప్పకుండా వారు punishment కు పాత్రులవుతారు. మన మంత్రులు ఇప్పుడున్న constitution ప్రకారం అయితే నేను, లేక వారియొక్క frame of mind ని బట్టి ఐతేనేమి, ఆ పెద్ద officer ల జీతాలు తగ్గించరు. కాని క్రింద వారు జీతం ఎక్కువ చేయమంటే మాత్రం punish చేయడానికి తయారౌతారేమో, అని కమ్యూనిస్టులని అంటారేమోనని వాళ్లకి భయం. నాకు ఒకచిన్న కథ జ్ఞాపకం వస్తోంది. అమ్మవారు ఏమి చేసిందంటే, "తన నెత్తిమీద కాళ్లుపెట్టిన నవాబుగారిని ఏమీచేయలేక తను కాళ్లు పట్టుకున్న సేటుగారిని చంపకాయ కొట్టిందట, నా నెత్తిమీద కాళ్లు తీయించరా నవాబు గారివని". అల్లా ఉంది వీళ్ళ కథ. అందుచేత తనకు లోకువగా యున్నవాణ్ణి punish చేయుటకు ప్రయత్నం చేయడము, పై వాణ్ణి ఏమీచేయలేక పోవడము, ఈ పద్ధతే కనబడుతోంది. అందుచేత అది ఒక ప్రధానమైన లోపం. ఇక T. A. ల విషయంలో మామూలుగా ఒక పెద్ద officer కర్నూలు దగ్గరనుంచి బయలుదేరి బెజవాడ వెళ్తారు అనుకోండి. ఆ బెజవాడ ప్రక్కనే ఇంకో 30 మైళ్ళదూరంలో యున్న ఏలూరులో ఏదైనా పని ఉన్నట్లైతే అప్పుడు వెంటనే బెజవాడనుంచి అక్కడకువెళ్ళి చూచుకొని రాకుండా మళ్ళీ కర్నూలుకు తిరిగివెళ్ళి వస్తూ ఉంటాడు. ఎందుచేత? మళ్ళీ ఇంకొకసారి అంత T.A. రావడం కోసమని. సమను అమలు జరిపినందుకో, అమలు జరపనందుకో ఏదైనా ఒక అర్ధరూపాయి పుచ్చుకొన్నట్లు తెలిసినట్లైతే ఆ Constable మీద punishment roll పెట్టడంలోమాత్రం వెనుదీయరు. ఇల్లా ఈ T. A. లలో ఎంత ప్రజాద్రవ్యం దుర్వినియోగమై పోతోందో? అందుచేత ఒక కన్వెన్షనో, లేదా ఒక రూలో departmental గా పెట్టి, వందమైళ్ళ radius లో యున్న పనులన్నీ ఒక్కమాటే చూసుకోవాలనీ, మళ్ళీ ఏదైనా అత్యవసరమైన పని ఉంటే తప్ప headquarter కి తిరిగి రాకూడదనీ నిర్ణయించినట్లైతే ప్రజాద్రవ్యం కొంత దుర్వినియోగం కాకుండా ఉంటుందేమోనని చెప్పి నాకు తట్టుతోంది. తరువాత investigation, prosecution ఈ రెండింటినీ గురించి ఇప్పుడు Orissa లో ఒక system అమలులో యుంది. Investigation చేసిన అధికారి prosecution చేయ నక్కర్లేదు. అంతే. ఇక్కడ A. P. Ps ని వేశాంగదా. వాళ్ళు చేస్తున్నారంటారు కాని వారు అన్ని కేసులలో రారు. ఏదో complicated question of law ఉంటే కాని రామంటారు, మిగతా కేసులలో investigation చేసినవాళ్ళే రావడంమూలాన — ఎక్కడో ఇంకొకచోట grave crime report ఐందని వెళ్ళిపోవడం అతను రాకపోయిన సందర్భంలో — వాళ్ళే సమన్లు అమలు జరపాలి కాబట్టి సమన్లు

SRI D. V. Subba Rao] [28th July 1955

అమలు జరగకపోవడం, కోర్టుకు ఎవరినీ హాజరు పంపించకపోవడం అక్కడ Magistrate గారూ, ప్లీడర్లూ చెల్లెమొగం వేసుకుని కూర్చోవడం జరుగుతోంది. ఎవరూ రాకపోవడం జరుగుతోంది. అందుచేత investigation చేసిన officer diary వ్రాసినతరువాత prosecute చేయడానికి అందులోనే separate గా ఒక తెలివైన Sub-Inspector కి, లేకపోతే కొంచెం qualification ఉన్న headconstable కి వప్పచెబితే బాగుంటుంది. Investigating officer కే prosecution కూడా వప్పచెప్పడంలో cases dirposal చాలా delay అవుతోంది. జామీను కేసులను గురించి చాలామంది ఇక్కడ ఉదహరించారు. Police standing orders లో జామీను కేసు పెట్టేటప్పుడు Inspector of Police ఎప్పుడూ కూడా Sub-Divisional Magistrate తో consult చేసి పెట్టాలని ఉంది. దీనివల్ల ఏమౌతోంది ? కేసు ట్రైయ్యడానికి ఒక్కొక్కప్పుడు Magistrate గారికి ఇబ్బంది అవుతోంది. ఎందుచేత ? వీరితో consult చేసే పెట్టారుగదా అంటారు. Police వారు ఆయనతో consult చేయుబట్టి వీడి గత చరిత్రంతా ఆయన ముందే తెలుసుకుని ఉండబట్టి prejudice కావడంవల్ల నిష్పక్షపాతంగా తీర్పు చెప్పడానికి కొంచె కష్టంవస్తోంది. కాబట్టి Police వారు Sub-Divisional Magistrate అనుమతితో కేసు పెట్టాలనే పద్ధతి తీసివేసినట్లయితే తీర్పులు నిష్పక్షపాతంగా ఉంటాయని అనుకోడానికి వీలుంది. Police వారికే Prohibition శాఖను hand over చేస్తామంటున్నారు. అంతమటుకు అది మంచిదిగాచనే. కారణం ఏమిటంటే, ఇప్పుడు Prohibition staff కు Prohi-bition కేసులు పెట్టడానికే power ఉంది ; Police వారికి Prohibition కేసులూ, ఇతర కేసులూ కూడా పెట్టడానికి powers ఉన్నాయి. నా అనుభవంలోనే ఏమి జరిగిందంటే సామర్లకోటలో police station ప్రక్కన illicit-distillation జరుగుతోంది. Prohibition station ప్రక్కనే gambling జరుగుతోంది. వీళ్లుపట్టింది వీళ్ళే కేసుపెట్టారు. వాళ్లుపట్టింది వాళ్ళే కేసుపెట్టారు. Result ఏమిటంటే వాళ్లుపెట్టిన కేసు వీళ్లుచెడగొట్టారు, వీళ్లు పెట్టినకేసువాళ్లు చెడగొట్టారు. Police Sub Inspector గారు prohibition కేసులో సాక్ష్యం తిప్పేశారు. Prohibition Sub-Inspector గారు gambling case లో సాక్ష్యంతిప్పేశారు. (Laughter)

AN HON. MEMBER :—ఏమిటా కేసు ?

నా అనుభవములోని విషయమే చెప్పుచున్నాను. సామర్లకోట Police Station ప్రక్కనే అలాంటి distillation జరుగుతూ ఉంటే, Prohibition

28th July 1955] [Sri D. V. Subba Rao

Station ప్రక్కన gambling జరుగుతూ ఉంటే, వీళ్లొక కేసు పెట్టారు, వాళ్లొక కేసు పెట్టారు. చివరకు ఇద్దరు పెట్టిన కేసులు వాళ్ళచేతనే పోగొట్టుకున్నారు. వీళ్లు పెట్టిన కేసు వాళ్లు చెడగొట్టారు. వాళ్లు పెట్టిన కేసు వీరు చెడగొట్టారు. పోలీసు Sub-Inspector గారు అందులో సాక్ష్యం తిప్పేశారు. Prohibition Sub-Inspector ఇందులో సాక్ష్యం తిప్పేశారు. అందుచేత ఇటువంటి conflicts లేకుండా ఈ రెండు శాఖలు ఒకరికే ఒప్పజెప్పితే మంచిదని నాఅభిప్రాయము. తరువాత మంగళగిరి సభ్యులు గుంటూరు జిల్లాలో Fire Services విషయంలో చాలా దారుణం జరిగినదని అక్కడ పోలీసువాళ్లు Communists మీద sympathy కనపరచారని చెప్పారు. కూర్మయ్యగారు కాంగ్రెస్ వారే అయినప్పటికి, ఏ కారణంవల్లనో దాన్ని condemn చేస్తూ చెప్పారు. ఇటువంటి individual cases తీసుకున్నట్లయితే, P. సత్యనారాయణగారు elect అయిన సందర్భములో సామర్లకోట నియోజకవర్గంలో అక్కడ జరిగినటువంటి దానికి నేను direct eye witness అని చెప్పుతున్నాను. అప్పుడు రెండు వేల హరిజనులను రాకుండా అక్కడ భూస్వాములు అడ్డుపెడితే, పోలీసులతో చెప్పడం జరిగింది. చెప్పితే వారు మేము-కలుగజేసుకోము, time అయిపోయింది. వంద గజాలుదాటి మేము రాము అని చెప్పారు. సామర్లకోట నియోజకవర్గము, ఇంక ఏ ఇతర రాజకీయపార్టీలకుకూడ అజేయము. అందుచేత సామర్లకోట నియోజకవర్గములో ఆయన చాలా జయప్రథంగా నెగ్గి వచ్చాడు. కాని అక్కడ జరిగింది చాలా చరిత్రాత్మకమైన విషయమని అందరికిని తెలుసును. తరువాత వేటపాలెంలో రెండువేల మంది హరిజనులను రాకుండా ఆపివేస్తే పోలీసు ఏమి పనిచేయలేదు. కాబట్టి ఇటువంటి individual instances చెప్పవలెనంటె చాలా ఉంటాయి. కాని ఆంధ్ర దేశములో ఇప్పుడు కమ్యూనిస్టులకు బలము తగ్గిపోయింది, మరేమి భయంలేదని కాంగ్రెస్‌వారు చెప్పుతున్నారే, అటువంటప్పుడు, పోలీసువారిని ఎక్కువ చేయాలని అనడంలో అర్థం ఏమిటో బోధపడడంలేదు. దీనికి ఉదాహరణగా ఒకరు ఒక విషయం చెప్పారు. ఒకడు నా ప్రాణముమీద విసుగెత్తి పోయింది, నేను చచ్చిపోతాను, అని చెప్పి దీపము పట్టుకొని పోతూ ఉన్నాడట. చచ్చిపొయ్యేదానికి దీపము ఎందుకురా అంటే, కొంచెం పురుగు పుట్ర ముట్టకుండా అని చెప్పినాడట. అదేవిధంగా కమ్యూనిస్టు ప్రాబల్యము తగ్గిపోయిందని చెపుతూ Police Demand కు ఎక్కువ ఇవ్వాలంటున్నారు. కాని Fire Stations విషయములో, నిజంగా ప్రతి తాలూకాలో Fire Services Station ఉండవలసిందేనని East Godavari District Fire Officer ఒక report వ్రాశారని తెలిసింది. అందులో తునిలో ఒక Fire Station

వంటి నేరాలు కల్గడానికి అవకాశ మున్నది. కనుక అటువంటి చోట్ల queue system ను అమలు జరిపితే, ఈ నేరాలు తగ్గడానికి అవకాశముంటుందని మనవి చేస్తున్నాను.

*SRI G. BUSSANNA:-అధ్యక్షా, ప్రభుత్వము ఇప్పుడున్న పోలీసుస్టేషన్లు చాలవని, ఇంకా ఎక్కువ చేయాలని, ప్రతి Major Panchayat లోను Police Stations పెట్టుబోతామని చెప్పినారు. కాని, ఇదివరకు అటువంటిది దేమి చేయ లేదు. కనుక త్వరగా ఈ ఏర్పాటుచేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను.

తరువాత arrack విషయంలో పోలీసువాళ్లు భాగస్థులుగా ఉన్నట్లు కనిపిస్తున్నది. Arrack అమ్మేవాళ్లుకూడ, arrack అమ్మడం మాకేమి గిట్టదని చెప్పితే, పోలీసువాళ్లు మీరు అమ్మవలసిందే, మాకువచ్చే మామూళ్లురావు అని వారిచేత జబర్దస్తీగా అమ్మిస్తున్నారని తెలియుచున్నది. అంతేకాక ఈ Special Armed Police లో కూడ, పోలీసు డిపార్టుమెంటులో ఉన్నవారినే వేస్తున్నారు. ఇది అంత మంచి పద్ధతికాదని నా అభిప్రాయము. ఈ Special Armed Police ప్రత్యేకంగా recruitment చేసి వారికి at least S.S.L.C. Qualification అయిన నియమించి, వారికి special training ఇచ్చి ఆవిధంగా ఈ Special Armed Police ను ఏర్పాటుచేస్తే బాగుంటుందని సూచిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

4-30 p. m.

SRI T. LAKSHMI NARAYANA REDDI :—అధ్యక్షా, ఇప్పుడు మనముందువున్న యీ పోలీసు డిమాండును బలపరచకపోవడానికి నాకు ఏమీ కారణము కనబడడము లేదు. నిజంగా యీ డిమాండును గురించిన పద్దు చాలా తక్కువని, యింతకంటె మించినదే అవసరమని నేను అనుకుంటున్నాను. ఎందుకంటే ఏ ప్రభుత్వానికైనప్పటికినీ శాంతి భద్రతలు కాపాడకపోతే దేశములో ఏదీకూడా సాధ్యముకాకుండా పోతుంది. కాబట్టి ఏ దేశమైనా నాగరికత దేశము అని చెప్పాలంటే, ప్రజలకు ముందు శాంతి భద్రతలకు తావు వుండాలి. అందువల్లనే మన మొత్తము బడ్జటులో పదోవంతు, చాలదనిన్నీ, యింకా ఎక్కువగానే ఖర్చుపెట్టవలసిన అవసరమువున్నదనిన్నీ, నాఅభిప్రాయము. దేశములోని సాధారణ ప్రజానీకము పోలీసులను యీనాడు చాలా హేయభావముతోనూ వ్యతిరేకభావముతోనూ చూస్తున్నారు. దానికి కారణము బహుశ దేశచరిత్రయే అయియుండవచ్చు. ఎందుకంటే మనము స్వతంత్రముకోసము పోరాడే రోజులలో పోలీసులు జరిపిన అత్యాచారాల్ని,

మన patriots ను కొట్టడముచూస్తే వారియందు ఒక విధమైన హేయభావం ప్రజలకు కలిగింది. అది యిప్పటికీకూడ పోలేదు. అది పోతేనేగాని గ్రామసీమలకు పోలీసులు వెళ్లినప్పుడు అక్కడ crime detection లో ప్రజలనుంచి సంపూర్ణ సహకారమువారికి లభించదు. కాబట్టి ప్రజలలో యీ భావము పోగొట్టటానికి మనము అందరము ఒక్కుమ్మడిగా కృషిచేయాలి. పైగా యీనాడు scientific methods అన్ని అభివృద్ధి చెందినందువల్ల, scientific methods లోనే యిక ముందుకూడా crime detection జరుగుతుంది. పోలీసులు crime detect చేయటానికి నవీనపద్ధతులనుకూడా ఉపయోగించి, crime detect చేస్తేనేగాని, crime పట్టుపడదని నేను అభిప్రాయపడుతున్నాను. అందుచేత పోలీసులకు తగిన training కావాల్సి వుంటుంది. కాబట్టి అనంతపురములో పెట్టబోయే కాలేజి ఒకటిచాలదు. మనరాష్ట్రంలో యింకా ఎక్కువగా Police Training Colleges పెట్టాల్సిన అవసరము వున్నది.

ఇంకొక విషయము. పోలీసులు యిప్పుడు ఏదైనా ఒక కేసు detect చేసి నేరస్థులను ఏదో విధంగా శిక్షించటానికి ప్రయత్నము చేస్తున్నప్పటికినీ అందులో నాకు అనుమానము వున్నది. పోలీసు వారి బాధ్యత, సాక్ష్యము create చేయడము మాత్రమే కాదు. కేసులుప ట్టుకున్న తరువాత ఏ కేసు ఐనప్పటికీకూడా, కోర్టుకే వదిలివేయవలసిందేననే భావము పోలీసులలో రావాలి. ఈ విధంగా పోలీసువారు నడుచుకుంటేనే ప్రజలలోవారు మంచిపేరు సంపాదించుకో గలుగుతారు. ప్రజలు కూడా వారియందు హేయభావము విస్మరింతురని నా అభిప్రాయము. ఇంకా నాకు వ్యవధి చాలనందున విరమిస్తున్నాను.

*SRI N. SRINIVASA RAO :—అధ్యక్షా, పోలీసు డిమాండును నేను బలహీనపరచలేక పోతున్నాను. ఎందుకంటే, అధ్యక్షులవారు నాకు యిచ్చిన సమయము చాలా తక్కువగా ఉన్నది కాబట్టి పోలీసు పద్దుకు హెచ్చుగా డబ్బు యిచ్చినట్లైతే చర్చకుకూడా హెచ్చుసావకాశము యివ్వటానికి Speaker గారు యికముందైనా ప్రయత్నిస్తారని వారిని నేను ప్రార్థిస్తున్నాను.

ఈనాడు రైళ్ళలోజరిగే దొంగతనాలు స్త్రీలే ఎక్కువగా చేస్తున్నారు. దీనికి బహుశ శ్రీమతి అమ్మన్నరాజాగారు ఆశ్చర్యపడ వక్కరలేదు. (Laughter) అందుచేత ఆడవారినికూడా కొంతమందిని పోలీసులుగావేసి రైళ్ళ లోని female compartments లో బేడ్రెస్సుతో వదిలితే వారు తప్పక దొంగ తనాలు పట్టుకోటానికి వీలవుతుంది. దొంగతనముకూడా చాలామటుకు నశించిపోవునని నా దృఢనమ్మకము. పోతే, ఉద్యోగస్థుల గురించి చెప్పినప్పుడు

Sri N. Srinivasa Rao] [28th July 1955

పెద్దఉద్యోగస్థులు దస్తావేజులు వ్రాసేవారు కాదు కాబట్టి, వారికి అంత పెద్దజీతాలు వుంచకుండా తగ్గించి చిన్నఉద్యోగస్థులకు జీతాలు పెంచడము జరగాలని నా సోదర సభ్యుడు సుబ్బారావుగారు చెప్పారు. అయితే యీ సందర్భములో ఒకహరిదాసు ఒక కథచెప్పాడు. నాకు అది జ్ఞాపకమువచ్చింది గనుక చెప్పదలచాను. నిజంగా ఇది కథ కాదు. జరిగినవిషయమే గనుక చెప్పవలసిన అవసరము వచ్చింది. ఆంధ్ర దేశములో తెలంగాణాలో శ్రీ సుందరయ్యగారికి దెబ్బతగిలితే, చంద్రా రాజేశ్వర రావుగారు హుటాహుటీన విమానముమీద వెళ్ళి వారిని పరామర్శ చేశారు. అదే సమయములో కందికట్ల నాగభూషణం అనే హరిజన comrade చనిపోతే, ఆయనను చూడటానికి ఆఖరుకు దున్నపోతుల బండిమీదనైనా ఏవరుకూడా వెళ్ళి చూడలేదు. కనుక యీనాడు ప్రస్తుతము పెద్దనాయకులుగావున్న సుందరయ్యగారికి ఒక special treatment వున్నదని నా ఉద్దేశ్యము. కాని అది ఎంతవరకు minimise చేయటానికి వీలుంటుందో అంతవరకు పెద్దఉద్యోగస్థులు తమజీతాలు అడగకుండా క్రింద ఉద్యోగస్థుల జీతాలు హెచ్చుచేయడం అవసరము వున్నది. ఒకేసంగతి యీసందర్భంలో చెబుతున్నాను —ఒక పోలీసు ఉద్యోగిభార్య తనభర్తతో ఏమి చెబుతున్నదంటే,

ఏమండీ, మీరు ఎప్పుడుచూచినా
సరసము విరసము జరుపుకపోరు
ముద్దు మురిపము చూపబోరు
ఎప్పుడు చూచిన ఒకటే తొందర
బెల్టు తోముట, బట్టన్సు తోముట,
పాగాకట్టుట, పట్టీచుట్టుట,
మీ బెల్టు మాత్రము నే నుపయోగించనా ?
పగలుచూడను కనబడరైరి
ఆఫ్ డ్యూటీ రోజున ఆగపడకుండా
ఎక్కడెక్కడో షికారు జేతురు
ఇంతాజేసి తెచ్చేదేమిటి ?
ఎందుకు చాలని ఇరువదిరూకలు,
బట్టలుకొనడం సున్న ।
బట్టలుకొంటే భుక్తికి సున్న ॥

ఈస్థితి వున్నది. ఇది కేవలం ఉపన్యాసాలు చేయటానికి పనికివస్తే పనికి రావచ్చునేగాని, మరి యిక్కడ finance ను బట్టి వ్యవహారము దగ్గరకువచ్చేటప్పటికి మాత్రం చాలా యిబ్బందులతో కూడుకున్నటువంటి విషయము, పోలీసువారి

quarters చూస్తే చాలామటుకు సి. క్లాసులోవున్న single cells కన్న తక్కువగా అధ్వాన్నపు స్థితిలోవున్నవి. అందులో progress ఎక్కువగావున్న పోలీసులకుగూడా అదేయిల్లు. Progress తక్కువగావుంటేకూడా అదేయిల్లు. అంటే, 7, 8 బిడ్డలువున్న పోలీసుకుగూడా అదేయిల్లు. ఒకరిద్దరు బిడ్డలతో family planning వున్నవాడికి అదేయిల్లు. కనుక యీ యిల్లుయిచ్చే పద్ధతికూడా కొంత పరిశీలించి ఎక్కువమంది బిడ్డలు ఉన్నవాడు నివసించటానికి ఆరోగ్యకరంగా వుండటానికి వీలుగా యిల్లు యిప్పించాలని అంటున్నాను.

ఇంకొక విషయము. నా మిత్రుడు లక్ష్మీనారాయణ రెడ్డిగారు చెప్పినట్లు గతంలో యీ పోలీసులు patriots కు atrocities జరిపినందువల్ల పోలీసులంటే రక్షకులు కాదు భక్షకులు అనే విషయము ప్రజలలో చాలా ప్రతీతిగావున్నది. కాని యీనాడు ప్రభుత్వమువారు పోలీసులకు ప్రత్యేకంగా ఒక moral instruction యిచ్చి, యీరోజులలో దేశభక్తిఅంటే యేమిటి యేమిచేయాలి అనేది తెలుసుకోటానికి ఏర్పాటుచేస్తే, educated people ను యిందులో పెట్టినట్లయితే, విదేశాలలోవున్న పోలీసులు వారికి సంబంధించిన generals ఆ దేశములో ఏవిధంగా ప్రజలయందు ప్రవర్తిస్తున్నారో, యీ పోలీసులు కొంతమటుకు వాస్తవముగా ప్రజలతో మంచిస్వభావముతో ప్రవర్తించటానికి వీలుంటుంది. ఈ సమయములో ఎక్కువగా పిట్టకథలు చెప్పటానికి నాకు వ్యవధిలేదు కాబట్టి ఒకచిన్న కథమాత్రము చెప్పి ముగిస్తాను.

MR. SPEAKER:—కథనా?

SRI N. SREENIVASA RAO :—కథ అంటే, కథకాదండి. ఇదుగో రెండునిమిషాలలో ముగిస్తున్నాను. ఒక పెద్దమనిషి ఒక అబ్బాయితో ఏమి చెప్పాడంటే, "ఒరే, అబ్బాయి యిటురా! నీకుచిన్న ఉద్యోగము యిస్తాను చేస్తావా," అని అడిగితే, "చేస్తాను" అని అన్నాడట. "నేను ఒక అక్షయపాత్రకొని యిస్తాను. అది వూరిలోకి తీసుకునివెళ్లి యింటింటికి తిరిగి ఆరుశేర్ల బియ్యము తెచ్చి నావద్ద జమకట్టి అందులో అయిదుశేర్లు వుంచి, ఒకశేరు తీసుకొనిపో, అదే నీ వుద్యోగము," అని చెప్పాడట. అదేమాదిరిగా "కూలీ సంఘాలని" బెజవాడలో వున్న వారిని పిలచి, వారివద్దనుంచి మూడునెలలకు ఒకరోజు కూలీవంతున మాపార్టీకి జమకట్టి, మీరు పస్తులతో మీయిళ్లకు వెళ్లండి అనిచెప్పి దెబ్బకొట్టేసోదరులు వున్నంతకాలము శాంతిభద్రతలు కాపాడటానికి, యిటువంటి అనవసరమైన strikes

[Sri N. Srinivasa Rao] [28th July 1955

రాకుండా వుండటానికి, చాలామంది పోలీసులు కావలసి వుంటారు కాబట్టి యీ డిమాండును బలహీనపరచలేక, బలపరుస్తూ నేను శెలవు తీసుకుంటున్నాను.

SRI P. SUNDARAYYA:—అధ్యక్షా, ఈపోలీసు డిమాండుమీదచర్చకు పూర్తిగా దిగటానికిముందు శ్రీసంజీవరెడ్డిగారు ప్రతివిషయముకూడా confidential అని చెప్పకుండా వుంటారని కోరుతున్నాను. దీనికి ఒక చిన్న ఉదాహరణ చెబుతున్నాను. మొన్నటిరోజున ప్రశ్నలకాలములో నేను ఒక ప్రశ్న Special Armed Police సంఖ్య ఎంత అని అడిగితే, అది తెలియపరిస్తే "ప్రజాక్షేమానికి భంగకరము, అది చాలా గోప్యం" అని అన్నారు. ఇండియాలో ఈపోలీసు ఎక్కడ లేదు ? ఒక మిలిటరీసంఖ్య గోప్యము అయితే కావచ్చుకాని పోలీసుసంఖ్యమాత్రము గోప్యముకాదని నేను ఆరోజున చెప్పాను. దానికి records కూడా వున్నవని చెప్పాను. దాని records, movements మీముందుపెట్టుతానని చెప్పాను. మన బడ్జటులోనే 209 పేజీలో Special Armed police సంఖ్య 2609 మంది అని, Lance Naiks, Commandants ఎంతెంతమంది వున్నారో, అది చదివితె తెలుస్తుంది. అన్ని వివరాలు వుంటూనే వున్నవి. ఇందులో రహస్యమేమీలేదు. ఇది బడ్జటు సాంప్రదాయము. గనుక యింటులో పెద్దరహస్యమేమీలేదు. చిదంబర రహస్యము పోలీసులకుమాత్రమువుంటే వుండవచ్చు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అదంతా ఎందుకండి అనవసరంగా ?

SRI P. SUNDARAYYA :—ఎందుకంటే, ప్రతిఒక్కరు యివన్నీ చదువలేదని వారు అన్నారు. వాటిని నేనేకాదు మంత్రిగారే చదువలేదని దాన్నిబట్టి అర్థము అవుతున్నది. మంత్రిగారికి అంతపెద్ద డిపార్టుమెంటు వుండి, ఆ విషయము బడ్జటులోవుంటే, వారు, వారుమంత్రివర్గము యిక్కడ వుండినప్పటికికూడా, ఆ విషయము తెలిసినా, తెలియకపోయినా, చెప్పటానికి వీలులేని డిపార్టుమెంటువారి దగ్గరవున్నదని అన్నమాట. అందుచేత యికముందైనా, ప్రతిదానికి, ఏదైనప్రశ్న వేసినప్పుడు జవాబు చెప్పవలసివస్తే, అది ప్రజాక్షేమానికి భంగకరము, గోప్యము, రూల్సు ఆ విధంగా వున్నవి, అని అనేకరకమైన జవాబులు చెప్పకుండా, అడిగినదానికి సరియైన సమాధానము యిస్తే మంచిదని అంటున్నాను.

ఇక రెండవ విషయము. Settlements కూడా పోలీసుశాఖక్రింద నేవున్నట్లు యీ డిమాండులో వున్నది. ఇవి మూడు ప్రదేశాలలోవున్నవి. సిద్ధాపురం, సీతానగరం, యింకోటి Stuartpuram లోని salvation army క్రింద వున్నవి. Criminal Tribes Act రద్దుచేశామని అన్నారు. కాని దీన్ని యింకొక పేరుతో settlements అని పోలీసులక్రింద నే పెట్టారు. దీని అర్థము చట్టము రద్దు అయినట్లు కనబడుతున్న దేకాని, మళ్లీ ఆచరణలో మాత్రం యీ సెటిల్‌మెంట్సు పోలీసుల క్రిందనే పెట్టుకొని జరుపుతున్నట్లు కనబడుతున్నది. అందుచేత నేను చెప్పేది యేమిటంటే, యీ సెటిల్‌మెంట్సును పూర్తిగా రద్దుచేసి పోలీసుశాఖనుంచి విడదీసి, Welfare Department అంటే వెనుకబడిన జాతులను అభివృద్ధిచేసే శాఖకుచేర్చి, వాళ్లను అభివృద్ధికి తీసుకునివస్తే మంచిదని అంటున్నాను. కాని దీన్ని యిదేమాదిరిగా వుంచితే, యింకా వీళ్లను ఆచరణలో యీ Criminal Tribes Act క్రిందనే వుంచినట్లు చెప్పక తప్పదు.

మూడవది fire stations విషయము వున్నది. వీటిని Municipal towns లోనే పెట్టుతామని మంత్రిగారు అన్నారు. ఇదిచాలదు. ప్రతితాలూకా Head-quartersలోకూడ ఏర్పాటుచేస్తేమంచిది, తాలూకాలో Headquarters లోనే కాకుండా పదిగ్రామాలు ఒక Unit గావుంచి, వాటిని అక్కడపంచాయితీ బోర్డులక్రింద పనిచేసేటట్టుగానూ, పంచాయితీబోర్డులు లేనిచోట్ల ఆ గ్రామంలోని వాళ్లను కొంతమందినిచేర్చి ఒకకమిటీగా ఏర్పాటుచేసివాళ్లకు stirrup pumps అప్పజెప్పితే చాలామంచిది. అవి చుట్టుప్రక్కల అన్ని గ్రామాలకు అందుబాటులో వుంటాయి. డబ్బుకూడ చాలా తక్కువ అవుతుంది. అగ్ని చల్లార్చేటందుకు అక్కడ సాధనాలు వుంటాయి. ప్రజలుకూడా సహాయము చేస్తారు. డబ్బు ఎక్కువఅవుతుందని అనేటట్టుఅయితే, అగ్నివల్ల వచ్చేనష్టముకన్నా దీనికి ఖర్చుఎక్కువకాదు. ఇది చాలా తేలికఅయినపద్ధతి. తేలప్రోలు అనేగ్రామంలో ప్రతిసంవత్సరము అగ్ని ప్రమాదం వుంటూనేవున్నది. ఒక సంవత్సరం ఆ గ్రామం అంతాగూడా ధ్వంసమై పోయింది. నష్టముకూడా దాదాపు ఒకకోటి రెండుకోట్లదాకాకూడ నష్టమయిందని అంచనాలు వేశారు. కాబట్టి గ్రామాలకు ఎంతచేరువలో stirrup pumps వుంటే అంత మంచిదని నా అభిప్రాయము. తరువాత fire stations వారికి యిచ్చిన equipment కూడా చాలా పురాతనమైందిగా వున్నది. కొన్నిచోట్లకు పోతూంటే ఆ కార్లు ఆగిపోవడముకూడా జరుగుచున్నది. అటువంటప్పుడు, మరల ఆ కారు బాగుచేసుకొని అగ్నిప్రమాదం జరిగేచోటుకు వెళ్ళేసరికి, అగ్నిదేవుడు తన పనికాస్తా పూర్తి చేసుకొనిపోయి యుంటాడు. నమక

Sri P. Sundarayya] [28th July 1955

వాళ్లకు modern equipment యిస్తే, యీ అగ్నిప్రమాదాలు వెంటవెంటనే నివారించటానికి వీలుంటుంది. అంతేకాని మన సుబ్బారావుగారు చెప్పినట్లు, ఈ పాత equipment తో అగ్నిప్రమాదం జరిగేచోటికి ఎన్నో యిబ్బందులతోపోయి అగ్ని చల్లార్చటానికి ఉపయోగించకపోయినా అగ్నిప్రమాదం జరిగిపోయిన తరువాత అగ్నివల్ల కాలిన గోడలుకూడా చల్లార్చటానికి ఉపయోగిస్తారేమో బహుశ అందుకు గూడా వుపయోగించ దేమోనని అనుకుంటాను.

ఇక పోలీసు విషయము. ఎన్నికలు నిష్పక్షపాతంగా జరిగినవని కమ్యూనిస్టు పార్టీతోకూడా అన్ని పార్టీలవారు చెప్పారు. ఎక్కువ ప్రాంతములో పోలీసులు నిష్పక్షపాతంగా ప్రవర్తించారని కొన్ని కొన్ని ప్రాంతాలలో భూస్వాములుచేసే ఆగడాలు తగినంతగా అరికట్టక చూస్తూవుండబట్టి నిజముగా నిష్పక్షపాతంగా అక్కడ ఎన్నికలు జరుగలేదని మేము ఎన్నికలరోజుల్లో చెప్పాము. తరువాతకూడా చెప్పాము. దానిని మేము మార్చుకోవలసిన అవసరములేదు. అయినా మేము ఎన్నికల సందర్భంలో జరిగిన ఘటనలు గురించి ఈ రోజున చర్చలో తీసుకురాదలుచుకోలేదు. ఉదయము ఈ పోలీసు డిమాండును గురించిన చర్చలో మార్చిలో పోలీసులుచేసిన ఘటనలనుగురించి కాంగ్రెసుసభ్యులు కొంతమంది చెప్పారు. ఎన్నికలలో పోలీసులు తగిన రక్షణఇవ్వలేదు, పోలీసులలో చాలామంది కమ్యూనిస్టులువున్నారు; అందుచేత నేమాకు భద్రత లేకుండాపోయిందె అంటూ చెప్పారు. వారి దృష్టిలో అది న్యాయముగానే వుంటుంది. అయితే పోలీసులలో దురదృష్టవశాత్తు కమ్యూనిస్టులులేరు. ఎందుకంటే, భూస్వాములకు తగినంతరక్షణ ఇవ్వలేదు, వాళ్లుచెప్పినట్లుగా ప్రజల మీద ఇంకా అక్రమాలు చేయలేదు, దౌర్జన్యాలు చేయలేదు, నిష్పక్షపాతంగా చాలామంది ప్రవర్తించారని వారికి కోపము అనుకుంటాను. ఈ రీతిగా కాంగ్రెస్ వారు చెప్పడము జరుగుతోంది. ఎన్నికల సందర్భములో అనేకమంది పోలీసు వుద్యోగస్థులమీద (చిన్న చిన్న కానిస్టేబుల్సుమీదనే కాదు) అనేక Dy. S. P.ల మీదకూడా వాళ్లు కమ్యూనిస్టు Dy. S. P. లు అని చెప్పి రిపోర్టులు పంపిన సంగతి మంత్రిగారికి తెలుసు. అందరికీ తెలుసు. ఒక్క ఉద్యోగి అయినాసరే నిష్పక్షపాతంగా ఈ భూస్వాములుచేసే ఆగడాలను సహించక, వాళ్ళ బెదిరింపులకు లొంగకుండా వాళ్ళ అగడాలకు దారిఇవ్వకుండా ఉద్యోగధర్మము ప్రకారం న్యాయంగానడిస్తే అతను కమ్యూనిస్టు అవుతాడు. అంటే దాని అర్థముఏమిటి? పోలీసులు ప్రభుత్వయంత్రము అంతాకూడా భూస్వాములు, పెత్తందార్లు చెప్పినట్లుగాచేస్తే వాళ్లు మంచివారు. వాళ్లు సక్రమంగా తమ ఉద్యోగ

ధర్మమును నిర్వర్తించినట్లయితే, న్యాయంగా, నిష్పక్షపాతంగా అత్యధిక ప్రజలకు కావలసిన రీతిగా ప్రవర్తిస్తే వారంతా కమ్యూనిస్టులు అవుతారు. ఇది అంతా కమ్యూనిస్టులకు నిర్వచనము అయితే నాకేమీ అభ్యంతరము లేదు. ఆ రకంగానే ఇంకా చాలామంది కమ్యూనిస్టులు ఈ పోలీసు శాఖలోను యింకా యితరశాఖలలోను వుంటే దేశానికి చాలామంచిదని నా అభిప్రాయము.

అయితే మంతెన వెంకటరాజుగారు పోలీసులు తగినరక్షణ ఇవ్వలేదనిచెప్పారు. కమ్యూనిస్టుల ప్రమాదాలనుండి రక్షణ యివ్వలేదని అనేక ఘటనలు చెప్పారు. నేను వాటన్నింటిలోకి వెళ్లడము లేదు. ఆయన బహుశః కమ్యూనిస్టులకు భయపడి కాబోలు తన గ్రామములో బ్రహ్మాండమైన కోటగోడ కట్టించుకొని అందులో నివసిస్తున్నారు. తప్పకుండా ఆ కోటగోడలోపల (ఇప్పుడు లేకపోతే) ఒక పోలీసు స్టేషనుపెట్టి వారికి ఇంకా కొంతగ్రామాన్ని ఆక్రమించుకొనే దానికోసంకూడా తోడ్పడుతారేమో సంజీవరెడ్డిగారిని ఆలోచించమని చెప్పి కోరుతున్నాను.

అదేరీతిగా మేకా కోటిరెడ్డిగారు నీరుకొండ గ్రామంలో కమ్యూనిస్టులు కుప్పలు తగులబెట్టారు అన్నారు. దీనికి వేముల కూర్మయ్యగారే తగిన సమాధానం చెప్పారు. అది కమ్యూనిస్టులు తగులబెట్టింది కాదు. 10, 15 యేండ్లుగా ఆ వూరిలో రైతులు కమ్యూనిస్టులు, కాంగ్రెసువారు ఇద్దరూకూడా కలసి హరిజనులకు వారికి తగాదాలు వుండడమువల్ల, ఆ వ్యవసాయ కూలీలమీద సాధిస్తున్నారని చెప్పారు. అయినా ఎట్లాగైనా ఈ కేసును కమ్యూనిస్టులమీద రుద్దాలని ఆ విధంగా చెప్పారు. కొన్ని కొన్ని గ్రామాల్లో ఈ కులతత్వాలు హెచ్చిపోయినప్పుడు ఈ విధముగా రైతాంగము అంతా కలిసి వ్యవసాయ కూలీలమీదపడి దౌర్జన్యము చేసిన ఘటనలు చాలా వున్నాయి.

నెల్లూరు తాలూకాలో నిడుముసరిగ్రామం వున్నది. అక్కడ కూలీలు, రైతులు వూళ్ళో కో-ఆపరేటివు సొసైటీద్వారా తీసుకొన్న యంత్రాన్ని నాశనము చేశారు. ఈ రోజున ఆ వ్యవసాయ కూలీలవద్దనుంచి 3 వేల రూపాయలు వసూలు చేయమని ప్రభుత్వము చెప్పింది. ఇళ్ళు జప్తికూడా చేయడం జరిగింది. అది మంత్రివర్గము తిరిగి ఆలోచిస్తుందని అనుకుంటాను. నాశనం చేసింది రైతాంగము. ఆ రైతులపార్టీనాయకుడు నాతో స్వయముగా చెప్పారు. అయితే దీని ఖరీదును వ్యవసాయకూలీల దగ్గరనుంచి తీసుకోవడం జరుగుతోంది.

Sri P. Sundarayya] [28th July 1955

ఆదేరీతిగా తెనాలితాలూకాలో, జరిగింది. రేపల్లె తాలూకాలో నల్లూరిపాలెం అనే గ్రామంమీద ఆ వ్యూళ్ళోవున్న రైతాంగము వెళ్లి దాడి చేసినారు. తరువాత అన్నిపార్టీలుకలసి అది అన్యాయము, అక్రమము అని ఎదుర్కొబట్టి కొంతవరకు ఆగింది. అటువంటి ఘటనలు ఎన్నోవున్నాయి. ఇటువంటి ఘటనలు అన్నీ తీసుకొని కమ్యూనిస్టు పార్టీమీద రుద్దడము అనేది, ఏ రాయవేసినా సరే, ఏది జరిగినా సరే కమ్యూనిస్టులమీద వేస్తే పోతుందని చెప్పే ధోరణివల్ల ఎవరికి ఏమీ పెద్ద వుపయోగము వుండదు. ఎవరినీకూడా మీరు సంతృప్తి పరచలేరు.

కాకాని వెంకటరత్నంగారు ఇంకా కొంతమంది సభ్యులు ఎక్కడచూచినా కమ్యూనిస్టులు కుప్పలు తగులబెట్టారు, వాములు తగులబెట్టారు అని చెప్పి ఒక జాబితా చదివారు. నేను వారికి చెప్పేది ఏమిటంటే ఈ అనవసరమైన జాబితాలవల్ల వుపయోగము లేదు. మమ్ములను అడవులలోకి కొట్టి, నాశనం చేయాలని పూనుకొన్నప్పుడు ఆ రోజు దానికి ప్రతీకారంగానూ మీద దౌర్జన్యములు చేసినవాళ్ల కోసం, దౌర్జన్యమును దౌర్జన్యంతోనే ఎదుర్కోవాలి అనేదాంట్లో, ఇంకా ఏమీ మార్గము లేనప్పుడు భయపడకుండా అనేకము చేశాను. ఆ సందర్భంలో కొంత మంది భూస్వాముల కుప్పలు తగులబడ్డాయి. కాని ఆ కార్యక్రమమువల్ల లాభము లేదు. వాళ్ళు దౌర్జన్యముచేస్తే ప్రజలే విసుగెత్తి తిరగబడాలిగాని ఏ కొంత మందో కమ్యూనిస్టులు తిరగబడితే లాభము లేదు, అందుచేత మనము చేయ వలసింది ప్రజల్లోకి వెళ్ళి, వాళ్లకు అన్నిసంగతులు నచ్చ చెప్పడము, వాళ్ళు భరించ గలిగినంతవరకు భరిస్తారు. లేనప్పుడు వాళ్లదారి వాళ్లు చూచుకుంటారు అని అనుకున్నాము. ఈ దొంగ పద్ధతులతో కుప్పలు తగుల బెట్టడము వాములు తగులబెట్టడము, కమ్యూనిస్టులు ప్రోత్సహిస్తున్నారన్న మాట శుద్ధ అబద్ధము. మేము చేయదలచుకుంది చేస్తాము. ఇక్కడ శాసనసభల్లో వుండి మాట్లాడుతూ, గ్రామాల్లో రహస్యంగా కుప్పలు తగులబెట్టించాల్సిన అవసరము మాకులేదు. ఆ పరిస్థితులువస్తే మేము ఇక్కడ, ఎక్కడాకూడా కనిపించము. మమ్ములను మీరే వుండనివ్వరు. 1944-50 లో :మాదిరిగా వుండనివ్వరు. ఆ పరిస్థితులు లేనప్పుడు గ్రామాల్లో వాళ్లు వాళ్లు తగాదాలు పెట్టుకొని, కుప్పలు తగులబెట్టుకొని పెట్టే కేసులు అన్నీ కమ్యూనిస్టులమీద పెట్టడము శుద్ధ పొరపాటు అని నేను కమ్యూనిస్టు పార్టీ తరఫున చెబుతున్నాను. ఏ గ్రామంలోగాని, ఏ కుప్పఅయినాగాని, ఏ వాములు

28th July 1955] [SRI P. Sundarayya

అయినా గాని తగులబెట్టడము అనేది మా కార్యక్రమము కాదు. ఆ రకంగా తగుల బెట్టుతున్న ప్రదేశాల్లో మేము వచ్చి ప్రజలకు సహాయంచేసేదానికి ఎప్పుడూ తయారుగానే వున్నాము. భూస్వాములను సాధించేదానికోసం ఒక కుప్పను రెండు కుప్పలను తగులబెట్టితే అయ్యేది కాదు. దానికి ప్రజలను అందరిని సమీకరించాలన్ని చెబుతున్నాను. ఇప్పటికైనా సూచించిన పేరుగల నేరాలు అనేకము వున్నాయి, వేయవచ్చును. ప్రభుత్వాధికారం మీ చేతుల్లో వున్నది కాబట్టి మీకు కావలసిన చర్యలు మీరు తీసుకోవచ్చును. లేనిపోనివన్ని కల్పించి ఇవన్ని కమ్యూనిస్టులే చేస్తున్నారని చెప్పి తప్పించుకోవాలనిచూస్తే మాత్రం ఏమీ వుపయోగము వుండదని చెబుతున్నాను.

ఈరోజు ఈ పోలీసు డిమాండుపైన చర్చ జరుగుతున్నప్పుడు మొదటినుంచి చివరివరకు ఎందువల్లవున్నానంటే కాంగ్రెసుసభ్యులుకమ్యూనిస్టులమీదఎంతజోరుగా బండినడుపుతారో చూడాలని ఓపిగ్గా కూర్చున్నాను. తొందరపడకండి. వాళ్ళయిష్టము వచ్చినట్లు బండితోలనివ్వండి అని మా సభ్యులకు అందరికీ చెప్పాము. ఏమైనా సమాధానాలు చెప్పదలిస్తే నేను చెబుతాను, మీరుమాత్రము ఏమీ చేయకండి, అని వాళ్లకు చెప్పాను. మామూలుగా కమ్యూనిస్టు అనే పదము విని భయపడేవారు కొంతమంది తప్పితే మిగిలిన అనేకమంది కమ్యూనిస్టుల సంగతి తీసుకు రానందుకు, అదేకలిగా నాయకులుకూడా కమ్యూనిస్టులమీద అనవసరంగా బండితోలితే వాళ్లకు ఉపయోగంలేదని సలహాఏమైనా చెప్పారేమోనని అనుకోవలసి వస్తున్నది. పోలీసులను గురించి అనేక ఘటనలు జరిగాయి. ఆ ఘటనలన్నింటినీ నేను ఏకరువు పెట్టదలచలేదు. కొన్ని కొన్ని మీదృష్టికి తీసుకురావడము అవసరము. అవి మీదృష్టికి వచ్చేవుండవచ్చును. పత్రికలలో పడనటువంటి విషయాలులేవు. శాసనసభ్యులు, కాంగ్రెసు మంత్రులు అందరూ కూడా ఒకపర్యాయము వాటినిగురించి జాగ్రత్తగా చూచి అటువంటి ఘటనలు జరగడము ఎవరికి ఉపయోగముకాదని గుర్తించడం మంచిదే. ఆఖరికి కమ్యూనిస్టులను అణచడానికికూడా disciplined workers కావాలిగదా? సభ్యము లేనటువంటి ఘటనలు కొన్ని సంఘటనలను మాత్రమే మీముందు పెట్టుతున్నాను.

మార్కాపురం తాలూకా నరజాముల తండాలో కమ్యూనిస్టులున్నారని పోలీసులు వెళ్ళి తండామీదపడి అంతా వెతికి సోదాచేసి [illegible] చేశారు. ఇది మార్చి 31 వ తేదీ ఆ ప్రాంతంలో జరిగింది. [illegible] ప్రజలు, లంబాడీ ప్రజలు పారిపడి కమ్యూనిస్టుల [illegible]

SRI P. Sundarayya] [28th July 1955

ఎన్నికలలో వారికి వోటుయిచ్చారని చెప్పి ఒక గ్రామమునసబు ప్రోద్బలముతో పోలీసులు ఇలాచేస్తే, అది ఎంతవరకు న్యాయము ? కమ్యూనిస్టులు బయటవున్నారు, వాళ్లమీద చేయగలిగితె చేయండి. అంతేగాని వెనుకబడిన మాలప్రదేశములో వున్న తండామీదకు దాడిచేయడము ఏమిటి ?

తమిరిశలో ఎన్నికలు అయినరోజు రాత్రి పోలీసులు మాలపల్లిమీద దాడిచేసి కుండలు సామానులు పగులగొట్టి స్త్రీలను తిట్టారు. పోలీసులు వస్తూవుంటే పురుషులు తప్పుకున్నారు. తెల్లవారేసరకు స్త్రీలను నిలవేసి తిట్టుట మొదలు పెట్టినారు. కొంతమంది ఏమిటచంగులు కూడా తీశారు కాని దానినిగురించి ప్రభుత్వము ఏమీ చర్య తీసుకోలేదు.

తరువాత పల్లెపట్రు పంచాయతీలో నడిజామున పేడకుప్పలువేస్తే అసహ్యముగా ఉన్నదని ఒక భూస్వామికి వాటిని తీసివేయడంటే, తీసివేయకపోతే పంచయతీబోర్డు అధ్యక్షుడు వాటిని తీయడానికి వెళ్ళితే పోలీసుకు రిపోర్టుచేసి వచ్చి అధ్యక్షుని arrest చేశారు. అతనిమీదను ఇంకొక 5 గురిమీదను కేసులుపెట్టారు. కేసులు జరుగుతూ ఉన్నవి. కాని రామాచార్యులవారు కళ్యాణదుర్గంలో పెద్ద మనుష్యులను అవమాన పరిచారు కమ్యూనిస్టుపార్టీకి చేరిన పంచాయితీ బోర్డు అధ్యక్షుడుఅన్నారు. వాస్తవము కాని పన్నులు కట్టకుండా ఎకవేయడము పెద్దమనిషి తరహానా ? దానిని వసూలు చేయడానికి వెళ్ళినపుడు పోలీసువాళ్ళకు సహాయము చేయడానికి బదులు అక్కడ Inspector-General అనుమతితో, పన్నులు వసూలు చేస్తున్న వారిని arrest చేయడము పోలీసులకు సబబుకాదు. అయితే కమ్యూనిస్టులుగాని లేక యితరులుగాని పన్నులు వసూలు చేయుచున్నప్పుడు పోలీసువారు సహాయము చేయుటకు బదులు arrest చేయడము ధర్మమా ?

బుక్కపట్టణములో చాలా కేసులు ఉన్నవి. ఎలగ్గారి నారాయణ అనే మనిషి త్రాగినాడని కేసుపెట్టి రుజావు చేయుటకు ఏమీ కొరకక రక్తపరీక్ష చేస్తేనే గాని తెలియదని చెప్పి మూడు తులములు రక్తముతీసి పరీక్షకు పంపించారు. ఇది న్యాయమా అని అడుగుచున్నాను.

తరువాత చిరుచింతల గ్రామంలోనూ పల్లెలలోనూ దాడులు జరిగినవి. వాటిని గురించి నేను ఇపుడు వివరాలలోనికి వెళ్ళడములేదు. మూడు నెలలు ఈ రకంగా జరిగిన తర్వాత డిప్యూటీ కలెక్టరు జోక్యము కల్గించుకొని జనవరి 24-వ తేదీన పరిష్కారము చేయుట జరిగినది. 3 నెలల వరకు గవర్నమెంటు నిద్రపోవుచున్నదా ? మొట్ట మొదటే ఈ పని ఎందుకు చేయకూడదు ? బరిసెలతో పొడుచుకొని దెబ్బలు తగిలిన

తర్వాతేనా జోక్యం కలిగించుకొని పరిష్కారము చేయవలసినది? తరువాత ఇంకొక విషయం విశ్వేశ్వరరావుగారు చెప్పారు. దీనిని మీముందుకు తీసుకువస్తున్నాను. శకుంతల అన్న ఆమెను మొవ్వ సమీపమునఉన్న కూచిపూడిలో రాత్రిపూట పురుషోత్తముడనే పెద్ద మనిషి స్వంతకారులో బలవంతముగా తీసుకొనిపోయి ఆమె జుట్టును కత్తిరించి బందరు దగ్గర వదిలేశారు. కాని ఆయనను arrest చేశారు. నిజమే, సంతోషమే. కాని అటువంటి సంఘటనలు జరుగుతూ ఉంటే, వెంటనే ఏమి చర్యతీసుకున్నారు? దివి తాలుకాలో జరిగినవి అనేక సంఘటనలు ఉన్నవి. వాటిని గురించి విచారణ చేస్తారని అనుకుంటున్నాను. తరువాత వేటపాలెంలో యీ మధ్యన గొంచేరు భూముల సమస్యను గురించి కొన్ని సంఘటనలు జరిగినవి. వాళ్లు 1948 నుంచి (B) form పెట్టుకొని వ్యవసాయము చేసుకుంటున్నారు. Eviction notice వాళ్ళకు లేదు. వాళ్లు మామూలుగా (B) forms కట్టి సాగుచేసుకుంటూ ఉంటే పోలీసు వెళ్ళి మీరు అన్యాయంగా భూములలో ప్రవేసించారు అని arrestలు చేశారు. గుడ్డలు విడిపించడం, గోచీలు పెట్టించడం ఏమిటి? 17 గురు స్త్రీలను 5 గురు పురుషులను arrest చేసి గుడ్డలు ఊడదీయించి గోచీలు పెట్టించడము ఏమిటి? కొటూరు యలమర్రు కేసులు జీర్ణించుకొనిపోయినవి మరచిపోలేదా? తప్పుచేస్తే పట్టుకోండి, కేసులు పెట్టండి, జైలులో పెట్టండి. అంతేకాని గుడ్డలు ఊడదీయటము, గోచీలు పెట్టించడము, కుండలు పగుల కొట్టడము, ఏమిటి?

తరువాత మరంకంచలిలో (బాపున) May 30 వ తేదీన ఒక సబ్ఇన్స్పెక్టరు తప్ప త్రాగి ముంగుతో గ్రామముమీద పడి ఇద్దరిని కాల్చారు. 14 గురు గాయపడ్డారు. స్త్రీలను, విద్యార్థులను, ఉపాధ్యాయులను ఎట్టి విచక్షణ లేకుండా అందరిని పట్టుకొని కొట్టారు. ఒక్క ప్రొహిబిషన్ వాళ్ళే అయితే ఇంతశక్తి లేదు వాళ్ళకు. ఒక్క పోలీసులే తప్పత్రాగి వెళ్లారు. త్రాగిన పోలీసులను పట్టుకుంటే వారిమీద కేసులేదు. పైగా ఎవరైనా పట్టుకుంటే వీరిమీదే కేసు వస్తుంది. ఇదేమి న్యాయము?

Arrest చేసిన తరువాత lock-upలో పెట్టేపద్ధతి ఏమిటి? స్త్రీలు ఏదో పని మీద బందరునుంచి వెళ్లుతూ ఉంటే పట్టుకోవడము, కేసులు పెట్టడము, arrest చేయడము, 2 నెలలు శిక్షవేయడముజరిగింది. అందులో శిక్షబడిన ఆమెయొక్క భర్తవెళ్లి దానిని విచారిస్తే అతనిని పట్టుకొని arrest చేసి lock-up లో వుంచారు. కేసు లేదు, విచారణలేదు. తరువాత 4, 5 రోజులుంకు కేసుపెట్టి అతనిమీద నేరములేదని వదిలితే

Sri P. Sundarayya] [28th July 1955

శారు. కాని ఆ స్త్రీలమీద కేసు అట్లాగేవున్నది. పోలీసు ఒంటికాలిమీద ప్రజల మీద లేస్తున్నారు.

అదేవిధంగా బాపట్లలో సబ్ ఇనస్పెక్టరు అర్ధరాత్రిపూట ఒక ఇంటిమీద దాడిచేసి భర్తను arrest చేసి ; స్త్రీని బూతులు తిట్టి ; తీసుకొనిపోయి జైలులో పెట్టారు. దానికి రక్షణ ఏమిటి?

అదే రకంగా కంకిపాడులో జరిగిన సంఘటనలు ఉన్నవి. అక్కడ ఒకనిని దొంగతనంచేశాడని arrest చేశారు. దొంగతనం చేస్తే కేసుపెట్టండి, శిక్షించండి. అంతేగాని కారులో తీసుకొనివెళ్ళి భూస్వాములకు అప్పచెప్పి అతనిని విపరీతముగా కొట్టడము 5 రోజులు వరకు Magistrate ముందుపెట్టకుండా, ఆఖరుకు telegram వస్తే అప్పుడు Magistrate ముందుపెడితే, ఇంకా వంటి నిండా దెబ్బలున్నాయని ఆయన చెప్పితే, అప్పుడు hospital లో join చేశారు. కనుక దానినిబట్టి Police తత్వం మారిందా? ఎందుచేత వీటన్నిటిని మీ దృష్టికి తీసుకువస్తున్నాను అంటే పోలీసు దృక్పధము మారలేదని చెప్పుటకే ఇంతవరకు కాంగ్రెసులోని దేశ భక్తులను దేశముకోసము పోట్లాడినవారిని బాధించుచుంటుటచే ప్రజలకు పోలీసు లన్న భయమున్నది. రామాచార్యులుగారు పోలీసులు అంటే యమదూతలువలె ప్రజలుకున్నదని చెప్పారు. పోలీసులంటే మిత్రులు, ప్రజలకు సేవచేసేవారు అనే భావము ప్రజలలో కలుగడములేదు. అయితే దానికి కారణము ఏమిటి? పోలీసులను చూస్తే భయము ఎందుకు? పోలీసులకు arrest చేసే అధికారము ఎందుకు? ప్రతి Constable ప్రతి Sub-Inspector, ప్రతి Headconstable, ఎవరినిపడితే వారిని arrest చేసి వాళ్ల మీద కేసు పెట్టుటకు వారికి అధికారము యిచ్చారు ముఖ్యముగా 107, 109, 110, 151 sections Statue పుస్తకముమీద ఉన్నంతకాలము వాటిని పోలీసులు అండగా చూచుకొని వారి ఇష్టప్రకారం చేస్తారు. అదే రకంగా Criminal Procedure Code లో 50 నుంచి 54 వరకు sections ఎటువంటివారినైనా వారంటు లేకుండా arrest చేసేందుకు కొన్ని పరిస్థితులలోతప్ప వీలులేదు అని ఉంటేనే బాగుంటుంది. వారలకు ఇచ్చే జీతము కొద్ది ఈజీతమును పెంచుకొనుటకు ప్రజలను arrest చేసి వాళ్ళద్వారా డబ్బుతీసుకొనుచున్నారు. Criminal Procedure Code చర్చకు వచ్చినప్పుడు ఈ sections సవరించాలని ప్రతిపాదిస్తే ముందు Law Commission వచ్చి విచారిస్తుందని డిల్లీప్రభుత్వం ఆపు చేసినది. కాని పోలీసులు అనవసరంగా arrest చేయడము చాలా కట్టుదిట్టములతో ఆపుచేయాలి. Arrest చేసే అధికారము వీరినుంచి తీసివేయాలి. వారంటు లేనిదే ఏదో నేరము జరుగభోవుచున్నదనిగాని పెద్ద

కొట్లాట జరుగుతుందన్నప్పుడుగాని, అటువంటి సందర్భములలోతప్ప, ఇతర సమయములలో పోలీసులకు arrest చేసే అధికారము యివ్వకూడదు. అప్పుడుగాని పోలీసుల దృష్టి మార్చలేము, పోలీసుపెత్తనము మార్చలేము పోలీసురాజ్యమును మార్చలేము. అందుచేత పోలీసురాజ్యము కావాలని కాంగ్రెసు నాయకులు అంగీకరిస్తారని అనుకోను. కాంగ్రెసు రాజ్యమే పెట్టుకోండి. దానికి ఎట్టి అభ్యంతరములేదు. ప్రజలు కాంగ్రెసుకు ఓటుచేస్తే కాంగ్రెసురాజ్యము ఉంటుంది. కాని పోలీసురాజ్యము ఏమిటి? ఎందుకు? దివి కొండయ్యగారు దౌర్జన్యం చేయదలచు కొన్నవాళ్లకు section 107 కాని ఇతరులకు ఇందులో ఏమి ఇబ్బంది లేదన్నారు. ఇందులో ఉన్నది ఏమిటి ? బుజాసైతే సెక్యూరిటి అంటున్నారు. అది అంతవరకు తెలుసు. కోర్టుచుట్టూ జిల్లా మూలమూలలా త్రిప్పేదానికి ఈ section ఉపయోగ పడుతుంది. తేలప్రోలులో ఎన్నికలయిన తరువాత 67 మందిమీద సెక్యూరిటీ కేసు పెట్టారు. 5 నెలలు అయినా త్రిప్పుతూనే ఉన్నారు. ఇందులో ఉండే న్యాయా న్యాయాలు లోనికి నేనుపోవడంలేదు. మూలమూలకు త్రిప్పే అధికారం ఎందుకు ఉండాలి ? తప్పుచేస్తే వారంటుమీద అరెస్టుచేయండి. sections 107, 109, 110, 151 వీటి అర్థం ఏమిటంటే ప్రతివాడు ఒక నేరస్థుడు. వానిని అదుపులో పెట్టడానికి పోలీసులు ఇక్కడ ఉన్నారు అని. ప్రజలు ఎప్పుడో ఒకప్పుడు తప్పుచేసినా సామాన్యంగా సరిగా ఉంటారు. కాని ఈ sections ప్రజలు నిరపరాధులు అనే దృష్టితో చేసినవికావు. ఇంగ్లీషు సామ్రాజ్యవాదులు పెత్తనం చేసేటప్పుడు మనమందరిని నేరస్థులుగా చేసి అదుపులో ఉంచడానికి చేసిన సెక్షనులు. ఈరోజునకూడా ప్రజ లందరిని నేరస్థులుగాచేసి అదుపులో ఉంచడానికి సెక్షనులు 107, 109, 110, 151 కొనసాగించడంలో అర్థం ఏమిటి ? శాసనసభ్యుడు నాగిరెడ్డి ఉన్నాడు. ఆయన మీద కేసులుపెట్టడానికి ఏమీ దొరకలేదు. ఆయనకు సంబంధంలేని ఊరుపోయి ఇతరులూ-పదిమందినిచేర్చి సెక్యూరిటీ కేసుపెట్టారు. శాసనసభ్యునికి ఉండే గౌరవం ఇంతమాత్రంగా ఉన్నది. శాసనసభ్యుడు తప్పుచేస్తే మేజస్ట్రేటుదగ్గరకు తీసుకు వెళ్లి కేసులుపెట్టండి. ఈ పైసెక్షనులు ఉన్నంతకాలం ప్రజల పౌరసత్వపుహక్కు లకు, ప్రజలు తలఎత్తి తిరగడానికి ఏమాత్రం సాధ్యంకాదు. ఇకపోతే అరెస్టు చేసినప్రజలను మీరు ఏరీతిగా చూస్తున్నారు ? నేను మొన్న దారిన వస్తూంటే 4 గురు పోలీసులు తుపాకులతో చుట్టూఉండి, చేతులకు సంకెళ్లువేసి నడపించడం చూచాను. ఇది ఎవరికి గౌరవం? ఏ ఆదిమశిక్షాస్మృతి ఇట్లాచేసింది ? కమ్యూనిస్టులు పారిపోవచ్చు- మామూలుఖైదీలు పారిపోతారా? ఈపశుప్రవర్తన ఇంకా ఎందుకు? బ్రిటిష్ ప్రభుత్వం

చేస్తే అర్థము ఉన్నది. మనుష్యులమాదిరిగా నడపించగూడదా? ప్రక్కన పోలీసులునడువ వచ్చును. కాళ్ళకుచేతులకు సంకెళ్లు త్రాళ్లుకట్టి తీసికోని వెళ్ళ నక్కరలేదు. Police lockup లో నుంచి తప్పించుకొని పోయేవారిని మీరు ఆపుచేయలేరు. ఆ సంగతి గురించి చర్చించనక్కరలేదు. అరెస్టుచేసిన తరువాత ఎన్నిరోజులకు ఛార్జిషీటు పెడుతున్నారు? కొన్ని కేసులు త్వరగా ముగించ కుండా వాయిదాలు, నెలలుపడతాయి. Cr. P. C. సవరణమీద ఢిల్లీలో చర్చించి నపుడు ఒక చిన్న సవరణ అంగీకరించినారు కాని ఇంకొక అడుగు ముందుకుపోయి ఉండవలసినది. ఛార్జిషీటుపెట్టిన తరువాత 6 వారాలలో కేసు పూర్తికాకపోతే అతనిని bail మీద విడుదల చేయవలసియుంటుంది. ప్రత్యేకమైన కారణాలు ఉంటే తప్ప, ఏ కేసుఅయినా bail ఆరువారాలు ఇవ్వాలనిపెట్టారు. అరెస్టు చేసిన తరువాత ఛార్జిషీటు ఒకవారంరోజులలో పెట్టాలి, ఇంకా ముందుగానే పెట్టవచ్చు. వారంటు లేకుండా అరెస్టుచేయకూడదు. ప్రత్యేక పరిస్థితులలో అరెస్టుచేసిన వెంటనే ఛార్జిషీటు పెట్టాలి. వారంరోజులలో పెట్టకపోతే ఏ కేసు నైనా త్రోసి పారెయ్యాలి. దానిమీద ఎంక్వయిరీ చేయించవచ్చు. ఈ రకంగా కాకపోతే అరెస్టుచేస్తేవారు జైలులో సంవత్సరాలు ఉంటారు. ఈ జైలులో ఉన్న కాలంఅంతా శిక్షలో లెక్కవేయరు. ఈ పద్ధతిలో పోకుండా మన శిక్షాస్మృతిని బాగుచేయాలి. పార్లమెంటులో అనేక విషయాలు అడగ వచ్చును. ఎలిమెంటరీస్కూలు గురించికూడా అడగవచ్చును. ప్రజలమీద పోలీసులు జరుపుచున్న అత్యాచారాలు, అన్యాయాలు గురించి మాత్రము అడుగ కూడదు. పోలీసుడిపార్టుమెంటు మాకేవరకు శాసనసభలో చేయవలసింది ఏమిలేదు. పోలీసులుచేసే అన్యాయాలు గురించి మాత్రమే అడుగుతూ, మిగిలిన ప్రశ్నలను వాయిదావేయాలి, అప్పటికైనా పోలీసు డిపార్టుమెంటు కొంచెమైనా బాగుపడు తుంది అనేదానిలో నాకు నమ్మకంలేదు. కొన్ని సందర్భాలలో కొందరు మంత్రులు గ్రామాలకు వెళ్ళినతరువాత క్రొత్తకేసులువస్తున్నాయి. తెనాలి తాలూకా కొల్లూ రుకు ఒక మంత్రిగారు వెళ్ళినతరువాత అంతకుముందులేని క్రొత్తకేసు వచ్చింది. ప్రజలు అనుకునేది ఏమిటంటే మంత్రులు వెనుకఉండి, ప్రోత్సహించి క్రొత్తకేసులు పెట్టిస్తున్నారని. నాకు తెలిసిన information బట్టి చెప్పుతున్నాను. కల్లూరు చంద్రమౌళిగారు కొల్లూరువెళ్ళిన తరువాత ఇవాజరిగింది, అదేరీతిగా కల్యాణదుర్గంలో సంజీవరెడ్డిగారు ఒక ఉపన్యాసంలో చెప్పారు. ఉపన్యాసంలో చెప్పింది చదువు తాను; వారు ఆ విధంగా చెప్పినట్లు అంగీకరిస్తేచాలు. ఎర్రిస్వామిగారు మా కమ్యూనిస్టు; ఆయన సంజీవరెడ్డిగారు ఈ విధంగా మాట్లాడారని వ్రాశారు.

"కమ్యూనిస్టులను బలప్రయోగంతో ఎదుర్కోండి; కొంతమంది మరణించినా భయ పడవలసిన అవసరంలేదు. అవసరమైన పోలీసు సహాయము ఇస్తాము" అని చెప్పారని వ్రాశారు. సంజీవరెడ్డిగారు శాసనసభలోను చెప్పారు, ఇతరులు తన్నుతుంటే బల ప్రయోగం చేయవచ్చునని ఇతరులుతన్నుతుంటే ఊరుకోకూడదని, ఆత్మరక్షణచేసుకో వాలని అది కాంగ్రెసువారికి కమ్యూనిస్టులకుకూడా వర్తిస్తుందని. కాని అది బాధ్యతా యుతంగా ఉండవలసిన మంత్రిగారు చెప్పవలసినమాట కాదు. మంత్రిగారుచెప్పినా, చెప్పక పోయినా. ఎవరికి తోచిందివారు చేస్తారు. నన్ను చంపవస్తే నేను ఊరుకోను, మిమ్ములను చంపవస్తే మీరు ఊరుకోరు. కాని మంత్రిగాఉంటూ ఇటువంటిమాటలు చెప్పితే దీనిని అవకాశంగా తీసికొని మంత్రిగారు చెప్పారు కదా అని, పోలీసు సహాయం లభ్యంఅవుతుందికదా అని, కొంతమంది భ్రమ పడి, దుశ్చర్యలు చేయడానికి అవకాశం ఇచ్చినట్లు అవుతుంది. దీనికి బాధ్యత మంత్రి గారు తీసుకోవలసి ఉంటుంది; బాధ్యత తీసుకుంటారనుకోండి. అది న్యాయంకాదు, సరికాదనిమాత్రమే అంటున్నాను. పోలీసుల విషయమై రామాచార్యులుగారుచెప్పిన దానితో నేను ఏకీభవిస్తున్నాను. పోలీసు కానిస్టేబిల్సుజీతాలు ఎక్కువ చేయాలని అంటున్నాను. రు. 30 లు జీతం, ఇంకా allowances ఇస్తున్నాము అంటు న్నారు. ఈ వేషం మీరు వేసుకోవాలని అన్నారు కాబట్టి దానికి ఖర్చు మీరే ఇచ్చు కోవాలి. Uniform వేయాలంటే మీరు ఇచ్చుకోవాలి మామూలు బట్టలతో రావచ్చు నంటే వారు, ఆవిధంగా రావచ్చును. ధోవతులు అవసరం లేదు, గోచీలతో రావచ్చునని వేటపాలెం వారికి ఎలా చెప్పారో అలా చెబితే గోచీలతో వస్తే సరిపోతుంది. మీరు uniforms తో రావాలని చెబుతూ, దానికి ఇచ్చే allowances జీతాలక్రింద జమకట్టడం న్యాయంకాదు. ఇండ్లు విషయం తీసుకుంటే, ఈ pigeon holes, పావురాలుగూళ్లు ఎన్నివాళ్లు? పావురాలగూళ్లు అంటే పావురాలపేర్లు చెడగొట్టడం అవుతుంది, వీటిని గబ్బిలాలగూళ్లు అంటే సరిపోతుంది. క్రొత్తగా ఏదో ఇంగ్లీషుపద్ధతిమీద barracks కట్టుతున్నారు అంటున్నారు. ఈ గబ్బిలాల గూళ్లను త్వరగా నాశనంచేసి, నివసించడానికి పనికివచ్చేరీతిగా 2 గదులలో, ఒక పెరడుతో కొంత privacy ఉండేట్లు—వాళ్లు పశువులు, గబ్బిలాలు కారు అనే రీతిగా—కట్టవలసి వుంటుంది.

ఈ పోలీసు constables కు గాను యిండ్లుకట్టేదానికై డబ్బు sanction చేయవచ్చును. ఐతే పోలీసు Department లో దుర్వినియోగము జరుగుచుండడం లేదా అంటే జరుగుతున్నది. ఇది ప్రతి Department లో కూడా వున్నది. ఈ డెప్యూటీ కలెక్టర్లు Dy. S. P. లు ఎందుకో అర్థము కావడములేదు. ఈ దొంతర

Sri: P. Sundarayya] [28th July 1955

తీసి పారవేస్తే కొంతకు కొంత కలసివస్తుంది, ఇంక more efficient గా అన్ని శాఖలలోనుకూడా పని జరుగుతుంది. ఈ ఒక్క శాఖనుగురించే కాదు నేను చెప్పేది. వొంతరులు ఎంత ఎక్కువైతే పరిపాలన అంత అవభ్రష్టంగా జరుగుతుంది తప్పితే ఇంకొకటేమి కాదు. ఎంత తగ్గడానికి వీలువుంటే అంత తగ్గించవలసి వుంటుంది. కొన్ని కొన్ని ప్రాంతాలలో పోలీసు డిపార్టుమెంటులో యీ constables కు యింత యిస్తున్నామంటున్నారు. ఎక్కడనో వాండ్లను పెట్టి 40 రూపాయలు యిస్తే ఆ జీతము చాలదని మేము చెప్పుతున్నాము. ఎవరికికూడా కనీసము starting 50 రూపాయలకంటే తక్కువ వుండకూడదని మేము చెప్పాము. జీతముతో బాటు కొన్ని allowances యిస్తూవుంటారు. ప్రయాణముచేస్తే మైలుకు మూడు అణాలు యిస్తారు లేక bus fare యిస్తారేమో? వాండ్లెక్కడైన వెళ్లితే రోజుకు 12 అణాలు యిస్తారు. 12 అణాలతో రెండుపూటలు తిండితినమనా లేక ఒక పూట తిండి తినమనా? ఏమి చేయమని? బయటికి పంపించినపుడు అక్కడ భార్య వంటచేసేది లేదు. హోటల్‌లోనే తినాలి. ఈ హోటల్‌లో తిండి 12 అణాలకు రెండు పూటలు పెట్టుతారా? ప్రభుత్వమేమైన ప్రతిగ్రామములోను పోలీసులకుగాని చిన్నచిన్న బంట్రోతులకుగాని వాండ్లు వెళ్లినచోట్ల అంతా వాండ్లకు ప్రత్యేకంగా పూటకు 6 అణాలు చొప్పున భోజనము పెట్టడానికి ఏమైనా ఏర్పాటు చేసినారా? ఎప్పుడో ప్రాతకాలపు పద్దును పట్టుకొని అటులనే కూర్చుంటారా? పెద్ద పెద్ద ఉద్యోగస్థులకు మాత్రము వాండ్లకు యిచ్చే జీతాలుకాక రోజుకు 15 రూపాయలు మైలుకు 10½ అణాలు యీ రకంగా బత్తాలు యివ్వడము జరుగుతుంది. మైలుకు 8 అణాల చొప్పున అదనముగా బత్తా ప్రయాణపు ఖర్చుల క్రింద యిస్తున్నారు. First class fare కాక రోడ్డు milage 9 అణాలచొప్పున యివ్వడానికి తయారుగా వుంటారు. కాని పోలీసులకు మాత్రం 0-8-0 యిస్తారు. పోలీసులకుకాని, ఆ హోదాలోఉన్నవారందరికికూడా అదే మూడణాలు, 12 అణాలు బత్తాయిస్తున్నారు, అందుచేత 12 అణాల బత్తా తీసిపారవేసి వాండ్లు ఒక వూరికి వెళ్లినట్లైతే వాండ్లకు జీవించడానికి రెండు రూపాయలు బత్తాయిస్తే రెండు పూటలా శుభ్రముగా తినడానికి వీలువుంటుంది. 40 రూపాయలు వచ్చే Head Constable కు మాత్రమురెండురూపాయలు యిస్తున్నారు. 30 రూపాయలు వచ్చే constable కు మాత్రము 12 అణాలు. ఏమి 10 రూపాయలలోనే రంగు మారిపోయిందా? అందుచేత ఏమిటంటే ఏరీతిగ చూచినా న్యాయము లేదు. పైగా అనేక special duties కోసము కర్నూలుకు వస్తారు. ఇక్కడ city allowance యిస్తామంటున్నారు. City allowance యిచ్చేటపుడు ఇక్కడ నివసించేవారికి ఖర్చులు ఎక్కువ అయినాయి

కాబట్టి కొంత ఎక్కువ యిస్తామంటారు. కాని ఇక్కడవున్న మరికొంతమంది పోలీసులకుమాత్రము ఎందుకు యివ్వలేము. ఇతర జిల్లాలనుంచి వచ్చేవాండ్లకు రు. 1-2-0 యిస్తూవుంటారు. ఈ 1-2-0 లకు ఏ విధంగా వాండ్లు తిండితినాలి? ఏ విధంగా బ్రతుకాలి? ఇక్కడ యిచ్చే బత్తాలు కూడా వాండ్లకు ఎందుకివ్వరు? City allowance క్రింద ఇచ్చేటటువంటిది బయటనుంచివచ్చినప్పుడు ఎందుకుగాను ఇవ్వరు? ఇది temporary కావచ్చును. 10 రోజులు కావచ్చును, 15 రోజులు కావచ్చును. ఇవన్ని కూడా మేము పోలీసులలో సానుభూతి సంపాదించేదానికోసము ప్రచారము చేస్తున్నామని అంటారు. ఒకవేళ ఆ ఉద్దేశములతో చేస్తే తప్పేమిటి? మీరు ఇవ్వండి, మీవైపే వుంటారు వాండ్లు. గోపాల రెడ్డిగారు general discussion లో మాట్లాడుతూ ఈ చిన్న ఉద్యోగస్థుల జీతాల గురించి చెప్పడము మా సాంప్రదాయమై పోయింది, డబ్బు లేదని చెప్పడము మా సాంప్రదాయమై పోయింది అన్నారు. హృదయ ఆవేదనతో వాండ్లు ఏడుస్తూ కన్నీరు కారుస్తూ వుంటే మీరుకూడా కన్నీరు కార్చి ఆ కన్నీరుతో మీ కన్నీరు కలుపుతారని చెప్పారు. పోనీ ఆ ఆవేదనతో వాండ్ల కన్నీరుతో మీ కన్నీరు కారుస్తూ ఆచరణలో చేయగలిగిన అధికారము మీకున్నది. కాబట్టి కనీసము తక్కువ జీతాలు వచ్చేవాండ్లకు యీ చిన్నవాటిని చేయడము అవసరమని చెప్పుతున్నాను. ఈ చిన్నవాటికి లక్షలు కాదు కోట్లుకాదు. ఆఖరుకు మీరు పోలీసులలో ఏవైనా జీతాలు పెంచితే మేము చెప్పినాము కాబట్టి పెంచినారు అని వాండ్లు అనుకుంటారేమో కాని మేము అనుకోము. ఒకవేళ అనుకున్నంత మాత్రాన వచ్చిందేమిలేదు. వాండ్లు బీదలుగా ఉన్నారు కాబట్టి చేయమంటున్నాము. జీతాలు వాండ్లకు యిచ్చినా యివ్వకపోయినా అరెస్టుచేసే అధికారము, దెబ్బలుకొట్టే అధికారము వాండ్లకువుంది కాబట్టి వాండ్లకు నూరురూపాయలో డెబ్బైరూపాయలో యిచ్చిన కనీసము యీ ప్రజలమీదపడి దోచుకునే తత్వము అప్పటికైనా ఆగిపోతుందేమో! అందుచేత ఆ ప్రజల దృష్టితో చూచిన వాండ్లజీతాలు ఎక్కువచేయడము మంచిది. అందుచేత యీ దృష్టితో చూచిన చిన్నచిన్న ఉద్యోగస్థులకు ముఖ్యంగా పోలీసు constables జీతము ఎక్కువచేయడము అవసరము. ఆఖరుకు నేను చెప్పేది ఏమిటంటే యీ పోలీసు దృక్పధాన్ని కొంచెము మార్చవలసి వుంటుంది. యీరోజు పలుకుబడి గలిగిన కాంగ్రెస్ నాయకులు లేకుంటే శాసనసభ్యులు ఏ కొద్దిమంది పెత్తనందార్లో భూస్వాములో వాండ్లుచెప్పే మాటలకు లొంగిపోయి వాండ్లకు కావలసిన దానిని పోలీసు ఉద్యోగులు చేయమని ఒత్తిడి తీసుకురావడము జరుగుతుంది. వాండ్లను ప్రజల సేవకోసము పనిచేసే అలవాటు చేసుకునేటట్లుచేస్తే అది మంచిది. భూస్వామి పెత్తనందార్ల పలుకుబడి గలవాండ్లను రక్షించుకోడానికి పోలీసులను పెట్టుకున్నాము

మా ప్రభుత్వ విధానమే ఇది, మా ప్రభుత్వ యంత్రముయొక్క ఆ దేశమే యిది, మా ఆశ్రయిమే ఇది, అందుచేత మీరేమిచెప్పినా ఏమి లాభము లేదంటారా? ఆరీతిగా వారుగాని, మీరుగాని, మేముకాని పోలీసులచేత ప్రజలమీద పెత్తనము చేయిస్తున్నంత కాలము అది పోలీసురాజ్య మౌతుంది కాని ప్రజలరాజ్యమేమికాదు. ఆ రీతిగా చేసినపుడు ఏ దేశముకూడా ముందుకు పోవడము అనేది అసంభవముగా వుంటుంది అనేది మీరు గుర్తిస్తారు అని అనుకుంటాను. అందుచేత పోలీసులలో యీరోజున వున్నటువంటి యీ ప్రజలమీద దౌర్జన్యముచేసే తత్వాన్ని మీరు ఎంత త్వరగా మానిపిస్తే అంతమంచిది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అధ్యక్షా! యీ Demand యింత చల్లగా అసెంబ్లీలో చర్చింపబడుతుందని నేను అనుకోలేదు. ఇంత చప్పగా యింత చల్లగా వుంటుందని తెలిస్తే యిన్ని files రాత్రంతా చదివే వాడిని కాను. ఈ files లో వున్న విషయాలు కాని లేదా cut motions లో యిచ్చిన విషయాలు కాని ఏవీ చర్చకే రాలేదు. అందరూ నిందించలేకపోయినా వ్యతిరేకించ లేకపోయిన సూచన ప్రాయముగా చెప్పినారే కాని మరీ వెగటుగా వుండేటట్టు కాని లేక ఏదో department ను కించ పరుచాలనిగాని విమర్శ చేయక పోవడము చాల సంతోషకరమైన విషయము. కొన్ని లోపాలు లేవని నేను మాత్రము అంటానా? లోపాలు వున్నాయి. ఆ లోపాలను సవరించుకోవాలనే విషయాన్ని గురించే మనకు వచ్చే అభిప్రాయ భేధము. లోపాలున్నాయని చాల మంది చెప్పారు. నేనుకూడా చెప్తాను. కాని వాటిని సవరించే మార్గము చాల కొద్దిమంది మాత్రమే సూచించారు. వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పింది ప్రత్యేకంగా వింటిని. ఎక్కడైనా కొద్దిగానైనా ఏదైనా సూచన దొరుకుతుందా అని ఆలోచించాను ఏమీలేదు. అదే style లోనే వుంది. కాని చాల సానుభూతితో విమర్శించారు. ముఖ్యంగా సుందరయ్యగారుకూడా ఆరకముగానే వుండినారు. వారు చెప్పిన వాటితో నేను కొన్ని విషయాలలో ఏ మాత్రమూ ఏకీభవించలేను. ఏకీభవించలేక పోవడానికి కారణాలు చెప్తాను. అనవసరంగా ఏదో కమ్యూనిస్టులు చెప్పారు కాబట్టి ఏకీభవించకూడదనికాదు. వాండ్లు చెప్పిందంతా పచ్చి అబద్ధము, కాంగ్రెస్ వాండ్లు చెప్పింది అంతా 100-కి 100 పాళ్లు నిజమనే దృక్పథంకాదు. పోలీసు వాండ్లు కాంగ్రెస్ వాండ్లను ఉపయోగపడారనో లేదా కమ్యూనిస్టులను వ్యతిరేకించడము వారి దృక్పథమనే సిద్ధాంతముతో కాదు మన మిక్కడ కూర్చొని వుండేది. ఎవరైన ప్రజలఎడ దుర్మార్గముగా

ప్రవర్తించితే కాంగ్రెస్ వాండ్లు కమ్యూనిస్టులు చేరి ఆ దుర్మార్గులను శిక్షించడానికి యే నాడైతే కృషిచేస్తామో ఆనాడు నిజంగా పోలీసువారి ధృక్పథము పరివర్తన చెందుతుంది. పోలీసు వాండ్లు elections లో కమ్యూనిస్టులకు canvass చేస్తే సహాయము చేసినప్పుడు శహబాష్ వీరు మంచివారు లేకపోతే యీరు అనుకూలము గా చేయలేదు కాబట్టి వారు దుర్మార్గులని అన్నంత మాత్రముచేత demoralisation దేశములో ఎక్కువ పోతుంది. ఆ రకము గా చేసినట్లయితే దేశము మొత్తము పైన పాడౌతుందని మాత్రము నేను చెప్పుతున్నాను. ఆ పద్ధతి మార్చుకుంటేనే మన మేదైనా కొంతవరకు సరిఅయిన పద్ధతిలో దేశాన్ని నడుపగల్గుతాము. సభ్యులు చెప్పిన విషయాలకు సమాధానము యిచ్చుటకు ఒక్కొక్కరికి ఒక నిమిషము మాత్రమే వినియోగించుకుంటానని విన్నవించుకుంటాను. రత్నసభాపతిగారు ప్రారంభిస్తూ కాకినాడ విషయాలు వారు చెప్పకూడనివి చెప్పారు. చెప్పకపోయుంటే బాగుండేది. క్రొత్తగా C. V. K. Rao గారిని వాండ్ల పార్టీలో కల్పుకున్న ఆదుర్దావుంటే, వారిని కలుపుకుంటే నాకేమి ఆక్షేపణలేదు. అటుల కల్పుకోవడము వల్ల మీ పార్టీ లేమి బలపడవు కాని అక్కడ జరిగిన విషయాలేమి తెలుసుకోకుండా ఎవరో వ్రాస్తే ఆ కాగితము పట్టుకవచ్చి ఇక్కడ Assembly లో చదవడము మంచిది కాదని మాత్రము నేను చెప్పుతున్నాను. C. V. K. Rao గారు అక్కడ Chairman గా వున్నారు. వారిక్కడ పూర్వము సభ్యులుగా వున్నవారే. వారిపైన ఇప్పుడు No-confidence motion కు గాను హెచ్చుమంది సభ్యులు, రెండింతలు మంది సంతకాలు పెట్టి యిచ్చారు. ఆ Council లో రేపు రెండవ తేదీనాడు ఆ No-confidence motion discuss చేయాలి. అలాంటి ఉద్రిక్తమైన పరిస్థితులు వున్నాయి. ఉండడమే కాదు. C. V. K. Rao గారు అక్కడున్న sweepers తో strikes చేయించి కొన్ని వందలమందితో బజారులో ఊరేగుతూ తనకు వ్యతిరేకము గా సంతకాలుచేసినవాండ్లను బూతులు తిట్టుతూ మీటింగుపెట్టి ఏ కేదో మాట్లాడుతూవుంటే మొదటి రోజు మీటింగులో ఎవరూ అల్లరిచేయలేదు. రెండవ రోజు మీటింగులో ఎవరు అల్లరి చేయలేదు.

5-30 p. m.

మూడవరోజు మీటింగు నాటికిమాత్రం ఎవరికైనా తే వీళ్లు బూతులుతిడుతున్నారని వాళ్ళకు కోపంవచ్చి, వాళ్ళూ వీళ్ళూ రాళ్ళు ఋవ్వుకోవడం తటస్థించింది. అలాంటి పరిస్థితులలో పోలీసు ఏం చేయ్యాలి? చూస్తూ కూర్చోవాలా? ఆపిందివాళ్ళను విడదీసింది. ఇంకా రగడలు రక్తపాతమై కూనీలు కాకముందే వారిని విడదీసి 144 section issue చేశారు. అధ్యక్షునిమీద no-confidence motion

SRI N. Sanjeeva Reddi] [28th July 1955

రెండవతేదీ చర్చకు రావలసియుండగా ఈ meeting లు పెట్టుకోడానికి అనుమతి ఇచ్చి వాళ్లు దెబ్బలాడుతూంటే అప్పుడుపోయి కేసు పెట్టడమేనా పోలీసువాళ్ళపని, లేక కొట్లాటలు జరగకముందేపోయి ఎల్లాంటి అల్లరులూ జరగకుండా కాపాడడమా పోలీసుచేయవలసింది ? ఈ విషయం ఆలోచించవలసిందని ప్రార్థిస్తున్నాను. ఇంత సవ్యంగా, ఇంత న్యాయంగా చేసిన కార్యక్రమాన్ని కూడా విమర్శిస్తే, మనం పోలీసు నుంచి రక్షణ అడగడానికి మనకు హక్కు లేదేమో అనుకుంటాను. కాబట్టి మనకు అప్పుడా కాదా అనే విషయం కాదు. Police చాలా సవ్యంగా ఈ విషయంలో ప్రవర్తించారు. ఏదో World Health Organization తరఫున meeting పెడతా మన్నారు. పేర్లు మార్చిస్తే మాత్రం మీటింగులో కొట్టుకోవడం తటస్థించినప్పుడు World Health Oraganization లో కలిసినవాళ్ళు కూడా వాళ్ళు ఋప్పుకో వచ్చును. ఆ పరిస్థితులలో అక్కడ మీటింగు పెట్టడం చాలా పొరపాటు. ఆ పట్టణంలో ఇప్పుడు ఉద్రిక్తమైన పరిస్థితులున్నాయి. Chairman పైన no-confidence motion ఉన్నది. రెండవతేదీనాడు చర్చకు వస్తోంది. ఏ పార్టీ గెలుస్తుందో చెప్పలేం. ఈలాంటి పరిస్థితులలో ఒక నెలరోజులపాటు మీటింగులు పెట్టకపోవడం మంచిదని Section 144 issue చేశారు. అది ఎంతైనా సవ్యమైనది. అక్కడ ప్రజల రక్షణకుగాను ఇది చేయ బడ్డది కాబట్టి, రత్నసభాపతిగారికి తెలియదనుకుంటాను ఈ విషయాలన్నీ. ఇక మన లక్ష్మణదాసుగారూ, రంగబాబుగారు వారంతా చాలా అభినందిస్తూ మాట్లాడారు. కొన్ని ఇబ్బందులనుగురించీ, వాటినిగురించీ సూచనలు ఇచ్చారు. ఆసూచనలు మేము note down చేసుకున్నాం, తప్పకుండా వాటినిగురించి ఆలోచిస్తాం. అప్పారావు గారు Police station లలో extra staff కావాలని సూచించారు. అందులో ముఖ్యంగా కొండప్రదేశాలలో staff తక్కువ ఉండబట్టి ఈ Agency area లో చాలా ఇబ్బంది అవుతోంది. అందులోనూ D. S. P. Office ఎక్కడో విజయ నగరంలో ఉంది. అది శ్రీకాకుళంలో పెట్టాలన్నారు. Extra staff ని గురించి మాత్రం ఇప్పుడు వెంటనే ఏమీచర్య పుచ్చుకోము. ఎందుకంటారా Prohibition కూడా పోలీసువారు తీసుకోవాలనుకున్నప్పుడు ఈ Prohibition station లన్నీ పోలీసుస్టేషన్ లవుతాయి. Number of Police stations, increase ఐనప్పుడు ఏ staff ను ఎక్కడ సర్దాల, ఎక్కడ Police station లు ఎక్కువ కావాల అనే విషయం I. G గారు work out చేసుకుంటున్నారు. ఇంకా 5 నెలలు, జనవరివఱకూ, time ఇచ్చినాం. Number of Police stations, policemen ఎక్కువ అవుతారు. అప్పుడు కావలసివస్తే, మీకు ఇంకా

ఇబ్బందులుంటే examine చేస్తాం దాన్ని. అప్పుడు ప్రత్యేకమైన పరిస్థితులేమైనా ఉన్నాయా, Agency లో ఆ ప్రజలేమైనా ఇబ్బందిపడుతున్నారా, వాళ్ళలోవాళ్ళకి తగాదాలేమైనా ఉన్నాయా, అని విచారించి అప్పుడు కావలసివస్తే ఆలోచిస్తాం గాని వెంటనే ఇప్పుడు staff ను increase చేయడం అనవసరం. ఈ re-organizatio అంతా కానివ్వండి. జనవరి 1 వ తేదీనాటికి ఈ Prohibition Department అంతా hand over చేసుకునేందుకు పోలీసువాళ్లకు చెప్పాం. వాళ్ళన్నీ work out చేస్తున్నారు. Special officer ను post చేస్తున్నాం. ఇవన్నీ జరుగుతున్నాయి. వెంటనే చెయ్యడానికి వీలులేదు. ఇక D. S. P. Office శ్రీకాకుళానికి మార్చాలన్నారు. బిల్డింగులు ఎవ్వరివో ఈ జమీందారువీ, ఆ జమీందారువీ, ఎక్కడో ఉన్నాయన్నారు. మేమూ చూచాం. I. G. గారిని చూచి office మార్చడానికి ఎక్కడనైనా శ్రీకాకుళం దగ్గరగా వీలవుతుందేమో చూడమంటే, ఎక్కడా సరియైన బిల్డింగులు లేవు అన్నారు. ఒక్క D. S. P. కో ఆయన office కో ఐతే వెంటనే బిల్డింగులు ఎక్కడో బాడుగకు తీసుకోవచ్చు. అదికాదు ముఖ్యం. నాకు తెలుసు వారు చెప్పబోయేది. ఫలానాచోట ఒక బిల్డింగుఉంది, ఏదో మహారాజాగారిది palace ఉందంటారు. అదికాదు మాకు ముఖ్యం. D. S. P. గారు పోతూనే D. S. P. గారి ఆఫీసుపోతూనే ఆయనచుట్టూఉన్న Reserve staff, Reserve police అందరూ పోవాలి. ఆ constables కూ వాళ్ళందరికి కూడా buildings కావాలి. ఇక్కడ విజయనగరంలో ఉన్నాయి. Constables కూ ఉన్నాయి. Reserve పోలీసుకూ ఉన్నాయి. District headquarters లో ఆయనదగ్గర ఉన్నటువంటి police వారు కొన్నివందల మంది ఉంటారు. వాళ్లకు కావలసిన quarters విజయనగరంలో ఉన్నాయి. వాళ్లకు బిల్డింగులు కట్టకుండా, మనమంతా కర్నూలుకు ఏరాత్రో మదరాసునుంచి వచ్చినట్లుగా, ఇప్పుడు శ్రీకాకుళం పంపడం ఇబ్బంది అవుతుంది. విజయనగరంలో ఉండడంకూడా అంతదూరమేమీలేదు. 30, 40 మైళ్ళ difference లో ఉంది. త్వరలోనే మారుస్తాం. అక్కడ బిల్డింగులు కట్టాలని నిర్ణయం ప్రభుత్వం తీసుకుందిగా. ఐతే వెంటనే ఈ 6 నెలలలో కడతారనికాదు. వీలైనంత త్వరలో మన దగ్గరున్న డబ్బునుబట్టి Collector Office కట్టాల, కలక్టరు బంగళా కట్టాల, D. S. P. Office కట్టాల, D. S. P. బంగళా కట్టాల. ఇవన్నీ కట్టుకుందాం. దాన్నిగురించి అభిప్రాయభేధంలేదు. వెంటనే ఈ 55 వ సంవత్సరంలోనే చెయ్యాలా లేక 56, 57 సంవత్సరాలలో నిదానంగా కొన్నిలక్షల రూపాయలు ఖర్చుపెట్టవలెనా అన్నది ఒకటే point. వెంకట్రాజుగారు చెప్పారు అక్కడ జరుగుతూవున్న విషయాలు అన్నీ. ఎట్లా Congress, Communist

SRI N. Sanjeeva Reddi] [28th July 1955

రెండుపార్టీలమీద పోలీసు కేసులు పెడుతున్నారని, ఏ పార్టీ అయితే, ఏ ప్రజలైతే చట్టసమ్మతంగా బ్రతుక్కుంటున్నారో వాళ్లపై ఇతరులు దౌర్జన్యంచేస్తే, దౌర్జన్యం చేసినవాళ్ళమీద కేసులు పెట్టకుండా, ఇద్దరినీకలిసి కేసులు పెడుతున్నారనే ముఖ్యమైన point వారు చెప్పారు. ఎవరైనా దౌర్జన్యపద్ధతులలో తమ సిద్ధాంతాలను ఇతరులపై రుద్దాలని చూచినప్పుడు కఠినమైనచర్య పుచ్చుకోక తప్పదు. కాని కొన్ని పల్లెటూళ్ళలో పార్టీ లుంటున్నాయి. పార్టీ లున్నప్పుడు ఎంతవరకూ రాజకీయాలలో ఎంతవరకూ private విషయాలలో తేల్చడం కష్టమౌతోంది. అట్లాంటప్పుడే ఈ సమస్య వస్తోంది. లేకపోతే రాజకీయాలను బలవంతంగా ప్రజలపై రుద్దాలనిచూచిన పార్టీ ఏదైనాఉండి, ఆపార్టీ ఆరకంగా చేస్తూంచం టేమాత్రం, వెంకట్రాజుగారికి నేను చెబుతున్నాను, వారికన్నా కఠినంగా నేను వుండడానికి సిద్ధంగా యున్నాను. కాని గ్రామాలలో కక్షలున్నప్పుడు కక్షలను ఉపయోగించుకుంటున్నా రనుకోండి, అట్లాంటి ఇబ్బందులు వచ్చినప్పుడే చిక్కు. గడచిన సంవత్సరం నేను ప్రకాశం మంత్రివర్గంలో మంత్రిగా యున్నప్పుడు ఆ ప్రాంత్యంలో ప్రభుత్వం ఇచ్చిన పేదవాళ్ళ భూములను ఇంకో పార్టీవారు occupy చేసుకోడానికి ప్రయత్నించినప్పుడు special police party ని అక్కడ పెట్టి, ఏంటిలా కఠిన చర్యలు పుచ్చుకున్నామో మంతిన వెంకట్రాజు గారికి తెలుసును. ఆలాంటి political agitation వచ్చి, అది గ్రామ కక్షలతో సంబంధం లేనిదని తెలిస్తే మాత్రం చట్టసమ్మతంగా రక్షణ ఇవ్వటానికి సిద్ధంగా యున్నాం. వచ్చే బాధంతా గ్రామాలలో వ్యక్తిగతమైన అభిప్రాయ భేదాలు వచ్చినప్పుడో, ఇంకొకటి వచ్చినప్పుడో కొంచం ఇబ్బంది కల్గుతుంది. అటువంటప్పుడు ఏమీ చేయడానికి వీలు లేకుండా పోతోంది. ముఖ్యంగా గుంటూరుజిల్లాలోనో, కృష్ణాజిల్లాలోనో మాత్రమే ఇల్లాంటి తగాదాలు వస్తున్నాయి. ఇతరజిల్లాలనుంచి నే నెక్కడా అంతగా వినలేదు. ఇవి ఎట్లా సరిచెయ్యడమో తెలియడం లేదు. కఠినచర్య పుచ్చుకోడం ఒకటే కాదు మార్గం దీనికి. రెండు పార్టీలవాళ్ళూ రాజకీయ అభిప్రాయ భేదాలు లేకుండా ఈలాంటి తగాయిదాలు తీర్చడాని కేమైనా ప్రయత్నిస్తే వీలవుతుంది. రాజకీయంగా ఈరకంగా తగాయిదాలు తీర్చడానికి వీలులేకపోతే అప్పుడు పోలీసు పక్షపాతంలేకుండా కఠిన చర్య పుచ్చుకొని అల్లాంటి పార్టీలులేకుండా చెయ్యడానికి ప్రయత్నిస్తుంది. ఇక కమ్యూనిస్టులతో కలసి పోలీసులు అక్రమాలు చేశారన్నారు. దీనిలో పూర్తి సత్యం లేకపోయినా, అసత్యమైన వార్తకాదిది. నేనూ కొద్దిగా Electoin లో చూచాను. Lower ranks లో కమ్యూనిస్టు పార్టీకి కొంత సానుభూతి కనపఱచినవారు లేక

పోలేదు. Gate దగ్గర నిలచి వాళ్ళ symbol చేతిలో పట్టుకుని దీనికి ఓటు చెయ్యి, దీనికి ఓటు చెయ్యి అంటూ చెప్పిన constables లేక పోలేదు. అటు కాంగ్రెస్ పక్షంగా ఓటుచేయమనిచెప్పిన వాళ్ళూ లేకుండా ఉండరు. నాకు తెలియదు గాని ఈ విషయం మీకు తెలిసేయుంటుంది. ఇతర పక్షం కాబట్టి వీళ్లైనంతవరకూ ఇటు కాంగ్రెస్ పక్షమూ అవలంబించకుండా, అటు కమ్యూనిస్టుపక్షం అవలంబించకుండా, ఏ పక్షమూ అవలంబించకుండా ఉంటే చాలా బాగుంటుంది, ఇది రెండు పక్షాలూ కూడా నిరసించాలి. ఇటు మా కాంగ్రెస్‌వాళ్ళకూ మీ సహాయంవద్దు, అటు కమ్యూనిస్టు పక్షానికే చెయ్యొద్దండి, మీ పని మీరు చేసుకుపోండి అని చెబితే చాలా బాగుంటుంది. మంత్రిన వెంకట్రాజుగారు చెప్పిన దానిలో సత్యంఉంది. కొందరట్లా పనిచేశారు. అల్లాంటివాళ్ళు ఇకమీదటనైనా అట్లాచేయరని విశ్వసిస్తున్నాను. కాని వాళ్ళెంతమంది ఏమిచేసినా సరే Election లో ప్రజలు తామిచ్చే ఓటు తామిచ్చే రకంగానే ఇస్తారేగాని ఏదో constable symbol చూపించాడని భయపడి, లోపలికిపోయి ఆ కొడవలికంకి పెట్టెలో వేస్తారన్నమాట అబద్ధం. అది నిరూపణ ఐంది కాబట్టి చిన్న constable చేసిన తప్పులను మనం అంతగా చూసుకోవలసిన అవసరం లేదని అనుకుంటున్నాను. మేకా కోటిరెడ్డిగారు petrol పోసి పొగాకంతా తగలపెట్టారని చెప్పారు. ఆ tobacco తగలపడిపోవడంవల్ల లక్షయాభై వేల రూపాయిలు నష్టంవచ్చిందనికూడా చెప్పారు. నష్టం వచ్చి నాయనకు చాలా సాను భూతి చూపుతున్నాను. ఎందుకంటే పాపం insure కూడా చేయలేదు. Insure చేసి ఉంటే ఆయనే నిప్పు పెట్టుకున్నాడు అనుకోడానికైనా వీలయ్యేది. Insure చెయ్యనికారణంచేత పెద్ద నష్టం వచ్చింది వారికి. ఇక్కడనుంచి C. I. D. పోయి enquire చేశారు. ఊరికే వదలిపెట్టింది కాదది. సరియైన evidence, ఆధారాలు లేకపోతే వెంటనే arrest లు చేయడం, ఈ రకంగా చేస్తే అది పోగొట్టుకొన్నవారికీ అనుకూలంలేదు, దేశానికీ సుఖంలేదు. కాబట్టి సరియైన ఆధారాలు లేకుండా ఏమీ చేయడం మంచిది కాదనే ఉద్దేశ్యంతో ఇక్కడనుంచి పోయిన పోలీసువారూ, ప్రభుత్వంకూడా నిర్ణయించి ఆ case లో proceed కాలేదు. కాబట్టి మేకా కోటిరెడ్డిగారు పోలీసువారు చర్య పుచ్చుకోలేదని మాత్రం అనుకోకండి. చర్య పుచ్చుకున్నారు. ఒకతూరి, రెండు తూర్లు, మూడు తూర్లు నేను మంత్రినైన తరువాత కూడా మరొక పర్యాయం ఇక్కడనుంచి C. I. D. ని పంపి enquire చేశాం. సరియైన ఆధారాలు. సరియైన సాక్ష్యం లేకపోవడంవల్ల, ఇల్లాంటివాటిలో ఊరికే కళ్లుమూసుకు చర్య పుచ్చుకోవడం మంచిది కాదనే ఉద్దేశ్యంతోనే తొందరపడి ఏమీచర్య పుచ్చుకోలేదు. Fire stations ని గురించి మనరాజాగారు చెప్పారు. మీ పూర్వపు పార్టీకి ex-Deputy

SRI N. Sanjeeva Reddi] [28th July 1955

leader గారు చెప్పారు. ప్రతితాలూకాకు కనీసం ఒక Fire station ఐనా పెట్టాలని మన సూర్యనారాయణరాజుగారూ చెప్పారు. ఇప్పుడు మునిసిపాలిటీకి ఒకటైనా పెడదామా అనుకుంటున్నాము, మొదట పెద్దమునిసిపాలిటీలు వున్న ఊళ్లలో, ప్రతిమునిసిపల్ limits లో ఒక Fire station అయినా పెట్టాలి. అక్కడ ఒకచోట కొన్నివేల గుడిసెలు ఉంటాయి. ఇన్నేళ్లుగా పెట్టకపోవడం, ఇప్పుడన్నీ ఒకేతూరి పెట్టడం సాధ్యంకాదు. వీలైనంత త్వరలో పెట్టడానికి ప్రయత్నం చేస్తాం. రామాచార్యులుగారు కళ్యాణదుర్గం tax collections వగైరాలను గురించి చెప్పారు. దాన్నిగురించే సుందరయ్యగారు కూడా చెప్పారు. సుందరయ్యగారికి ఆవిషయం చెప్పినప్పుడు సమాధానం చెబుతాను. కూర్మయ్యగారు Police less corrupt అన్నారు. Letme thank Mr. Kurmayya for that compliment. కృష్ణావతారంగారు విషయాలన్నీ విపులంగానే చెప్పారు. వారుచెప్పిన విషయాలు note చేసుకున్నాను. వారు ఈ evidence మొదలైన వాటినిగురించీ వారి అనుభవాలు చెప్పారు. వాటి నేమైనా సర్దడానికి వీలవుతుందా, ఎట్లా ఈ evidence మారిస్తే బాగుంటుంది అవన్నీ మేము ఆలోచించి, departmental గాకూడా note చేసుకుంటున్నారు. తప్పకుండా ఏదో ప్రయత్నం చేస్తాం. కొండయ్యగారు ఒక్కొక్క Circle Inspectorకు ఒక jeep పెట్టమన్నారు. దానివల్ల ఏమిలాభం? ఒక్కొక్కరు సలహా ఇచ్చినప్పుడల్లా jeep లుకొనే P.W.Dలో, ఇంకా అన్ని departmentsలో jeep లసంఖ్య పెరిగిపోతోంది. Jeep లు పెరిగిపోతున్నాయని అంటూనే మళ్ళీ కొనమంటారు. మీసలహా అనుసరించి Circle Inspector కూ, ఇంకొకరిసలహా ననుసరించి sub Inspector కూ ఈరకంగా పోయి jeepల సంఖ్య పెరిగిపోయి తిరగడం ఎక్కువవుతోందిగాని ఫలితం ఏమీలేదు. Circle లో ఉన్న officer సర్కిలిన స్పెక్టరే. Jeep Circle Inspector దగ్గరనే పెట్టవలసి వస్తుంది. ఇంకెక్కడ పెడతాం దాన్ని? ఎక్కడో చెట్లుక్రింద విడిచి ఎవరుకావలసివస్తే వారు తీసుకుపోవలసినదేనా? Case actual గా జరిగితే ఆ limits లో పరుగెత్తుకునిపోయి రాత్రియైనా పగలైనా చూడవలసింది Sub-Inspector అతనికి jeep ఉండాలి. నేరం జరుగుతూనే immediate గా on the spot ఉండవలసింది అక్కడున్న local sub-Inspector కాబట్టి Circle Inspector కు jeep ఇవ్వడం అనేది ఇంకా కొంచం అనవసరం అవుతుందేమో. I am not very much in fovour of it but still it will be examined if it is economically feasible.

5-30 p. m.

సాధారణంగా చిన్న చిన్న తప్పులకు, dismiss చేయడమనేది జరుగదు. ఏదో suspend చేయడమో లేక increment తగ్గించడమో మాత్రమే ఉంటాయి. ఒకే principle తో పనిచేస్తున్నాము. ఎవరివిషయములోనైన corruption case బుజువైతేమటుకు ఎంత influence చేసినప్పటికికూడ, అతనిని retain చేయము. అంతేగాని చిన్నచిన్నవాటికి సాధారణంగా dismiss చేయరు. Papers delay చేసినందుకే dismiss చేశారని ఒకమిత్రుడు చెప్పాడు. ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత నిజంగా అటువంటి కేసులేవైనా ఉంటే పై ఆఫీసర్ల దృష్టికి తీసుకురండి, లేకపోతే నాదృష్టికి తీసుకురండి, నేను విచారిస్తాను. సాధారణంగా "papers delay" మొదలగు చిన్నచిన్న తప్పులకు dismiss చేయరనే నానమ్మకము. అయితే కొన్నికొన్నిచోట్ల proved corruption లేకపోవచ్చును. Corruption ఉండికూడ prove చేయడానికి వీలులేకపోవచ్చును, అయినా "This officer is persistently bad" అని, దానికితోడు, చాలా rotten గా ఉన్నాడని తోచినప్పుడు, అలాంటికేసులలో కఠినచర్య తీసుకొంటారు, గాని మామూలుగా ఏదైనా papers delay చేయడం మొదలగు చిన్నతప్పులకు dismiss చేసిఉండరు అనే నా అభిప్రాయము. చేసిఉంటే, నాదృష్టికి తీసుకువస్తే, నేనుచూస్తాను అని చెప్పుతున్నాను.

SRI B. RAMA REDDI:—మూడు censures ఇచ్చినతరువాత dismiss చేయవచ్చునని rules లో ఉన్నది. అవిధంగా, మొట్టమొదట ఒక censure, మళ్ళీ ఇంకో censure, ఆ తరువాత ఇంకో censure ఈ విధంగా మూడు censures ఇచ్చి dismiss చేయడం జరుగుచున్నది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇన్ని censures ఇచ్చినా ఆయన యింకా బాగుపడలేదు అన్నమాట. కాబట్టి అలాంటివాడు "మడిదున్నక బ్రతుకవచ్చు" అన్న సామెతకు వీలుగా dismiss అవ్వడే మంచిది. మూడు censures ఇచ్చినా ఇంకా ఏమిలాభంలేదనుకొని desperate state లో ఇంటికి పంపించి ఉంటారు.

తరువాత కాకాని వెంకటరత్నంగారు ఆవేదనతో చెప్పారు. వారు అయిదేళ్లుగా కమ్యూనిస్టులను ఎదుర్కోవడంలో కొన్ని బాధలు పడ్డారు, అనుభవిస్తున్నారు. కాబట్టి ఆవేదనతో ఈ కుప్పలు తగలబెట్టారని అన్నారు. సుందరయ్యగారు కూడ, "ఔను 1948-51 లో చేశాము" అన్నారు. వెంకటరత్నంగారు అక్కడ

ఉండి బాధలు పడినటువంటివాడు కాబట్టి, ఆవేదనతో ఈ విధంగా చెప్పడంలో ఏమి తప్పులేదు. అప్పుడు అటువంటివి జరిగాయి. జరగలేదని ఎవరు చెప్పలేదు. చెప్పడానికి వీలులేదు. కాని ఈనాడు అటువంటివి జరుగుతున్నాయా లేదా అనే దాంట్లోనే dispute వస్తున్నది. ఈనాడు చేసినటువంటివేవైనా individual cases ఉంటే వాటిని తీసుకొని విచారించగలము గాని ప్రతిది కేసుపెట్టాలంటే, దాంట్లో ఇబ్బందులు ఉన్నాయి. చాలాకష్టంగా ఉంటుంది. వదలిపెట్టడం ఎంత కష్టమో, ప్రతిదీ కేసుపెట్టడంకూడ అంత కష్టంగా ఉంటుంది.

Sri K. VENKATARATNAM :—అన్ని కాంగ్రెస్‌వాళ్లవే తగుల బెట్టారు. అందుకు రక్షణ ఇవ్వమని అంటున్నాము.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అన్ని కాంగ్రెస్ వాళ్ళవే కాల్చారు అన్నమాట నిజమే కాని ఎవరు కాల్చారో తెలియదు. ఎవరు కాల్చారు అని చెప్పడం కష్టముఅయినా ఇలాంటివి ఎన్నిచేస్తారో చూస్తాము. క్రమంగా తగ్గకమానవు, తగ్గిపోతాయనే ఆశమాకు లేకపోలేదు. ఎన్నికలు అయి పోయినాయి గనుక, కొన్నాళ్లు అక్కడ కొంచెము, ఇక్కడ కొంచెము కాల్చు కొంటూ ఉంటారు. కొన్నాళ్ళకు తగ్గిపోతుందనే ఆశతో, అనవసరంగా ఎందుకు కేసులుపెట్టి చర్యపుచ్చుకోవడం అనే అభిప్రాయంతో ఉన్నాము. ఇంకా కొన్నా ళ్లయిన తరువాత ఇలాంటిపనులు తగ్గకపోతే అప్పుడు, ఇవి ఎవరుచేస్తున్నారో విచారించి తగుచర్య తీసుకొనడం జరుగుతుంది.

తరువాత సుబ్బారావుగారు D. S. P., Dy. S. P. లు కేవలం కఱ్ఱ పెత్తనం చేసేవాళ్ళేగాని, వీరివల్ల ఏమిప్రయోజనంలేదని అన్నారు. కర్రపెత్తనం చేసేవాళ్లు ఉద్యోగస్థులలోను, పార్టీలలోగూడ ఉంటారు. వారు అవసరంకూడాను. Secretary అని, Assistant Secretary అని, Manager అని ఈ విధంగా ఉంటారు. అందరు workers అయితే కర్రపెత్తనం ఎవరుచేయాలి? ఎవరో ఒకరు చేయాలి. చేయకపోతే జరగదు. Chief Ministerను ఎందుకు పెట్టు కొన్నాము మనం! ఈ మినిస్టర్లంతా ఎందుకుండాలి? కర్రపెత్తనమునేది ఉండాలి. ఈ పని సరిగా జరుగుతున్నదా లేదా అని చూడడానికి ఇది అవసరం. ఆదేవిధంగా పార్టీలలోకూడ, party discipline కు భంగం కలుగకుండా చూడడానికిని, ఎక్కడ ఎవరిని M. L. A. గా పెడుదాము, ఎవరిని Parliament కు పెడదాము, ఇవన్నీ చూడడానికి కర్రపెత్తనం ఉండాలి. లేకపోతే ఎట్లాజరుగుతుంది? Police department లో, constables కే అంతా వదలిపెట్టండిఅంటే అది

అసంభవము. D. S. P. అంటే అతను జిల్లాకంతా police head గా ఉంటాడు. మొత్తంజిల్లా కార్యక్రమంతా చూచుకోవలసియుంటుంది. Dy. S. P. post ఎందుకు ఇది superfluous అని సుందరయ్యగారు అంటారు. ఆ విధంగా అనుకోవడం పొరబాటని అంటున్నాను. ఇప్పుడు కర్నూలులాంటి పెద్దజిల్లా ఉన్నదనుకొండి. ఇది తుంగభద్రానది తీరమునుంచి వినుకొండవరకు ఉన్నది. From one-end to the other, దాదాపు 200 మైళ్లకుపైగా ఉన్నది.

SRI P. SUNDARAYYA :—ఇప్పుడున్న జిల్లాల విభాగంలో కొంత మార్పుచేసి, ఇప్పుడున్న 11 జిల్లాలు 16 జిల్లాలు చేసుకొని ఆ విధంగా చేయాలని చెప్పతున్నాను. ఇప్పుడున్న జిల్లాలను అట్లనే ఉంచి Dy. S. P. లను తీసివేయమని చెప్పలేదు.

THE HON SRI N. SANJEEVA REDDI :—ఇది పదిరూపాయలు తగ్గించేకోసం నూరురూపాయలు ఎక్కువపెట్టమని చెప్పేటట్లున్నది. ఒక్కజిల్లా ప్రత్యేకంగా start చేయాలంటే, ఎంతఖర్చు అవుతుంది! దానికి ఒక కలెక్టరు, ఒక D. S. P. ప్రతి డిపార్టుమెంటుకు ఒక District officer ప్రత్యేకంగా కావలసియుంటుంది. తరువాత offices కంతా buildings, కుర్చీలు, బల్లలు మొదలైన వన్నో కావలసియుంటుంది. ఈ విధంగా ఎంతఖర్చు అవుతుందో ఆలోచించుకోండి. కనుక అది సాధ్యంగానిపని, తరువాత ఈ జిల్లాలో D. S. P. ఇక్కడ ఉంటాడు అనుకోండి. ఎక్కడో ఒకచోట మంత్రాలయంలోకూడా అయిందంటె అక్కడ పోవలసియుంటుంది. అదేసమయంలోనే మార్కాపురంలో ఏదో జరిగిందని తెలుస్తుందనుకోండి, ఎక్కడకని పోతాడు ? ఈకొననుంచి ఆకొనకు వెంటనే పోయే దానికి సాధ్యమవుతుందా! Circle Inspector, Sub Inspector మాత్రం ఉంటే లాభంలేదు. వీళ్ళమీద check లేకపోతె ఎట్లా జరుగుతుంది ? D. S. P. అంటే అతను Head of the district. ఆయనకు సమానమైన హోదాలో ఇంకొకరు D. S. P. కి Circle Inspector కు మధ్యలో ఉండాలి. తరువాత Circle-Inspector కు ఒకేతూరి direct గా D. S. P. గా promotion ఇస్తే బాగుంటుందా ? కొంత status ఉండి జిల్లాలో కొంత touch ఉండి నాలుగు చోట్లుచూచి, అనుభవం సంపాదించిన అతన్ని D. S. P. గా promote చేస్తే అది సరిగా ఉంటుందిగాని, ఒక చిన్న Circle Inspector కు ఒకేతూరి జిల్లా నీవే చూచుకో, administration అంతా నీవే చూచుకోమ్మని చెప్పడం అంత శ్రేయంకాదని నేను భావిస్తున్నాను. తరువాత శ్రీనివాసరావుగారు ఆడ దొంగలకోసం, ఆడవారిని constables గా పెట్టమని చెప్పారు. కాని, ఆడ

Sri N. Sanjeeva Reddi] [28th July 1955

దొంగలైతే, మగవాళ్లు arrest చేయకూడదా ? మగవాళ్ళకు ఎందుకు అంత భయం ఆడవాళ్లను arrest చేయడానికి ? కావలసివుంటే Sub-Inspector ను ఇస్తాము. ఆడవారిని arrest చేయడానికి అంతజంకు పడనక్కరలేదు. అయితే ఇప్పుడు ఆడపోలీసులను పెట్టవలసినంత అవసరమే లేదనుకొంటాను. అలాంటి circumstances ఏమిలేవు. అలాంటి crimes ఏమి ఈవేళలేవు. కనుక ఈ విషయాన్ని మనం అంత serious గా తీసుకోవలసిన అవసరంలేదు. అలాంటి కేసులలో instructions ఇవ్వకముందే arrest చేస్తున్నారు.

SRI P. SUNDARAYYA :—ఇప్పుడు ప్రత్యేకంగా instructions ఇచ్చి ఇంకా అన్యాయంచేయవలసిన అవసరంలేదు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ Houseలో అంతా సుందరయ్యగారి అభిప్రాయంతోనే ఉంటారనుకోవడం పొరబాటు. ఇతరులకు కూడ నేను సమాధానం చెప్పవలసియున్నది. కనుక అటువంటి అభిప్రాయాన్నిమార్చు కొమ్మని వారికి మనవి చేస్తున్నాను.

తరువాత సుందరయ్యగారు తమ ఉపన్యాసాంతములో Criminal Tribes Act వల్ల లాభములేదు, అందరు habitual offenders గానే ఉన్నారు, ఈ Act వల్ల చాలా harassment జరుగుతున్నదని అన్నారు. అదికాదు. ఆ కులాలనుబట్టి, ఎరుకవాళ్ళంతా వాళ్లు మంచివాళ్లుగాని, చదుకొన్నవాళ్లుగాని, వాళ్లంతా పోలీసుస్టేషనుకుపోయి attendance mark చేస్తూ ఉండాలని ఉన్నది. ఎందుకనగా, వాళ్ళను కొంత custody లో పెట్టుకొని ఏలాటి నేరాలు చేయకుండా చూడడానికి ఈ విధంగా చేయడం అవసరం. తరువాత habitual offenders అంటే మామూలుగా ఈ నేరాలకు అలవాటుపడినవారు. ఈ దినం ఏదైనా నేరంచేసి జైలులో వేయబడుతారు అనుకోండి. మరల జైలునుంచి బయటికి వచ్చినతోడనే ఇంకొక నేరం చేస్తాడు. అటువంటివాళ్లను అయ్యా మీరు కొన్నాళ్లు control లో ఉండి బాగా బ్రతుకొండి అని చెప్పేవిధంగా వారికి ప్రతి దినమూ ఈ పోలీసుస్టేషనులో attendance mark చేసేటట్లు ఏర్పాటుచేశారు. కనుక criminal tribes వేరు, habitual offenders వేరు. అది కులాన్నిబట్టి వస్తుంది. ఇది చర్యబట్టి ఉంటుంది. ఇవి రెండు ఒకటే అని చెప్పడం సరికాదు. Habitual Offenders Act తీసివేయమన్నారు. దీనివల్ల ప్రమాదం సంభవిస్తుందేమో అని భయపడవలసి యున్నది. This Act applies only to those who have been repeatedly committing offences.

28th July 1955]

SRI P. SUNDARAYYA :—Habitual offenders గురించి నేను మాట్లాడ లేదు. ఈ settlements పోలీసువాళ్ళక్రింద ఉండవలసిన అవసరం లేదు. Welfare Department వారికే ఇచ్చి వారిని చూచుకొమ్మని చెప్పడం మంచిదని చెప్పుతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఏదో వాళ్లను నెత్తి మీద పెట్టుకొని, భారము వహించాలని మాకేమి సంతోషం లేదు. ఈ settlements ఉండాలా లేదా అని ఆలోచించాలి. దానికి ఏదో ఖర్చు పెడుతున్నాము. ఖర్చు పెట్టినదానికి ఫలితము సరిగా ఉన్నదా లేదా అని తెలుసుకోవాలి. ఇవన్ని ఆలోచిస్తున్నాము.

Fire control కు కొన్ని stirrup pumps గ్రామాలలో పెట్టమని సుందరయ్యగారు అన్నారు. దాని సంగతి ఏమిటో examine చేస్తాను. దానివల్ల ఎంత ఉపయోగముంటుందో, ఎంతవరకు control చేయగలము, దాని cost ఎంత అవుతుంది, అదంతా కూడా ఆలోచించి, అది ఏదైనా కొద్ది ఖర్చుతో Control చేయగలము అని అంటే, తప్పకుండా చేస్తాము. మాకేమి అభ్యంతరము లేదు. It shall be examined.

ఎన్నికలలో పోలీసువారు వారియొక్క విధులు చాలా చోట్లలో తృప్తికరంగానే చేశారని విన్నాను. ఎక్కడో, అక్కడక్కడ జమీందార్లకు అనుకూలంగా behave చేశారని సుందరయ్యగారు అన్నారు. వారు అంతమటుకు చెప్పినందుకు చాలా సంతోషమయింది. కాని పోలీసువారు partial గా behave చేశారని కాంగ్రెసు వారుకూడా అన్నారు కదా. అయితే, యీ రెండింటికి cancel అవుతుందన్న మాట. దీనివల్ల వారు చాలా fair గా వున్నారనే తెలియుతున్నది. కొన్నికొన్ని చోట్ల వారు చేశారని ఇటు అటూకూడా partial గా behave చేశారని అంటే, అప్పటికి పోలీసువారు ఎంతో fair గా వున్నారన్న మాట. అది complement to the Department అన్నమాటే. అంటే కాంగ్రెసువారి తరఫున ప్రభుత్వము వున్నది కాబట్టి వారు ఆ విధంగా చేస్తున్నారని చెప్పకుండా, వారు అన్నిచోట్లలో చేయకుండా, కమ్యూనిస్టులే గెలిచివస్తారేమో అని, అన్నిచోట్లలో కమ్యూనిస్టులకే చేయకుండా, అన్నిపార్టీలయొక్క complement వారు పొందగలిగారంటే, అక్కడికి వారు fair గా వున్నారన్నమాటే. ఏదో individual cases లో నంటూరా, కొన్నికొన్నిచోట్లు అంటే అవి చాలా

Sri N. Sanjeeva Reddi] [28th July 1955

కాలో మాదిరి, ఎక్కువగా టెంపోవచ్చినచోట్ల, వీరు అనటము స్వభావమే. అక్కడ ఎంత టెంపో వచ్చిందో నేను చూచాను. జనవరి ఒకటి, రెండు తేదీలలో నేను కృష్ణాజిల్లాలో మూడు, నాలుగు constituencies లో పర్యటన చేశాను. West Godavari లో ఐదు ఆరు constituences, Guntur లో నాలుగైదు Constituencies తిరిగి వచ్చాను. కమ్యూనిస్టులు ఒక్క Constitueny లో ఖర్చుచేసినంత డబ్బు, నాకు ఒక్కజిల్లా కంతటికి ఖర్చుకు సరిపోయేది. నాది Double Member Constituency అయినాగూడా నాకు అయిన ఖర్చు అంతా రు. 3,500/-లు. అప్పుడు వచ్చిన టెంపో చూస్తే, కమ్యూనిస్టులు జిల్లా బోర్డుకుగాని ఆఖరుకు తాలూకాబోర్డుకుగూడా మెంబర్లుగా రాలేరు అనుకుంటాను. అంటే అంత ఉద్రిక్త పరిస్థితులు వచ్చాయి అన్నమాట. అంటే అప్పట్లో వచ్చిన పరిస్థితులు యెట్లావున్నాయి అంటే, ఏ నిముషములో clash అవుతారో అన్నట్టుగా వున్నది. పోలీసువారి సంగతి చూస్తే ఏదో tight rope dancing మాదిరిగావుంది. ఆ రెండు నెలలూ కూడా వాళ్లకు ఆవిధంగా వున్నది. రాత్రి, పగలు చాలాజాగ్రతగా, ఎవరినీ offend చేయకుండా అందరికి సహాయముచేస్తూ పనిచేశారు. వారు ఆ విధంగా పనిచేశారని complement వచ్చినందుకు నాకు చాలా సంతోషము అయింది. కొన్నిచోట్ల ఎక్కడనైనా ఏవైనా పొరపాట్లు వల్లనో, మరి ఏయితర కారణాల వల్లనో, కమ్యూనిస్టులు న్యాయమను కొన్నది, కాంగ్రెసువారికి న్యాయమని తోచక పోవచ్చు. ఆదేవిధంగా కాంగ్రెసువారుకూడా కొన్నిచోట్ల న్యాయముకాదు అని అనుకొన్నప్పటికినీ, అది కమ్యూనిస్టుల దృష్టిలో న్యాయమని అనుకోవచ్చు. కమ్యూనిస్టులభావము కమ్యూనిస్టులది, కాంగ్రెసువారి భావము కాంగ్రెసు వారిదిగా ఉండవచ్చు. పోలీసువారి దృష్టిలో న్యాయముగానే చేశారు. కాని యిందులో కొంతవరకు అభిప్రాయబేధములు వుంటే వుండవచ్చు. ఎన్నైట్లైనా, యింతవరకైనా పోలీసువారికి అన్నిపార్టీలవారు complements ఇవ్వడము చాలా గర్వించదగ్గ విషయమే. ఇక కృష్ణా గుంటూరు ప్రాంతాలలో ఎన్నికలు జరుగుతున్నప్పుడు, నాగిరెడ్డిగారిని అరెస్టుచేసినట్లు పత్రికలలో చూచాను. ఇది ఏదో నాగిరెడ్డిగారికి అదృష్టము పట్టింది అని అప్పుడే అనుకున్నాను. ఎలెక్షన్సు జరిగేటప్పుడు నాగిరెడ్డిగారిని అరెస్టుచేస్తే వారు గెలవటానికి అవకాశము కలుగుతుందే, యీ సమయములో నాగిరెడ్డిని అరెస్టు చేయడము ప్రభుత్వము ఎంతపొరపాటు చేస్తున్నది, గవర్నరుగారి regime లో యీ విధంగా జరుగుతున్నదే అని అనుకున్నాను. 1952 వ సంవత్సరములోగూడా

నాగిరెడ్డిగారు జైలులో ఉన్నప్పుడు గెలిచారంటే, నేను అప్పుడు కుమారస్వామి రాజాగారి యింటికి వెళ్ళి స్వయముగా "ఏమండీ! నాగిరెడ్డిగారిని మీరు జైలులో పెట్టుతున్నారు. మరి జైలులోవుంటే వారు గెలవటానికి అవకాశము కలుగుతుంది. అతను గెలిచి నేను ఓడిపోతే దానికి నిజంగా మీరే బాధ్యులు" అని చెప్పాను. ఇప్పుడుకూడా అలాంటి పరిస్థితులే వస్తున్నట్లు ఉన్నదే, ఏదో ప్రమాదం వచ్చేటట్లుగా వున్నదే, నిజంగా నాగిరెడ్డిగారి జయానికి యీ ప్రభుత్వము తోడ్పడుతున్నదేట్లున్న, అని నేను చాలా విచారపడ్డాను. కాని మరునాడే పత్రికలలో నాగిరెడ్డిగారిని release చేశారని పేపర్లలో పడ్డదని విన్నప్పుడు నేను communist ల కన్న ఎక్కువగా సంతోషపడ్డాను. దాని ఫలితము మీరు చూచేవున్నారు. (Laughter)

Elections విషయములో మాట్లాడుతూ ఏవో చిన్న చిన్న technical points మీద కేసులుపెట్టారని కొంతమంది అన్నారు. నాగిరెడ్డిగారిని అరెస్టుచేసిన విషయముకూడా నేను చెప్పుతాను. Head constable వెళ్లి, "నాగిరెడ్డిగారూ! మీరు మీటింగు పెట్టవద్దు, 144 సెక్షను issue చేశారు. కాంగ్రెసువారుకూడా మీటింగు పెట్టటములేదు, మీరువద్దు, వారువద్దు, ఎవరూ మీటింగు పెట్టవద్దండి" అని బ్రతిమాలుకుని చెప్పాడు పైగా. తాడిమర్రి అనే గ్రామము చాలా తగాదాలు వున్న గ్రామము, మీటింగు పెట్టితే చాలా ప్రమాదపరిస్థితులు ఏర్పడుతాయి. గనుక పెట్టవద్దని చెప్పి బ్రతిమాలుకుంటె, ఆ head constable తో "నీవు ఎవరయ్యా చెప్పటానికి? నేను మీటింగు పెట్టేది, పెట్టేదే, నీకేమి తెలుసు? నీ Sub-Inspector కు ఏమితెలుసు? పో!" అని అన్నాడట. నిజానికి ఆ head constable వెళ్ళి బ్రతిమాలుకుంటే, "కాదు పొమ్మంటే," యిక వారు అరెస్టుచేయక యేమిచేస్తారు? అందువల్ల అతనిని అరెస్టుచేశారు. ద్రోణాచలంలో మీటింగు జరిగితే కాంగ్రెసువారిని నూరుమందిని అరెస్టుచేయలేదా? అట్లాగే, ఎవరైనా చెప్పితే వినకుండాపోతే ఎవరైనా ఏమిచేస్తారు? "నేను అపని చేసేది చేసేదే" అని అంటే, అరెస్టు చేయకుండా ఏమిచేస్తారు? కాని అక్కడ ఉద్రిక్తస్థితి యేమి రాలేదనుకోండి.

SRI P. SUNDARAYYA :—ఎన్నికల సందర్భములో కాంగ్రెసు కమ్యూనిస్టులు పోటీచేసిన చోట్లలో కాంగ్రెసు నాయకులమీద ఎన్నిస్థలాలలో కేసులు పెట్టారో, ఒక్క ఉదాహరణఅయినా చెప్పగలరా?

THE HON SRI N. SANJEEVA REDDI :—అలాంటి దానికి short notice question యిస్తే, దానికి వివరాలు తెస్తాము. కాని, యిప్పుడదికాదు

SRI N. Sanjeeva Reddi] [28th July 1955

point. సుందరయ్యగారిని underground లో వుండగా అరెస్టుచేశారు కాబట్టి, సంజీవరెడ్డిగారినిగూడా అరెస్టుచేయమని అంటె, అట్లా బేరముపెట్టుకుంటే నేనుమటుకు జైలుకుపోలేను. బాబూ! అదిఅంతా నావల్ల అయ్యేపనికాదు. కమ్యూనిస్టులు చేయగలపనులు నేనుగూడా చేసేటట్లయితే, అందుకు నేను సిద్ధముగావుండాలి. నేనుమటుకు అటువంటిపనులు చేయలేను గనుకనే, నేను అరెస్టుకు సిద్ధముగాలేను. అదికాదు విషయము. తగాదాలు పెట్టుకున్నచోట్లలో ఎవరిని అరెస్టుచేశారు? లేదా కాంగ్రెసువారు ఆ విధంగాచేస్తే, అరెస్టుచేయలేదు అంటే, అప్పుడు నేను ఒప్పుకుంటాను. కాని, యింతమంది కమ్యూనిస్టులను అరెస్టుచేస్తున్నారు కనుక, అదే proportion లో కాంగ్రెసువారినికూడా అరెస్టుచేయమని అంటే, యిప్పుడు ఎసెంబ్లీ అయిపోయిన తరువాత, వెంటనే చాలామందిని అరెస్టుచేయవలసి వస్తుంది; కాబట్టి అది సాధ్యముకాదు.

తరువాత సుందరయ్యగారు మాట్లాడుతూ "మేము underground కు పోవలసిన పరిస్థితులలో 1948-1951 సంవత్సరాలమధ్య ఆరకంగా నిప్పులు పెట్టవలసివచ్చింది. బలవంతాన దుర్మార్గాన్ని దుర్మార్గంతో ఎదుర్కోవలసి వచ్చింది. ఇప్పుడుకూడా అటువంటి పరిస్థితులువస్తే మరలఆపనే చేస్తాము," అని అన్నారు. "పోలీసులు ఎందుకు? అంతా శాంతముగా వుందిగదా! ఎందుకు యింతఎక్కువ సంఖ్య? పోలీసులను తగ్గించండి" అని విశ్వేశ్వరరావుగారు మరికొందరూచెప్పారు. ఈ విధంగా కమ్యూనిస్టు సభ్యులు రకరకాలుగా విమర్శించి మాట్లాడారు. అంటే, "పోలీసులను తీసివేసిన తరువాత ఆపని చేస్తాము" అనే ఉద్దేశమా? వారుచెప్పిన ధోరణినిబట్టిచూస్తే, దానిఅర్థము ఆవిధంగా కనబడుతున్నది.

SRI P. SUNDARAYYA :—నేను చెప్పినది మరొక పర్యాయము స్పష్టము చేయదలచుకున్నాను. ప్రభుత్వము దౌర్జన్యముచేసి మమ్ములను మరల అడవులలోకి కొట్టితేమాత్రము, మేము మరల చేయవలసివస్తే అదే రకంగా చేస్తామని, ఆబాధ్యత అంతా సంజీవరెడ్డిగారిమీదనే వుంటుంది. ఆసంగతిమాత్రము స్పష్టంగా గుర్తించాలి.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అంతే. సుందరయ్యగారు సరీగానే చెబుతున్నారు. వారుచెప్పింది యేమిటంటే, "మరల పరిస్థితులువస్తే మేము యిక్కడ వుండము" అని అన్నారు. వారుఅంటే,

కమ్యూనిస్టుల దృష్టిలో "ఆ పరిస్థితులు." ఇక ప్రభుత్వము దృష్టిలో "ఆ పరిస్థితులు" అంటే "ఆ పరిస్థితులు వచ్చినా సరిఅయినవే. ఆనాటి పరిస్థితులు యీనాడు వచ్చినాగూడా అవీ, సరైనవే" అని మేము చెబుతున్నాము. కాబట్టి కమ్యూనిస్టులకు సరైన పరిస్థితులు వచ్చినప్పుడు ఇక్కడ వుండరన్నమాట. మళ్ళీ వారు వెళ్ళిపోతారు అన్నమాట. కాబట్టి పోలీసులను యిప్పుడే తగ్గించండి, అని చెప్పటము న్యాయముకాదు. అలాంటిభావము వారిమనస్సులలో వున్నంతవరకూ, "పోలీసులను తగ్గించండి" అని చెప్పితే అది లాభంలేదు. అటువంటి భావాన్ని మానుకొని, అలాంటి పరిస్థితులు రాకుండా చేస్తామని వారు చెప్పినప్పుడే, అది సాధ్యమవుతుంది కాని, భావముఅంతా వేరుగా మనస్సులోనే పెట్టుకొని, పూరకనే పోలీసులను తీసివెయ్యండి అంటే, అది సాధ్యముకాదు. కాబట్టి అలాంటి పరిస్థితులను ఏవిధంగానూ రానివ్వకూడదు. రావటానికి ప్రయత్నించనూకూడదు. రానివ్వరనే నేను ఆశిస్తున్నాను.

తరువాత ఎక్కడనో తాండాలను సోదాచేశారని అన్నారు. వాళ్లు regular గా డబ్బాలకుడబ్బాలు కుండలలో arrack తయారు చేస్తున్నారు. అలాంటప్పుడు సోదాలుచేయకపోతే ఎట్లా? మార్కాపురంలో ఎక్కడో తాండాలను సోదాచేశారని చెప్పినది నాకు తెలియదు. ఆ Particular instance మాత్రము నాకు తెలియదు. సోదా చేయడము తప్పు అంటే ? వాళ్ల యిళ్లలోకివెళ్లి, సారాయివుందో, యింకా యేమైనా వుందో, అని సోదాలు చేయకపోతే, ఎట్లా ? పోలీసువారు తన్నినారనో, లేకపోతే యింకా ఏమైనా చేశారనో, అటువంటిది యేమి చెప్పలేను. వాళ్లు arrack కాచుచున్నారో లేదో, పరీక్షచేయటానికికూడా సోదాచేయవద్దని అంటే యింక యిక యీ administration ఎన్నాళ్లు నడుస్తుంది? ఎక్కడైనా ఏదైనా దుర్మార్గము చేసివుంటే అటువంటిది ఏదైనా ఒక particular instance ప్రభుత్వ దృష్టికి తీసుకొనివస్తే అప్పుడు ప్రభుత్వము చర్య తీసుకోవడము తప్పకొదు అని నా అభిప్రాయము. అది తప్పు అని తెలిస్తే, నేను చర్య తీసుకొనేవాణ్ణే. సోదాచేయడము నాకు యిష్టమే. తాండాలను సోదా చేయవద్దనడం సబబు కాదు. తప్పు అని భావించవద్దు. సోదాలుచేయవద్దనిచెప్పడం సబబుకాదని కమ్యూనిస్టు నాయకులు గుర్తించాలి. అది చేయకపోతే, demoralisation వస్తుంది.

గ్రామాలపైన దాడిచేశారని అన్నారు. పోలీసులు ఎక్కడికైనాపోతే, అది దాడి అని అంటారు. ఎక్కడిక్కైనా పోతేనే, దానికి దాడి అని అంటే, ఎట్లా

ఒక యింటికిపోయి భర్తను అరెస్టుచేస్తే, భార్యతిట్టిందని అన్నారు. నిజానికి, యింటికి పోయి భర్తను అరెస్టుచేస్తే, భార్యకు కోపమురాదా ? అది స్వభావసిద్ధమేగదా ! భర్తను అరెస్టుచేస్తే, ఎటువంటిభార్యకైనా కోపమువస్తుంది నిజమే.

SRI P. SUNDARAYYA :— రాత్రివేళ, వారంటులేకుండా వెళ్లవలసిన అవసరము యేమి వచ్చింది ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— పగలు చిక్కకపోతే పోలీసులుమాత్రము ఏమి చేయగలరు ? అతను యింట్లోవుండే సమయముచూచి వెళ్లి అరెస్టు చేస్తారు. అతను రాత్రివేళ వున్నాడుకొబట్టి అరెస్టుచేశారు.

Sri P. SUNDARAYYA :— ఈరోజులలో దొరకకుండా వున్నవారు ఎవరూ వుండరు. మంత్రిగారు పోలీసు ఉద్యోగస్థులను సమర్థించటానికి చేసిన సంఘటనలను తెచ్చి, దొరకకుండా పోయినాడు, అని అన్నారు. దొరకకుండా పొయ్యేవాడు, యింట్లో పడుకోడు. ఆ సంగతి మంత్రిగారికి తెలుసు ననుకుంటాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :— అది సరే. అరెస్టు చేశారు. రాత్రో, పగలో, ఎప్పుడో, అరెస్టుమాత్రము చేశారు నిజమే. భర్తను అరెస్టుచేస్తే, భార్య అనేది ఎవరైనా బాధపడుతుంది. ఆమె నిజంగా తిట్టుతుంది. ఆడవాళ్లు సామాన్యంగా కోపమువస్తే, స్వభావసిద్ధంగానే తిట్టుతారు. తిట్టుతున్నప్పుడు పోలీసువారు తిరిగి ఏమైనా అనివుంటారు. అంతేగాని పోలీసులు తన్నారని గాని, యింకొ ఏదైనా దుర్మార్గపుచర్య చేశారనిగాని, యేమిచెప్పలేదు. ఏదో పోలీసుఆయన తిట్టినాడనిమాత్రము అన్నారు. "పోలీసు ఆయన నేరము చేశాడని" కమ్యూనిస్టు నాయకులు అంటున్నారు. అయితే ఆమె ఒక తిట్టు తిట్టితే అతడు నాలుగు తిట్లు తిట్టినాడేమో. నిజంగా He is after all, a constable. భర్తను అరెస్టుచేశారు. తరువాత అతనిమీద కేసుపెట్టారో లేదో, నాకు తెలియదు. ఆ కేసు సంగతి తరువాత యేమి జరిగిందోకూడా నాకు తెలియదు. అతనినిillegalగా అరెస్టుచేస్తే, దానికి remedy లేదా ? ఏ కేసుకైనా evidence పెట్టుకొని పోతే, దానికి తప్పకుండా remedy వుంటుంది. అన్నిటికికూడా remedies వుంటాయి. Remedies లో ఎన్నో విధాలు వున్నవి. గ్రామాలపైన దాడిచేసి, కుండలు పగులకొట్టారని, తిట్టారని అన్నారు. కాని తలకాయ పగులకొట్టారని మాత్రము అనలేదు, దానికి కొంత సంతోషమే.

కళ్యాణదుర్గము సంగతి చేప్తాను. అయితే పన్నులు వసూలుచేయడం తప్పా? చట్టసమ్మతంగా చేయాలా? వద్దా? చట్టసమ్మతంగానే చేయాలి. దీనికి ఎవరూ కాదనరు. కాని ప్రెసిడెంటుకు వసూలు చేయటానికి అధికారము వున్నదా? చట్ట సమ్మతంగా చేయకుండా ప్రెసిడెంటు మెంబర్లు అందరూపోయి, యిళ్లలోకి ప్రవేశించి, వసూలు చేయడం, ఏ Constitution లో వుంది? ఏ చట్టంలో వుంది? ఏ రూల్సులో వుంది? అక్కడ Executive-Officer వున్నాడు. ఆయన వెళ్లి వసూలు చేయమంటే చేస్తాడు. అంతేగాని, ప్రెసిడెంటు, మెంబర్లు అందరూ దాదాపు నూరుమంది యితరులు కలిసి యింటింటికి వెళ్లి, యిళ్లలో దూరి యివ్వు పన్ను యివ్వు! ముండా! అని నోటికి వచ్చిన భూతులుతిట్టి, పన్ను తెమ్మంటే, ఇట్లా వసూలుచేసేసిద్ధాంతము నేను ఎక్కడా చూడలేదు. ఈ విధంగా పన్ను వసూలు అమలు జరుపుతూవుంటే, పోలీసులు అడ్డము రావద్దా? ఆ విధంగా వసూలుచేస్తున్నప్పుడు, ఆడవాళ్లు తిట్టుతుంటే, పోలీసులు interfere కాకుండా ఏమి చేయాలి? బజారులో. నూరుమంది యిళ్లలో ప్రవేశిస్తూవుంటే interfere అయి, "అలా చేయవద్దు, తప్పు" అని చెప్పి. వాళ్లను వెళ్ళపొమ్మన్నారు. Executive-Officer వుండగా మీరు ఎందుకు వచ్చారు? అని ప్రెసిడెంటును అడిగారు. ఇళ్లలోదూరి జప్తి చేయటానికి ప్రెసిడెంటుకు అధికారములేదు. చట్టసమ్మతంగా చేయాలనే గాని, యిళ్లలోకిదూరి వసూలుచేయమని ఎక్కడనూ లేదు. పన్నులు వసూలుచేయవద్దని పోలీసులు చెప్పలేదు. ఆ విషయము నేను విచారించాను. తరువాత దీన్ని తన్నారు. దాని తన్నారు అని నాతో చెప్పారు. బజారులో ఆడదాన్ని పట్టపగులు తన్నితే సాక్ష్యము దొరకకపోయింది. అందరికి వాడలుగానేవుంది. ఎవరైనా కూడా తన్నడమేనా? వేరెవరికి చెప్పుకుందామన్నా దిక్కు లేకుండా వున్నది. అక్కడ వున్నవారు కమ్యూనిస్టులనండి, యింకొకరు అనండి, నాకు అక్కడ ఎంతమందో చెప్పారు. ఈ ఆడమనిషిని తన్నారు. ఆమెను తన్నారు అని ఎంతోమంది చెప్పారు. పోలీసువాళ్లు మటుకు ఆ స్త్రీని రక్షించటానికి పోయినారా? పోలేదు. ఆమెను తన్నినతరువాత పోలీసులు వెళ్లారు. ఎవరమ్మా ఎవరు తన్నినారని ఎవరైనా అడిగితే, "మేము చూచాముగాని, మేము సాక్ష్యము చెప్పము, బాబూ! రేపు ప్రొద్దున మమ్ములనుగూడా తంతారు. అందుకని మేము చెప్పము" అని అన్నారు. నిజానికి ఆ వీధిలోని వారందరూ ఆ ఆడమనిషిని తన్నడము చూచారు. అయితే సాక్ష్యము చెప్పటానికి ఎవరూ రారు. "అలాంటి పరిస్థితులలో మీరు వుంటే పోలీసులు మిమ్ములనుకూడ రక్షించ లేరు" అని నేను చెప్పాను. సాక్ష్యము చెప్పటానికి మీకు యోగ్యత లేకపోతే మిమ్ములను ఏ ప్రభుత్వము గూడా రక్షించలేదని ఆ నాడు బహిరంగ సభలో నే చెప్పాను. ఈ విధంగావుంటే మీరు ముందు

Sri N. Sanjeeva Reddi] [28th July 1955

కురాలేరు అని ఎప్పుడో చెప్పాను. నేను ఏ పోలీసు ఆఫీసరునిగూడా పిలచి ఫలానా మనిషిని తన్నమని చెప్పలేదు. చెప్పనుంటే అప్పుడే తన్నించి, అరెస్టు చేయించి వుండే వాడిని. ఆ మనుష్యులను arrest చేయలేదు. సుఖంగా యిప్పటికి యింకా యింట్లోనే వున్నారు. ప్రజలతో చెప్పివచ్చాను. "ప్రతివారు ఆత్మ విశ్వాసము కలిగి వుండండి. ఎవరో దుర్మార్గుడు ఒక స్త్రీని యింతమంది ఎదుట తన్నుతూంటే, మీరు అందరు చూస్తూవుండి, ఆమెను రక్షించకపోతే, ఎందుకు యింతమంది మీరు బ్రతికి వుండడము, ఏమి ప్రయోజనము" అని చెప్పివచ్చాను. ఆవిధంగా చెప్పడము తప్పుకాదని అంటాను. మరొక పర్యాయము అటువంటి అవకాశము వస్తే, ఇంకొకసారి చెప్పాలని నా ఉద్దేశ్యము. ఆడదాన్ని ఒక్కదాన్ని బజారులో తన్నుతూవుంటే, యింతమంది మగవాళ్లు దిక్కులుచూస్తూ పూర్తిగాని సాక్ష్యము చెప్పటానికిగూడా రాకుండా నిరాకరిస్తూ, యిళ్లలో దూరి తలుపులు వేసుకొంటే, అలాంటి ప్రజలకు నేను వుత్సాహము యివ్వకపోతే, వారికి ధైర్యము యివ్వకపోతే, ఎందుకు యీ Home Department, ఎందుకు యీ పోలీసులు అని అంటున్నాను. కాబట్టే నేను ఆవిధంగా పోత్సాహమిచ్చాను. దాని వల్ల తప్పేమిలేదు. ఎవరిపైనా కేసు పెట్టమని చెప్పలేదు. నేను చెప్పటమే వస్తే, వాళ్లు జైలులో వుండకుండా యిన్నాళ్లు బైటవుండేవారేకాదు. అలాంటి low level కు administration ను మాత్రం యీ Home Ministry తీసుకొని పోదు అని మీకు హామీ యిస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—మీరు చెప్పారని నేను చెప్పలేదు.

THE HON SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు చిరిచింతల సంగతి సుందరయ్యగారు చెప్పారు. డిప్యూటి కలెక్టరుగారు మూడు, నాలుగు నెలల తరువాత రాజీ చేశారు. ఆ గ్రామము గుడివాడ తాలూకాలో గుడివాడకు మూడు, నాలుగు మైళ్లలో ఉన్నది. ఈ విషయము గురించి ఇంతకు ముందే మిత్రులు నాకు చెప్పారు. నేను 21 వ తేదీన గుడివాడలో వున్నాను. తప్పువుంటే నేను తప్పకుండా విచారిస్తాను. పోలీసులు వెళ్లితే తప్పు వుందని వీళ్లు చెప్పలేదు. కేసు ఉద్రేకంగా, తీవ్రంగా నడవలేదని తప్ప వాళ్లు ఏమిచేశారోఅనివీళ్లు ఎవరు చెప్పలేదు. అక్కడ ప్రజలనుంచి, ఈ ఎన్నికలు అయిన దగ్గరనుంచి ఎన్ని కుప్పలు తగులబెట్టారో తెలుసుకోమన్నాను. కుప్పలు తగలబడ్డాయి. ఇళ్లు తగుల బడ్డాయి. కూలివాళ్లను బయటవాళ్లను రానివ్వరు. వాళ్లు కూలీకి పోరు. అలాంటి పరిస్థితులలో రైతులు ఏమి చేయాలి? బయటనుంచి కూలి వాళ్లను తెచ్చుకుంటే వారికి అడ్డము పోయ్యి

తగాదాలు, రైటింగులు ఎన్నో జరుగుతున్నాయి. ఇవన్నీ కూడా కేసులు జరుగుతూనే వున్నాయి. అలాంటి పరిస్థితులలో ఏమైనా చేయడానికి వీలవుతుందేమో అని Deputy Collector గారు అక్కడకు పోయారు. రెండు పార్టీలకు రాజీ కుదిర్చారు. ఇప్పుడు ఏదో చేసుకుంటున్నారు గాని, ఇప్పటికైనా పరిస్థితులు తృప్తికరంగా లేవని నేను చెబుతున్నాను. కూలీలకు సలహా యివ్వగలిగిన మిత్రులు ఎవరు అయినా అక్కడపోయి యిరుపక్షాలకు రాజీ చేకూర్తే బాగుంటుంది.

Sri V. KURMAYYA :—కమ్యూనిస్టులు రైతులపైన చాలా దురాగ్రాలు చేస్తున్నారు. అవి నా నియోజకవర్గములో జరిగినవి. నాకు బాగా తెలుసు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఎక్కడ అయినా కొన్ని కొన్ని తగాదాలు వస్తూనే వుంటాయి. మీకు తెలిసి వస్తాయని చెప్పను. లేదామీరందరు రెచ్చగొట్టండని నేను చెప్పను. కాని ఈ డిప్యూటీ కలెక్టరు పోయి వాళ్ళకు ఎట్లా రాజీ చేకూర్చారో, అట్లాగే మనం అందరూ కూడా పోయి ఆ రెండు పార్టీలకు సఖ్యత చేకూర్చడానికి వీలవుతుందేమో ప్రయత్నము చేస్తే, శాంతి యుతంగా బ్రతికి యుంటారు. చట్ట సమ్మతంగా కేసులు పెడితే శాంతి ఎప్పటికి ఏర్పడదు. కేసులు పెట్టారు, కూలీలను శిక్షించారు, రైతులను శిక్షించారు అని అంటే యింకా అది బలపడుతుందిగాని, శాంతిభద్రతలు చేకూరుతాయని మీకు ఏమైనా విశ్వాసమువుందా? నాకు మాత్రము ఏమీ విశ్వాసము లేదు.

ఎవరో శకుంతలమ్మ అనే స్త్రీని (స్త్రీ పేరు చెప్పకుంటే బాగుండేది) ఎత్తుక పోయి జుట్టుకత్తరించారన్నారు. వారు ఎవరో ఏమి కత్తరించారో మరి యేమిటో తెలియదు. ఆయన దుష్యంతుడో ఎవరో ఆయన పేరు తెలియదు, మరచిపోయాను. కత్తెరించినవారు ఎవరో వారిపైన తప్పకుండా కేసు పెడుతారు. కాని రాత్రిళ్లు ఆడదానిని ఎత్తుకపోవడము, జుట్టు కత్తిరించడము, ఇది యేమి అంత పెద్ద గౌరవమైన కార్యముకాదు. ఘనమైన కార్యముకాదు. అలాంటివాడు కాంగ్రెస్‌వాడు అని మేము చెప్పకోము. మీరు ఆవిధంగా భయపడవలసిన అవసరములేదు. అలాంటి ఘనమైన కార్యముచేసినవాడ్ని కాంగ్రెసు ఎప్పటికి రక్షించదు. దానికి మామూలు చర్య ఏదో పోలీసువారు పుచ్చుకుంటారు. అది ఏ పరిస్థితుల్లో జరిగిందో, ఆమె యెందుకు రాత్రిళ్లు కారులో వచ్చిందో అది మొదటి పాయింటు. మరియెందుకు ఆమెను బందరు వరకు తీసుకుపోవలసివచ్చిందో, తరువాత ఎందుకు జుట్టు కత్తరించవలసిన పరిస్థితులు కలిగాయో, అది రెండవ పాయింటు. ఇదిఅంతా పోలీసువారు విచారిస్తారు. రెస్యూలరు

కేసు జరుగుతుంది. మరి రెగ్యులరు కేసులు ఇలాంటివి ఎన్నో జరుగుతూవుంటాయి. Political bias దీనికి వుందంటారా ? I tell you it does not add to the credit of Congress. మేము దానిని ఎప్పుడూ ఒప్పుకోను. అలాంటివాడు మావాడు అనిగాని, వాడిని సమర్థించాలనిగాని మేము ఎప్పుడూ అనము.

పేటపాలెంలో యేదో గుడ్డలు విప్పించి గోచులు పెట్టించారన్నారు. కొటూరు కట్టుకథలే మళ్లీ బయలుదేరినాయన్న మాట. అయితే ఎంతవరకు అభివృద్ధి చెందాయంటే అప్పుడు కొటూరులో గుడ్డలు అన్ని వూడదీశారు అన్నారు, ఇప్పుడు గోచులు పెట్టారు అన్నారు. దానికి దీనికి కొంచెము గోచీపాత అంత తేడావున్నది. అంతవరకు అయినా సంతోషిస్తాము. ఇది యిప్పటివరకు నాకు తెలియదు. నేను దానిని ఏమీ హర్షించను. గుడ్డలు వూడదీశారు, గోచులు పెట్టించారంటే ఇది ఏమిటో నాకు అర్థం కావడంలేదు. నాకు ఇంతవరకు పోలీసురిపోర్టులు కూడా రాలేదు. నాకు సాధారణంగా ఆప్రాంతమునుంచి తప్పకుండా రిపోర్టులు వస్తూంటాయి. కాని ఈవిషయంలో యేమీ రాలేదు. పోనీమిత్రులు అయినా ఇంతవరకు ఈవిధముగా గోచులు ఊడదీశారు అని చెప్పారా అంటే ఎవరూ చెప్పనూలేదు. ఎవరు యిట్లా ఊడదీసి చేసివుంటారు అంటున్నాను. ఈ కట్టుకథలు అంత వుపయోగములేదు. ఇది పబ్లిసిటీకిగాను అసెంబ్లీలో చెప్పేదానికి బదులు ముందు నాకు చెప్పివుంటే ఎంత వుపయోగపడేది అని నేను అనుకొంటున్నాను.

SRI P. SUNDARAYYA :—మీరు పత్రికలు చదువుతారు అనుకొంటాను. కనీసము మీ డిపార్టుమెంటుఅయినా చదువుతుంది అనుకొంటున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI:—నేను పత్రికలు అన్నీ చదువుతాను. కాని విశాలాంధ్ర పత్రికలో ప్రతిదినము వ్రాస్తున్నవన్నీ ఎంక్వయిరీ చేయాలంటే ఇప్పుడువున్న డిపార్టుమెంటు చాలదు. ఇటువంటి impossible things demand చేయకండి. తెలుగుపత్రిక విశాలాంధ్రతోసహా చదువుతాను. కాని అంత సీరియస్‌గా నోటీసు తీసుకొనే పరిస్థితులు విశాలాంధ్ర పత్రికలోలేదు. దానిలో వ్రాసిన వ్రాతలు నాకుతెలుసు. దానిలో ఎంతవరకు సత్యము వుందోకూడా నాకుతెలుసు. we don't waste our time to enquire into the agitation for Visalandhra.

పోంచేటలో ఫైరింగ్సు జరిగాయి అన్నారు. ఇన్‌ఫర్‌మేషను అయినా సరిగా తెచ్చిఇస్తే నేను సంతోషపడుతాను. అక్కడ ప్రొహిబిషనుషాపు ఏదో చేశారని ఏదో అయిందని పోలీసు రిపోర్టువచ్చింది. అది ఎంక్వయిరీ జరుగుతోంది. పోలీసు

వారికి దానితో సంబంధములేదు. కరెక్టు ఇన్‌ఫర్‌మేషను తెప్పించుకోవలసివున్నది. ప్రొహిబిషను శాఖవేరు పోలీసు వేరు అని అంటే, రేపు ప్రొహిబిషను డిమాండు వస్తుంది. ప్రొహిబిషను మంత్రిగారు వున్నారు. వారు ఆ విషయము ఆలోచిస్తారు. దానివిషయములో ఏదైనావుంటే చర్చించవచ్చు. నాకేమీ అభ్యంతరములేదు. కాని పోలీసుకు మాత్రము సంబంధం లేదు అని నేను కరెక్టు ఇన్‌ఫర్‌మేషను మీకు యిస్తున్నాను. 107 వ సెక్షను గురించి కొండయ్యగారు ఏదో మాట్లాడారు. దానినిగురించి యిప్పుడు ఎక్కువగా చర్చించడము అనవసరము అనుకొంటాను. దానివల్ల ఎవరు అయినా న్యాయంగా జీవిస్తాము అనేవాళ్ళకు ఇబ్బందులు కలిగాయి అని నేను ఏమీ అనుకోనను. కొంచ రటూ యిబూ అల్లరిగావుండి, దౌర్జన్యపూరితంగావుంటే ఏదో అలాంటివాళ్ళకు ఏమైనా ఇబ్బందులు కలుగుతాయి ఏమోఅని అందరిని తీసుకుపోయి జైళ్ళలో పెట్టి...

SRI P. SUNDARAYYA :—బెజవాడ శివకోటారెడ్డిగారి కేసు మీ ముందు చాలా రోజులనుంచి వున్నది. ఆయనకూడా 107 వ సెక్షను క్రింద రావడము అనేది ఏమిటి ?

SRI B. RAMAKRISHANA REDDI :—అది జరిపించాల్సిందేనండి. గ్రామాల్లో కుప్పలు తగులబెట్టె ఆ రకంగా దుర్మార్గాలు చేశారు కాబట్టి 107-వ సెక్షను తీసి వేయకూడదు అని నాఅభిప్రాయము. దానిని ఖచ్చితంగా పోలీసువారు న్యాయంగానే అమలు జరిపారు. అందువల్ల తొలగించడము మాత్రము చాలా తప్పు అని నా అభిప్రాయము.

THE HON. SRI N. SANJEEVA REDDI :—వారు తొలగించ వద్దు అని చెబుతున్నారు, మా నేస్తున్నాము. సుందరయ్యగారు ఇంకొక పాయింటు చెప్పారు. బజార్లలో చేతులకు బేడీలువేసి తీసుకు పోతున్నారు, అది ఎవరికి గౌరవ ప్రదము అన్నారు. రగడ చేసినవాడికిగాని, కూనీలుచేసినవాడికిగాని బేడీలు వేసితీసుకుపోవడము ఎవరికి గౌరవ ప్రదముకాదు? కూనీలు చేయడము వారికి గౌరవప్రదమా? దొంగతనము చేయడము వారికి గౌరవప్రదమా ? నేరం వుండడమే ఎవరికీ గౌరవము కాదు. అలాంటి వారు ప్రతి దినము దొంగతనము చేసో, కూనీచేసో పారిపోతుంటే వారిని పట్టుకోవడము అవుతుంది. బస్సులలో తెస్తారు గాని వారిని 20,30 మైళ్లు నడిపించుకురారు. బస్సునుండి సబ్ జైలుకు పోవాలి. ప్రిజనరు వస్తున్నాడు అని బస్సు స్టాండులో మోటారుకారు పెట్టమన్నారా ? ఎట్లా వారిని ఇంత రద్దీ చోట్లలో తీసుకురావడం మరి వారు కొంచెముకదలిపోతే మరల పట్టుకోవడము కష్టము అవుతుంది.

కొంచము habitual క్రిమినల్ అయితే వాడు నాలుగు పర్యాయములు జైలుకు వెళ్లితే వాడికి తప్పకుండా తప్పించుకుపోవడము బాగా తెలుసును. మీరు చిక్కారులే అని వెంకటేశ్వర్లుగారు వీరు ఎవరో అనవచ్చును. మీకన్నా యింకా ఎక్కువ ఆరితేరిన వారు వాండ్లు వాళ్లు. ఇంకా సులభంగా తప్పించుకొని పారిపోగలరు. తప్పించుకుపోతె ఈ ఫూరిలోనే పట్టుకోలేము. కాబట్టి అటువంటివాడిని బేడీలువేసి తీసుకుపోకుండా ఎట్లాగు తీసుకువెళ్లడము. అందులో క్రిమినల్ వాడికి యింకేమి పనిలేదు. దొంగతనము చేయడము, జైలుకు పోవడము అక్కడ ఆరునెలలువుండడము మరల రావడము ఆ వృత్తి మరల అవలంబిస్తాడు. అనేకంగా నే వారికి బేడీలువేసి తీసుకుపోతున్నారు. కాని ఎవరినో అనమర్యాదచేసి దుర్మార్గంగా ఆ రకంగాచేసి తీసుకుంటే తప్పే అది నేనూ ఒప్పుకుంటాను. ఆ రకంగా చేసివుండరనుకుంటాను. అదికాదు. బజారుల్లో, ఎవరినో పట్టుకుపోతూవుంటే చూచివుంటారు.

Sri P. SUNDARAYYA :—చేతులకువేస్తే ఫరవాలేదు. చేతులకు వేసిన వాడు ఎట్లాగయినా తప్పించుకుపోలేడు. కాళ్లనుంచి చేతులకువేసి తీసుకు పోతూంటే అది అంతా ఏమిటి ?

6-00 p. m.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అంటే వారు ఎంత పెద్ద నేరస్తుడో దానినిబట్టి ఆలోచించుకోండి. అందరికి అట్లా వేయరు ఎప్పుడు సాధారణంగా ఎప్పుడో నూటికి ఒకడికి ఆ రకంగా వేస్తుంటే వాడు ఎంత పెద్ద నేర స్తుడో అయివుంటే వేస్తారు కాని అంతసులభంగా వేయరు. ఆరకంగా గొలుసులువేస్తే వారికివచ్చే ఆనందములేదు. ఆ రకంగా ఎక్కడకూడా జరిగివుండదు. Salary ని గురించి సుందరయ్యగారు చెప్పారు. నా ఉపన్యాసము మొదటిలోని కానిస్టేబులుకు నెలకు రు. 50 లు పైననే వస్తుందనిచెప్పాను. సుందరయ్యగారు మినిమము రు. 50 లు ఉండాలని చెప్పారు. ఇప్పుడు రు. 30 లు minimum basic salary, రు. 19 లు, dearness allowance plus house allowance plus dress allowance. Dress వేసుకుంటున్నారు. కాబట్టి dress allowance వద్దంటారా, తీసివేయండి, మొత్తంవారికి ఇచ్చేజీతం రు. 50 లకు తక్కువలేదు. 30 + 19 = 49 + house allowance He is getting more than Rs 50/ now The salary of a constable was Rs 18/ a few years ago in the Madras State. 18 నుంచి మెల్లగా పైకి పోతున్నది. ఇప్పుడు రు. 30 లకు వచ్చాము. D. A. తో కలిసి రు. 50 లకు

వచ్చాము. ఇవన్నీ జరుగుతున్నాయి. నెమ్మదిగా మీరు చెప్పిన minimum salary కు దగ్గరగా చేరుకున్నాము. మీకు మీరు gulf ఎంత తక్కువ అయినదో ఆలోచించండి.

SRI P. SUNDARAYYA:—నేను కోరిన pay scale లో రు. 50 లు, minimum ఉండాలని చెప్పాను. D. A తో కలుపుకొని మీరు రు. 50 లు అన్నారు. నాస్కేలులోకూడా D. A. ఉంటుంది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—సరే అట్లాఅయినా difference కొద్దిగానే ఉన్నది. కాని కొంతవరకు అయినా అభివృద్ధివున్నదని మీరు అంగీకరింపక తప్పదు. రు. 100/- లు జీతం మనము ఇవ్వాలని వెంకట్రాజు గారు చెప్పిరి. అందరూ అంగీకరించక తప్పదు. Minimum basic pay రు. 100/-లు ఉండాలంటే మాకేమీ ఆక్షేపణలేదు. రు. 18/-లు ఇచ్చిన కాని స్టేబులు జీతం క్రమంగా పెంచుతున్నాము. నెమ్మదిగా 2 రూ॥లు 3 రూ॥లు, 4 రూ॥లు ఆవిధంగా పెంచుతున్నాము. Countrywide గా ఈ పెరుగుదల రావలయునుగాని, ఒక్క కానిస్టేబులుకో లేక ఒక పోస్టుఆఫీసు జవానుకో ఇస్తే ఏమీ లాభంలేదు. General గా ప్యూనులు అందరికీ ఇవ్వాలి. వీరందరికి రు. 30/- లు ఇచ్చి కానిస్టేబులుకు రు. 50/- లు ఇస్తున్నా ఇంకా చాలడములేదు. వారికిమాత్రము యివ్వండిఅంటే; మనదేశములో General standard of living ఎక్కువై poverty తగ్గితే అప్పుడు చూడవచ్చును. రెండవ పంచవర్ష ప్రణాళికలో మనదేశముయొక్క ఆర్థికపరిస్థితి పెరిగినప్పుడు తక్కువజీతాలు ఇచ్చే వాళ్లకు రు. 100/-లు ఇవ్వడానికి ప్రయత్నిస్తాము. పోలీసువారికి రు. 50/లు ఇస్తున్నాము. రు. 40/-లు తీసుకుంటున్నవాళ్లు, రు. 30/-లు తీసుకుంటున్నవారు కూడా ఇంకా చాలామంది ఉన్నారు. It is worth repeating again. Secretariat లో B. A. లు M. A. లు ప్యాసుకయిన గుమాస్తాకు, కానిస్టేబులు కన్నా ఎక్కువ ఇస్తున్నామా అని అడుగుతున్నాను. Elementary school teachers కు, secondary grade teachers కు యిచ్చేజీతముకంటే కానిస్టేబులుకు ఎక్కువే ఇస్తున్నాము. మన general standard పెంచాలి. అది పెరిగినప్పుడే ఇవన్నీ ఇంక్రీజు చేయడానికి వీలుంటుంది. ఇప్పటికి కొంత అభివృద్ధి జరిగింది.

SRI P. SUNDARAYYA :—ఒక్క పోలీసుకే ఇవ్వమని కాదు. చిన్న చిన్న ఉద్యోగులందరికీ, అన్ని departmentలలో వున్నటువంటివారికి, అదే రకంగా

Sri P. Sundarayya] [28th July 1955

చిన్న చిన్న ఉద్యోగస్తులందరికికూడా ఇవ్వమని మేము demand చేస్తున్నాము. కాని పోలీసులకే ప్రత్యేకంగా ఇవ్వమనికాలేదు. అందరికీ ఇవ్వమనే.

THE HON. SRI N. SANJEEVA REDDI:— మిగిలినవారందరికన్నా పోలీసువారి విషయములో చాలా better గా వున్నదని చెబుతున్నాను. ఇక్కడ సిటీలో ఉన్న పోలీసులకు సిటీ అలవెన్సు ఇస్తున్నారుకాని, కర్నూలులో నివసిస్తూ వున్న తాలూకాపోలీసులకు ఎవ్వరికీ ఇవ్వడము లేదన్నారు. ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత ఇక్కడ సిటీలో చాలినంతమంది పోలీసులు లేకపోయారు. అప్పుడు అనంతపురం జిల్లానుంచి కొంతమందిని, నెల్లూరుజిల్లానుండి కొంతమందిని, ఆవిధంగా జిల్లాలనుంచి తీసుకువచ్చారు. వారలకు ఇవ్వడానికి తగినన్ని ఇండ్లు ఇక్కడ లేవు. వారికుటుంబాలు అన్నీ వారివారి జిల్లాలలోనే ఉన్నవి. అందువల్ల వారికి ఖర్చు ఎక్కువగుచున్నది. అలాంటివారలకు ఇంకా ఎక్కువజీతం ఇవ్వాలని I. G గట్టిగా చెబితే వారలకు అదనపు అలవన్సు ఇచ్చాము. పోనీ ఇక్కడ తాలూకాలో ఉన్న పోలీసు కానిస్టేబిల్సుకు జీతం ఎక్కువచేస్తే మిగతా జిల్లాలలో ఉన్నవారందరికి కూడా ఎక్కువచేయాలిగదా? you cannot discriminate that way. ప్రత్యేకంగా ఇతరప్రదేశములనుంచి వచ్చినవారికి చాలా ఇబ్బందులు ఉన్నాయి. Double expenditure అవుతోంది. ఇప్పుడు ఒక జిల్లాలోనే ఒకతాలూకా నుంచి ఇంకొక తాలూకాకు మారిస్తే ప్రత్యేక అలవెన్సు ఎక్కడ ఇస్తారు? Now what we are giving to them is not city allowance at all. You are making a mistake. It is an allowance which is being given to him because he has left his family there and he is living here alone and he has to incur additional expenditure here. ఆ కారణమువల్ల ఈ ఊరిలో ఉన్నంతకాలము మేము ఇస్తున్నాము. ఇతర జిల్లాలనుండి ఈ town కు వచ్చినవారలు ఎక్కువకాలము ఇక్కడ ఉండరు. ఇప్పుడు కొంతమందికి training ఇస్తున్నాము. వారు ట్రైనింగు అయివచ్చినతరువాత, వాళ్లను ఇక్కడ post చేస్తాము. They cannot claim this allowance, because they are being posted to this place. They are being trained for this place. But these people were trained for Nellore but posted in Kurnool. While their families are living in Nellore, they are obliged to live here. Therefore this special allowance is given to them. అంతేకానీ కొందరకు ఇచ్చి కొందరకు ఇవ్వకపోవడము జరుగదు. అలాంటి పరిస్థితులలో ఉన్నవారందరికీకూడా ఈ ప్రత్యేకమైన అలవెన్సు ఇవ్వడము జరిగింది.

[28th July 1955

SRI P. SUNDARAYYA :—వీరు బయటనుంచి వచ్చినవాళ్ళకు ఇస్తున్నాము, ఇక్కడవున్నవాళ్లకు ఇవ్వడము లేదంటున్నారు. ఇక్కడ వున్నటువంటివాళ్లకు ఇస్తూ తాలూకాస్టేషనులో పనిచేస్తున్నటువంటి పోలీసులకు అది ఇవ్వడములేదు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—I will again tell it to make it clear. ఇప్పుడు ఏమైనదంటే తాలూకాపోలీసులు ఈ జిల్లావాళ్లు ఉంటారు. ఈ జిల్లావాళ్లను ఈటవునులో ఎవ్వరినీ వుండనివ్వరు. వారు ఇదివరకు ఇక్కడ వున్నవారేగాని, ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత వచ్చినవారు కారు. వాళ్లు local people. ఈ అలవెన్సు, సిటీ అలవెన్సుకాదు. You are making a mistake. I must make it clear to you. సిటీ అయినదని, కాపిటలు అయినదని ఇచ్చిన అలవెన్సుకాదిది. కుటుంబమును ఎక్కడో వదలివచ్చినవారు కాబట్టి అటువంటివారికి మాత్రం ఈ allowamce ఇస్తున్నాము. ఎవరో తాలూకా స్టేషనులో వుంటున్నారని చెప్పి వారు అంటున్నారు. వారు ఇక్కడ రెగ్యులర్ గా వుంటున్నారు.

SRI PILLALAMARRI VENKATESWARULU :—కర్నూలు town Police కు సంబంధించినవాళ్లకు కొంతమందికి ఇస్తున్నారు. వారు ఇతర జిల్లాలనుంచి వచ్చినవారుకారు. ఇక్కడనే వుంటున్నారు. వారు town లో వుండి సిటీడ్యూటీ చేస్తున్నందుకు వాళ్లకు ఇస్తున్నారు. వారు యిక్కడనే నివాసము ఏర్పరచుకున్నారు. వారి కుటుంబములు యిక్కడే వున్నవి. చాలాకాలమునుంచి యిక్కడనే ఉన్నారు. వారికి సిటీ అలవెన్సు యిస్తున్నారు. తాలూకాలలో వున్నటువంటివారు, సబ్ జైలుడ్యూటీ, తాలూకా ఆఫీసుడ్యూటీ, చేస్తున్నటువంటివాళ్లు మధ్యమధ్య అసెంబ్లీడ్యూటీ చేస్తున్న 25 మందో 30 మందో వున్నారు. వాళ్లు "మేముకూడా యిక్కడనే వుంటున్నాము కదా మాకుకూడా ఆఅలవెన్సు ఇవ్వమని" అడుగుతున్నారు. కర్నూలులో వున్నవాళ్లకు యిస్తున్నారు, అనంతపురంనుంచో నెల్లూరునుంచో వచ్చినవాళ్లకు ఇవ్వడము లేదు.

THE HON. SRI N. SANJEEVA REDDI:—అది ఏకో 2 తాలూకాలనుంచి special duty లో వచ్చివుంటారు. అప్పుడు ఇవ్వలేదని ఏదోచెప్పిఉంటారు. It looks something like that. Any way I will enquire into it. If there is really any discrimination between the one and the other, I will certainly get it rectified. There is absolutely no difficulty about it. అది చాలా చిన్నవిషయము. సుందరయ్యగారు

Sri N. Sanjeeva Reddi] [28th July 1955

పోలీసులు, జమీందారులకు మద్దత్తు ఇవ్వడము జరుగకూడదు అంటున్నారు. నేను కూడా మొదటనుంచి అదే చెబుతున్నాను. పోలీసులు ఇటు కాంగ్రెసు పక్షముగా కుండా, కమ్యూనిస్టుపక్షము లేకుండా శాంతి భద్రతలను కాపాడుటకు వున్నారు. మనందరముకూడా వారలకు తోడ్పడితే శాంతిభద్రతలు కాపాడ్డానికి వీలవుతుంది. ఈ పోలీసులు ఎవరికీ ఏజెంట్లు కారు. అలాంటి పరిస్థితులను మనము కలిగించాలి. రెండు జిల్లాలలోమాత్రము కొంచెము అవి రావడము కష్టంగా వున్నది. ముఖ్యముగా కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాలలో అటువంటి పరిస్థితులు రాలేదు. అలాంటి పరిస్థితులు కల్పించడానికి మిత్రులంతా తోడ్పడితే పోలీసువారు ఎవరికీ ఏజెంట్లుకారు. నేను ఎక్కడికిపోయినా ఈ విషయమే అందరికి చెబుతున్నాను. వారి కర్తవ్యము law and order:maintain చేయడమే. ఆ కర్తవ్యమును పోలీసువారు సక్రమంగా నిర్వర్తించాలని, నిష్పాక్షికంగా ఉండాలనే ఉద్దేశ్యముతోనే ప్రయత్నము చేస్తున్నాము. దానికి మీరందరూ దోహదము ఇస్తే ఏదైనా జేయడానికి వీలవుతుంది. కారులకు నిప్పు పెడుతున్న మాట మనము కాదన లేము. వాములు తగులబెడుతున్న మాట కాదనలేము. కుప్పలు తగులబెడుతున్న మాట లేదనలేము. ఎవరినో అరెస్టుచేస్తున్నారంటే ఏమీ చేయకుండా ఎట్లా ఉండేది ? ఏదో ఒక action పోలీసువారు తీసుకోవాలి. ఇప్పుడు ఎక్కడో ఒక కుప్ప తగులబడింది. వాడు ఏడుస్తూవస్తాడు. అయ్యా నా కుప్ప తగులబడింది. ఫలానా వెంకటేశ్వర్లుగారు అట్లా పోతోంది నేను చూచాను అంటాడు. వెంకటేశ్వర్లుగారు M.L.A. గనుక ఆయనను అరెస్టుచేసేందుకు వీల్లేదు అంటే ఏమవుతుంది. After all some evidence is there. నేను చూచాను అంటాడు. Circumstancial evidence, direct evidence ఎక్కడ అయినా వుంటుందా ? మిస్ జేమ్సు అనే స్త్రీ రైలులో వస్తుంటే విశాఖపట్టణం, అనకాపల్లి స్టేషన్ల మధ్య అరగంటలోనే ఆమెను చంపారు. దానిని ఎవరూ చూడలేదు. Circumstantial evidence మీద కేసుపెడితె నిలుస్తుందని నేను అనుకోలేదు. ఆ కేసు సెషన్సుకోర్టులో కన్విక్షను end అయింది. ఒక తను దిగుతున్నప్పుడు ఒక పబ్లిక్ ప్రాసిక్యూటరు చూచాడు. ఆమెను చంపుతున్నప్పుడు చూడలేదు గాని, అతను రైలు దిగుతున్నప్పుడు చూచాడని చెప్పారు. ఆ circumstantial evidence క్రింద కరక్ట్‌మనుష్యులను ఇద్దరిని చూడగలిగారు. అది కన్విక్షనులో end అయింది. ఆ రకంగానే కుప్పలు తగులబెట్టినప్పుడు రిపోర్టుఇస్తే ఆ వెంకటేశ్వర్లుగారు (అంటే Mr. X అనుకోండి) ఆ దినము ఈ వూరిలో నేవున్నారు, నాపైన ఆయనకు కోపమువున్నది, ఈ పని ఆయనేచేసి

వుంటాడు, ఆయన చేస్తుంటే Mr. Y. చూచినాడని evidence ఇచ్చినప్పుడు అరెస్టుచేయకుండా పోలీసువారు ఏమీ చేయకుండా ఎట్లావుండాలో మార్గాలు చూపించండి. కుప్పలు మీరు తగలబెట్టారని కాదు. ఇంకొకరు తగులబెట్టారని కాదు. అసలు కుప్పలు తగులబడితే విచారణ చేయకపోతే పోలీసులు ఎందుకు ? విచారణచేసి ఎవరిని అరెస్టుచేసినా సరే అక్రమంగా మమ్ములను అరెస్టుచేసినారని అంటే కేసు ఎట్లా ప్రొసీడ్ అవుతుంది? తగులబెట్టకుండా ఏమీలేకుండా అది విచారణజరిగి imaginary circumstances లో ఎక్కడైనా కుప్పలు తగులబడినప్పుడు ఎవరినైనా అరెస్టుచేస్తే తప్పుడు కేసులు పెడితే నా దృష్టికితీసుకొని రండి. I shall be very hard in such cases.

SRI P. SUNDARAYYA :—కొంతమంది భూస్వాములు వాళ్ళకుప్పలు వాళ్ళే, వాళ్ళవాములు వాళ్ళేతగులబెట్టుకొని కమ్యూనిస్టులు తగులబెట్టారని కేసులు పెట్టిన సంగతి మంత్రిగారికి తెలుసా ? ఎల్లాయిూపాలెంలో అటువంటి సంఘటనలు జరిగాయని మీ దృష్టికి తీసుకువచ్చాము. అది తెలుసా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అలాంటి కేసులు చూడడం చాలా కష్టము. It is a matter of faith in the news that he gets. వాళ్ళే తగులబెట్టుకొని మీపైన పెట్టారని ఎవరైనచెబితే సుందరయ్యగారు నమ్మవచ్చు. ఫలానావారు ఇది తగులపెట్టారని పోలీసులను రిపోర్టు ఇస్తే, మేము నమ్మనచ్చు. It is a matter of belief దానిని నేను ఏమీచేయడానికి వీలు లేదు. వాళ్లకొంపలు వాళ్లు తగెలబెట్లుకొని ఎవరిపైనో కేసుపెట్లాలంటే I don't think. I can do much in such cases. అటువంటి కేసులు ఎక్కడనో ఒకటి రెండు ఉంటున్నాయి. అటువంటివాటిని correct గా spot out చేసి ఈ కుప్ప ఒక్కటీ స్వంతముగా తగులబెట్టుకున్నారు, మిగిలినవన్నీ ఫలానివారు తగుల బెట్టారనడం చాలాకష్టము. పోలీసులు జమీందారుల ఏజెంట్లు అనో, భూస్వాముల ఏజంట్లనో అన్నారు. ఎవరు యిక్కడ భూస్వాములు. ఎంతమంది భూస్వాములు ఇక్కడ వున్నారు. సాధారణముగా చిన్న రైతుల కుప్పలు తగులబడి పోతు న్నాయి. కాని ఎక్కడనో వేలకొలది ఎకరాలు వున్నవాడియొక్క, లక్షాధికారి యొక్క కుప్పలుమాత్రం కాదే. అటువంటి చిన్నరైతుల కుప్పలు తగులబడినప్పుడు కూడా, మన భూస్వాముల కుప్పలు ఎవరో తగులబెట్టా రనుకోవడం ఏమీ లాభం లేదు. కనుక మనముఅంతా కలసి ఈ దుర్మార్గమును హర్షించకుండా ఉంటే పోలీ సులకు దోహదముచేసినవార మవుతాము. పోలీసులు నిష్పాక్షికంగా ఉండడానికి

Sri N. Sanjeeva Reddi] [28th July 1955

అవకాశములు కల్పించినవార మవుతాము. అటువంటి పరిస్థితులు మనముకల్పించాలని ప్రార్థిస్తున్నాను.

SRI B. SANKARAIAH :—Enquiry లో ఫలానివారు అని తేలినప్పటికికూడా D.S.P., Collector ఇంకా కమ్యూనిస్టులమీద కేసులు పెట్టారని అన్నారు. అటువంటివి ఆలోచిస్తారా ?

THE HON SRI N. SANJEEVA REDDI :—Enquiry లో ఫలాని వారు అని తేలివుంటే ఎందుకు కేసు పెట్టారు. మీరు అట్లా అనుకుంటున్నారు. వాళ్లకు తృప్తికరంగావుంటే వాళ్లమీద కేసులు ఎట్లా పెట్టరు. వాళ్లకు తృప్తికరంగా లేదన్నమాట. శంకరయ్యగారు అట్లా అనుకొంటున్నారు. ఇంకె ఏవో అనుమానాలు వుంటాయి. కాబట్టి కేసు పెట్టివుంటారు.

SRI P. SUNDARAYYA :—ఇతరుల పలుకుబడివల్ల.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇతరుల పలుకుబడివల్ల పెడతారని నేను అనుకోను. ఆ పలుకు బడిని ఎవరు అయినా ఉపయోగించవచ్చు. ఇదివరకు కాల్చిన వారంతా స్వంతముగా కాల్చలేదు. సుందరయ్యగారి పలుకుబడి వల్ల కాల్చి వుండవచ్చును. కాబట్టి పలుకుబడిని గురించి చెబుతూ కుప్పలు కాల్చిన అరెస్టు చేయించిన వారంతా పలుకుబడిగల జమీందారులని వారు మీారేనని, అను కుంటూపోతె దానికి అర్థములేదు. తగులపెట్టినవన్నీ మీారు తగులబెట్టారనే భావములో కొందరు ఉండవచ్చు. కుప్పలు తగులబెట్టినందుకు ఎవరిని అరెస్టుచేసినాసరే ఇదంతా భూస్వాములు చేయించారనే భావములో వుండవచ్చు. It is not a holp to the country. తగులబెట్టినవాడు ఎవడుఅయినా కానీ యండి వాడు దుర్మార్గుడే. మనము అంతాకలసి శాంతియుతంగావుండి ఆదుర్మార్గాన్ని కంట్రోలు చేస్తే మనకు, మనరాజకీయ పార్టీలకు, దేశానికి క్షేమకరము. ఆవిధముగా చేయడానికి కృషిచేస్తాము. దానిలో అభిప్రాయభేదాలు ఎక్కడా లేవు. కుప్పలు తగుల బడాలని మీారు ఎవరూ అనరు. అవి తగులబడకుండా శాంతియుతమైన పద్ధతులు కలుగచేయడానికి కృషిచేస్తాము, ఇప్పటికైనా అటువంటి దుర్మార్గాలు జరుగు తున్నాయని నాదృష్టికి తెస్తే విచారిస్తాను. ఇట్లాంటివి గుడివాడలో కొన్ని కేసులు జరిగాయని, జరుగుతున్నాయని ఇద్దరు, ముగ్గురుమంత్రులు నాకు information ఇచ్చారు. వెంటనే గుడివాడపోవడం తటస్థించింది. అక్కడవున్నటువంటివాళ్లతో discuss చేశాను. న్యాయంగా ఎట్లావుండాలో ఏమిటో నాకుతోచిన సలహాలను

ఇచ్చివచ్చాను. కనుక let us try to maintain law and order and help the police.

ఇక కట్ మోషన్లు పెట్టినారు. చక్కని సలహాలు యిచ్చినారు. మాట్లాడినారు. ఈ cut motion లు అన్నీ వుపసంహరించుకొని demand ను ఏకగ్రీవంగా ప్యాసుచేస్తూ పోలీసు సిబ్బందికి ధైర్యసాహసాలు కల్పించాలని ప్రార్థిస్తున్నాను.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :—On a point of information అధ్యక్షా, మా నర్సపట్టణం తాలూకాలోని, ఉరట్ల గ్రామానికి, పాయికరావుపేట గ్రామానికి Police station లు పెట్టమని చెప్పాను. దానిసంగతి ఏమి చేశారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇంతకుముందు అప్పారావుగారు అడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పాను. పోలీసు, ప్రొహిబిషను శాఖలు కలపడానికి ప్రయత్నము చేస్తున్నాము. అప్పుడు పోలీసుస్టేషనలు ఎక్కువ అవుతాయి. అంతగా కావాలంటే జనవరి అయినతరువాత మీ వూరికి పోలీసుస్టేషను కాకపోతే అప్పుడు చూస్తాను. రాష్ట్రీయము అంతా కూడా ఈ రెండు శాఖలను కలపడం జరుగుతుంది. అప్పుడు మీ వూరికి, వారి వూరికికూడా పోలీసుస్టేషనల పెట్టడం జరుగుతుంది.

MR. SPEAKER : Now we come to the cut motions.

SRI P. SUNDARAYYA : I am pressing my cut motion.

House to withdraw your cut motion.

MR. SPEAKER : I shall now put Mr. Sundarayya's cut motion (No. 311) to the vote of the House. The question is :

"To reduce the allotment of Rs. 2,65,19,700 for Police by Rs. 100.

పోలీసు ఉద్యోగస్తులు, ప్రజలపై పూర్వములాగే పెత్తనము చెలాయించడము, సెక్షను 107, 109, 110, 151 లను వినియోగించి అక్రమ అరెస్టులు, కేసులు పెట్టుతూ ఉండడము వలన"

The motion was declared lost. Sri P. Sundarayya demanded a poll. A voice vote, asking the Members in favour and against the motion to stand up in the House, was taken and 19 voted for the motion and 92 voted against the motion. The motion was lost.

All the other cut motions were put to vote and lost.

MR. SPEAKER : The question is :

"That Government be granted a sum not exceeding Rs. 2,65,19,700 under Demand No. XIV—Police."

The motion was carried and the grant was made.

The House then adjourned to meet again at 11 a.m. the next day.

